# తొలి పలుకు

ప్రతి సంవత్సరము హిందువులు ఆశ్వయుజ మాసారంభమున భగవంతుని "దేవి"గా భావన చేసి పూజింతురు. ఇదేల? పరిమితుల నన్నింటిని దాటి, పరమేయ మగునది యేదియుగాక శాశ్వతముగ ప్రకాశించు భగవంతుని గుట్టును తెలియుటకై, నరుని బుద్ధిలోకమున నుద్భవమైన నాటినుండియు గాఢ ప్రయత్నములు సాగుచునేయున్నవి. ఈ దృశ్యరూపముల లీలతో తృప్తినందక యీ యింద్రియ గోచరమగు జగమునకు అవల నేమికలదో, గ్రహింపవలయు ననెడు మానవుని యారాటము వానికి శాంతిలేకుండ చేయుచున్నది. ఈ అఖండతత్త్వము యొక్క జాడలు తళుకు తళుకుమనగా పొడగాంచినవారు పురాతన కాలము నుండియు తమ యనుభవములను ప్రకటించుటకై పెనగులాడు చుండిరి. దానికి అనేక నామములు పెట్టిరి. కొందఱు దేవు డన్నారు; కొందఱు సృష్టికర్త యన్నారు; కొందఱు విశ్వకర్మ అన్నారు; కొందఱు మూలకారణ మన్నారు: కొందఱు ప్రధాన మన్నారు; కొంద ఱాదితత్త్వ మన్నారు; కొందఱు ఎహోవా అన్నారు; కొందఱు పరమపిత అన్నారు; కొందఱు అల్లా అన్నారు; కొందఱు కాళి అన్నారు; కొందఱు కామాక్షి అన్నారు; కొందఱు ఆదిశక్తి అన్నారు; కొందఱు దేవి అన్నారు; భిన్న భిన్న రూపములను గుణగణములను గూడ నారోపించి యున్నారు.

ఎంద ఱెన్నెన్ని పేరులు పెట్టినను అందఱును విశ్వమున కాధారమై పఱగు అఖండ సనాతన చైతన్య తత్త్వమునే సూచించిరి. కొంత కొంత తారతమ్యముతో నున్న తమ అనుభవమునే యీ పేరులద్వారమున ప్రకటింప జూచిరి. ఈ సూత్రము నెఱింగిన హిందువు లాయా సమయములందు, ఆయా నామరూపముల నారోపణ చేయుచు ఆ మహాతత్త్వమును ఆరాధింతురు. మత వైషమ్యముల కిందు తావులేదు. మత మనెడు పేరు గిట్టని నిరీశ్వరవాదులు సయితము ఈ తత్త్వమును కాదనరు. ఏమన, ఈ సమస్త చరాచర భూత ప్రపంచమునకు "కారణము

లేని కార్యముండజాల"దను విశ్వసమ్మత శాస్త్రనిర్ణయము ననుసరించి యేదియో యొకటి అది కారణముగా నుండి తీరవలయునని వారు నొప్పు కొందురు. ఇతరులు పెట్టిన పేరులను వా రంగీకరించరు. అజ్ఞేయ తత్త్వ మనియో, ప్రకృతియనియో, నైజమనియో, శూన్యమనియో, తుదకు "ఏదియో" అనియో ఆ మూలకారణమును సూచించియే యుందురు. దానినే తమ తమ యనుభవములను, విజ్ఞానమును, సంస్కృతి ననుస రించి ప్రజలు వివిధ నామరూపముల ఆరోపణలతో భిన్న భిన్న రీతుల పూజించుటో, ఆరాధించుటో, ప్రార్థించుటో, ఉపాసించుటో జరుగు చున్నది. శ్రీ గాంధిమహాత్ముడు ఈ పరతత్త్వముతో తనకు గల్గిన యను భవములను దానింగూర్చి ప్రార్థనాదులు గావించుటవలన తనకును తన యనుచరులకును లభించిన ప్రయోజనములను వివరింపుచు ననేక వ్యాసముల రచించి యున్నాడు; పెక్కు ఉపన్యాసములలో ప్రస్తావించి యున్నాడు. శ్రీ గాంధిమహాత్ముడు తెలిపిన యంశములు 'దైవీశక్తి' అని పేరిడిన యీ గ్రంథమునందు తెలుగు భాషలో శ్రీ తత్వానందస్వాముల వారి వలన అనువదింపబడి యున్నవి. దీనిని పఠించుటయు అందలి పద్బోధల ననువర్తించుటయు తరుణోపాయ మగు గాక యని విశ్వ సించుచున్నారము.

విరోధి, వైశాఖ
శుద్ధ తదియ

—ప్రకాశకులు

# విషయసూచిక

## ప్రథమ భాగము



## ద్వితీయ భాగము



## తృతీయ భాగము

## చతుర్థ భాగము



## పంచమ భాగము

# దైవీశక్తి

## ప్రథమ భాగము

### పొరబడు నరుడను

నేనొక యీశ్వరాదేశమును పొందిన దేవదూత నని ప్రకటించిన యొక పత్రికలోని కాగితపు ముక్కను నాకు పంపి, మీకేమైన ప్రత్యేకముగా దివ్యప్రబోధము కలిగినట్లు చెప్పఁగోగలరా యని నన్నొకరు ప్రశ్నించినారు.

స:—ఈ విషయములో నే నా తీరున చెప్పుకొన జాలనని యొప్పుకొనవలసిన దే. యోగ్యుడగు ప్రతి హిందువు చేయు నటులె, నేనును ప్రార్థన చేయువాడను. నరుని గురించి భయ పడుటమాని, భగవంతుని యథార్థదర్శనమును పొందుటకు

దీనిపూని ప్రయత్నింతుమేని, మన మందరమును దేవుని దూతలు కాగలమని నా నమ్మకము. కేవలము భగవంతుని యథార్థదర్శనమును చేయుట కొఱకు యత్నించు చున్నా ననియు, నరుని గుఱించిన భయమంతయు పోగొట్టికొని నాననియు, నేను గట్టిగా నమ్ముచున్నాను. మఱియు సహాయ నిరాకరణోద్యమమును భగవంతు డామోదించు చున్నా డనియు నా అభిప్రాయము. భగవంతుని ఇచ్ఛ యేమో ప్రత్యేకముగా నాకు తెలుపబడెనని చెప్పజాలను. కాని ప్రతి మానవునకును, అనుదినము, భగవంతుడు ప్రత్యక్షమగు చున్నాడని యే నాకు గట్టి విశ్వాసము. అయినను భగవంతుని సూక్ష్మవాణి వినకుండ మన చెవులను మూసికొనుచున్నారము; మన యెదుటనే యున్న యా జ్యోతిని చూడకుండ కన్నులను మూసికొనుచున్నాము. భగవంతుడు సర్వవ్యాపకుడై యుండు టను నేను గ్రహించినాను. నన్ను గుఱించి యీ ప్రశ్నించువారు సైతము అటుల గ్రహించుట కభ్యంతర మేమియు లేదు.

## అనుచితపు పోలిక

రోమను క్యాథలిక్ మతస్థు లొకరు క్రింది యంశములతో కూడిన పెద్ద ఉత్తరమును వ్రాసిరి :—

"మీ జీవితమునకును, మీ చర్యలకును, క్రీస్తుయొక్క జీవిత చర్యలకును పోలికలను కల్పించుచు, జాతీయ పక్షపత్రిక

లందు గంభీరములగు శీర్షికలతో, వ్రాయబడిన లేఖలను పదేపదే నేను చూచియున్నాను. ఆ లేఖలను వ్రాయు వారీ తమ వ్రాతలతో తృప్తిపడక, భారతదేశ ప్రజలయెదుట గాంధీజీని అభినవ క్రీస్తుప్రభువునిగా ప్రదర్శింప సాగినారు కూడను! వీ రెంతవరకు పోదురో యని నేను వెఱగుపడి చూచుచుంటిని. ఈ లేఖలు మీా చెఱసాల శిక్షాకాలమున కొంతకాల మణగినవి. కాని మీా విడుదలతో నవి మఱల వెలువడజొచ్చినవి. అందును గుఱించి వ్రాయబడిన నా ఖండనలు ఫలదాయకములు కావయ్యెను. ఆ కారణముచేత మీాకీ ఉత్తరము నిప్పుడు వ్రాయుచున్నాను.

"దాదాపుగ వెఱ్ఱిలోనికి దిగిపోవుచున్న యీా మీా మీాది భక్తిశ్రద్ధలను మీా రామోదముతో చూడగలుగుచున్నారా! మీా మార్గములో మీారు దొడ్డవారే యనుట నెవరును కాదనరు. మీా విరోధులుకూడ ఆ మాట నొప్పుకొందురు. అయినప్పటికిని మీారు దేవుడు కారే! ఏది ఎట్లున్నను మీా యందు దైవత్వము కలదని మీారు చెప్పుకోగా నేను విని యెఱుగను. మీారు రాజకీయములను బోధించువారే గాని మత ధర్మముల నుపదేశించువారు కారు. ఇంతేగాక భార్యను, బిడ్డలను పెట్టుకొనిన గృహస్థులు మీారు. ఇట్లుండగా, మీా జీవితము నందును, మీా పనులందును క్రీస్తుతోడి పోలిక గ్రుడ్డిగా మిమ్మును గొప్పజేయు వీరలకెట్లు తోచుట సాధ్య

మైనదో! దేనిని గుఱించి మీరు ఉత్తమప్రచారకులై వెలయు చున్నారో, యట్టి దౌర్జన్యరాహిత్య సిద్ధాంత మిటువంటి పాలికను పోల్చుటలో బహుశః వారియెడ కారణమైయుండు నని నా తలంపు. ఇటుల చూచినను రాజకీయములం దొకా నొక ప్రయోజనమును సాధించుట కనువగు నుపాయముగా "అహింస" ను ప్రతి పాదించుటలో తీవ్రవాదిగా మాత్రము మీరు వర్తించుచున్నారు. ఇందుకు భిన్నముగా క్రీస్తు రాజ కీయములలోనికి దుముకనే నిరాకరించుటయేగాక, *"సీజరుకు జెందిన వానిని సీజరున కర్పింపుడు" అని యెల్లరకు బోధించి యున్నాడు. స్వభావముచేతనే సంకుచితపఱచి యణగద్రొక్క వేయు 'జాతి', 'జాతీయత' యనెడు హద్దులను దాటిపోయిన క్రీస్తు సర్వమానవ కారుణ్యము కలిగి దనుగుణముగ బోధిం పుచు జీవితమును గడపియున్నాడు. మఱియు ధర్మరక్షణకై శారీరక బలమును ప్రయోగించుట, తాను బోధించిన దివ్య సిద్ధాంతముల కేమాత్రమును విరుద్ధము కాదని సందేహమున కెడమీయని విధమున ప్రకటించియున్నాడు. కాబట్టి మిమ్ము గుఱించి పై విధముగా వ్రాసిన వారియెడ మీకెట్టి యామో దము గలదో యని నేను మిమ్ములనే యడుగుట సమంజసమై యున్నది..."

---

* రాజకీయములను రాజకీయములుగా నుంచుడు. వాని కాధ్యాత్మికము లతో జోక్యము కల్పింపవలదని భావము.

పై నసూచించిన పోలికను గుఱించి నా కుత్తరము వ్రాసిన వా రెంత బాధపొందిరో స్పష్టమగుచునే యున్నది. వీరి ప్రశ్నలకు ప్రత్యుత్తరముగా, పోలికలే నాకు గిట్టవని నే నిది వఱకు చెప్పుచునే యుండినటుల మఱల చెప్పదగును. అట్టి పోలికలవలన గలుగు లాభ మేమియు నుండదు. కాని యెవరి జీవితముతో నన్ను పోల్చినారో యా మహానుభావులయొక్క భక్తుల హృదయముల కనవసరముగా బాధమాత్రము కలుగును. నాలో ప్రత్యేకముగా దివ్యాంశ మే మేని కలదని నే నెన్నడును చెప్పుకొనజాలను. నే నొక ప్రవక్తననియు చెప్పుకొనుట లేదు. నేను సత్యమును గుఱించిన సామాన్యపు అన్వేషకుడను. దానిని ప్రత్యక్షముచేసికొను దీక్షగలవాడను. ముఖాముఖిని భగవంతుని ప్రత్యక్షముచేసికొన యత్నించుటలో నెట్టి త్యాగమైనను అధికమగు నని నేను తలంపను. సాంఘికమననీ, రాజకీయమననీ, జీవకారుణ్యమననీ, లేక నైతికమననీ, ఏమన్నను సరే. నా ప్రయత్నమంతయు ఆ యేకైక గమ్యముకొఱకే! ఘనులందును, బలాఢ్యులందును కంటె, తన సృష్టియందలి దీనులగు వారియందే భగవంతుడు హెచ్చుగా ప్రత్యక్షమగుచుండు నని నే నెఱుగుదును. అందువలన అట్టి దీనుల దశను చేరుటకే నేను అధికప్రయత్నము చేయుచున్నాను. ఈ పని అటువంటివారి సేవలేనిది కొనసాగదు. ఆ కారణముచేతనే నిమ్నజాతులసేవను గూర్చి నా తీవ్రకాంక్ష పఱగుచున్నది. రాజకీయములలో ప్రవేశింపకుండ

ఈ వారి సేవనుచేయ వీలుపడని కారణముచేతనే, రాజకీయములలో నేను జొచ్చుట తటస్థించుచున్నది. కాబట్టి నే నొక ప్రవక్తనుకాక, నేను తీవ్ర ప్రయత్నము చేయునట్టియు దబ్బిబ్బులు పడునట్టియు, భారతదేశపు దీనసేవకుడనుగ నున్నాను. అందునను సర్వమానవానురాగము ద్వారముననే, నేను నా దేశసేవ నర్పించుచున్నాడను.

* భారతదేశములో కావలసినంత మూఢవిశ్వాసము ఇదివఱకే యున్నది. గాంధిపూజ అను రూపముతో దాని నింక వృద్ధిపరుచు ప్రయత్నమును సర్వవిధముల నిరోధింప వలసినదే. నా మట్టుకు నాకు ఏ విధమగు పూజ లన్నను భయమే. యోగ్యతను వహించు వ్యక్తిని వేఱుపఱచి యోగ్యతను మాత్రము పూజించుట యని నాకు అభిమతము గలదు. ఆ పని వ్యక్తి యొక్క మరణానంతరమే పొసగ గలదు. రూపమునందేమియు లేదు. అది నాశవంతము. యోగ్యతయో నశించునది కాదు. అది ఒక వ్యక్తిలోనో, మరొక వ్యక్తిలోనో అవతరింపగలదు. పాపము 'గాండ్లు' అను జాతివారికి నన్ను గుఱించిగాని, నా యుద్యమమును గుఱించి గాని యేమియు తెలియదు. ఏ పురుషునకుగాని యేమేని ప్రసాదింపగల శక్తి నాకు లేదని యెఱుగుదును. నా యాత్మ

* 'గాండ్లు' అను అడవిజాతివారు మొదలిడిన గాంధీపూజను ఆక్షేపించువారికి తెలిపిన సమాధానము.

యే వ్యక్తికేని ప్రత్యక్షమగుటయు ననెడు భావమేనాకు వెగటుగా నుండును. అట్టి సాధనవలన ననర్థమును మోసమును మాత్రమేవాటిల్లును. నా కీ యుత్తరమును వ్రాసినవా రుదహరించిన పూజా విధానమును నణచివేయుడని నా సహచరులెల్లఱకును నొక్కి చెప్పుచున్నాడను. అమాయకులగు 'గాండ్ల'వంటి వారిని, మూఢవిశ్వాసముల ననుసరింప ప్రోత్సహించుట పాపకార్యమే యగును.

నా కుత్తరాలు వ్రాయు వారిలో కొందఱు నేను మహిమలు చూపగలనని తలంచునట్లున్నారు. సత్యారాధకుడ నగు నేను నా కటువంటి శక్తి లేదని వెల్లడించు చున్నాడను. నా యందు చూపట్టగల శక్తియంతయు భగవంతుని నుండి వచ్చునదేయై యున్నది. నిజమేకాని, భగవంతుడు తానుగా ప్రత్యక్షముగా పనిచేయడు. భగవంతుడు ప్రతినిధులద్వారా పనిచేయు చుండును. ప్రస్తుత సందర్భములో అట్టిది కాంగ్రెస్సుగా నున్నది. నాకుగల ప్రతిష్ఠయంతయు కాంగ్రెస్సు ప్రతిష్ఠద్వారా వచ్చినదే. ఈ కాంగ్రెస్సుకో దాని సిద్ధాంతముద్వారా ప్రతిష్ఠచేకూరినది. "సత్యము, దౌర్జన్యరాహిత్యము" అనెడు సిద్ధాంతములను కాంగ్రెసువాదులు విడచి పెట్టుదురేని కాంగ్రెసుకు గల ప్రతిష్ఠ యానాడే నసిపోవును. కాంగ్రెసుయొక్క మూలభావమునకు నేను ప్రతినిధిగా నిలువనినాడు, ప్రత్యక్షముగాగాని, అప్రత్యక్షముగాగాని నా

యందు గలవను యోగ్యతలకు నేమాత్రము విలువయు నుండజాలదని నొక్కి చెప్పగలను.

## సర్వము భగవంతుని యధీనము

"ఇంతకును నేనెంతవాడను? భగవంతుడు నాకు ప్రసాదించునది గాక నాకేలాటి బలమునులేదు. కేవలము నైతికముగ తప్ప నాదేశీయులమీద నాకేలాటి పలుకుబడియు లేదు. ఇప్పుడు భూలోకమున చిందులు త్రొక్కుచున్న ఘోరదార్జన్యమునకు బదులుగా దార్జన్యరాహిత్యమును వ్యాపింపచేయుటకై నిష్కళంకమగు సాధనముగా భగవంతుడు నన్నంగీకరించునేని, ఆయనయే నాకు బలము నొసగి మార్గమును చూపగలడు. నా చేతగల ఘనతరాయుధము మౌనముగా నేను చేయు ప్రార్థనయే. అందువలన నా శాంతి ప్రతిష్ఠాపన భగవంతుని యధీనమునందున్న దనవలయును. భగవంతుని స్వరూపమేమై, సనాతనమును, నిర్వికారమును నగు ఈశ్వర శాసనముద్వారా ప్రకటింపబడు వాని ఇచ్ఛవలన తప్ప, యేమియు జరుగజాలదు. మసకగానుండు అద్దముద్వారా దర్శించునట్లు తప్ప, మనము భగవంతునిగాని, భగవంతుని శాసనమునుగాని చూడజాలకున్నాము, అయినను లీలగా శాసించు ఈశ్వరశాసనమే భవిష్యత్తునుగూర్చిన ఆశా సంతోషములతోడను, విశ్వాసముతోడను నన్ను నింపివేయుటకు సమర్థమైయున్నది."

## భగవంతునియందు విశ్వాసము

ఇస్లామియా కాలేజీ పండితు డొకడు తనను నింక నీ తరము వారి న నేకులను బాధించుచున్న ' భగవంతునందలి విశ్వాస ' మను విషయమును గుఱించి శంకించుచు గాంధీజీ కటువంటి విశ్వాసము గలదా ? ఉన్నయెడల దాని కాధార మేమి ? అనియు తన కా విశ్వాసము కలదని గ్రహించుటవలన గాంధీజీకి కలిగిన యనుభవ మే మనియు ప్రశ్నింప మొదలిడెను.

గాంధీజీ సమాధానము :— అ దొక తర్జనభర్జనచే తేల్చ గల విషయము గాదు. వాదనవలన నితరులకు నచ్చ చెప్పు మని మీరు నన్నడుగు నెడల నేను పీటీమైనట్లే (ఓడిపోయి నట్లే). ఐనను ఈ గదిలో మీరును నేనును కూర్చుండి యున్నామనునట్టి యథార్థమున కంటె భగవంతుడున్నాడను యథార్థమున నా కెక్కువ నిశ్చల విశ్వాసము కలదని నేను మీకు చెప్పగలను. ఇంకను గాలి లేకపోయినను, నీరు లేక పోయినను నేను జీవింపవచ్చును గాని, భగవంతుడు లేక జీవింపజాల నని నేను సాక్ష్యముగూడ నిచ్చుచున్నాను. మీరు నా కన్నుల పెకలించి వేయవచ్చును; కాని యది నన్ను చంపలేదు. మీరు నాముక్కును నఱికివేయవచ్చును; కాని యది నన్ను చంపజాలదు. కాని భగవంతునియందు నాకుగల విశ్వాసమును భంగముజేసితిరా నేను చచ్చినట్లే. ఇదిమూఢ విశ్వాసమని మీరు పలుకవచ్చును. నా బాల్య

కాలములో నేమేని యపాయ కారణము కలిగినను, భయము కలిగినను రామనామమును శరణు జొచ్చెవాడను. ఈ విశ్వాసముగూడ నటువంటి మూఢ విశ్వాసమే నని నే నొప్పుకొందును. అది యొక ముసలిదాసి నా కుపదేశించి యున్నది.

ప్రశ్న.— సరేగాని, యట్టి మూఢవిశ్వాసము మీకు నవసర మనియే తలంచుచున్నారా?

స:— ఔను, నన్ను రక్షించుట కవసరమే.

ప్ర:— అట్లుంచుడు. భావిసూచకమగు దర్శనము వంటి దేమేని మీకుగలదా యని అడుగవచ్చునా?

స: — మీరు దర్శనమనునది దేనినో, భావిసూచకమను నది యేమిటో నాకు తెలియదు. కాని నాజీవితములోని యొక యనుభవమును మీకు తెలుపవలెను. జైలులో నా యిరువది యొక్క దినముల యుపవాసమును గుఱించి నేను ప్రకటన చేసి నప్పుడు, దాని విషయమై నేను తర్కించి యుండలేదు. ఆ క్రిందటి రేయి నేను ప్రక్కమీద పరుండబోయినపుడు, మరునటియుదయ మిరువదియొక్క దినముల యుపవాసముం గుఱించి నేను ప్రకటన చేయబోవుచున్నా ననెడు భావమే నాకులేదు. కాని యర్ధరాత్రివేళ నొక శబ్దము నన్ను లేపి 'ఉపవాసము సలుపుమ'ని చెప్పినది. నేను 'ఎన్ని దినము' లంటిని. 'ఇరువదియొక్క దినము' లని జవాబు వచ్చెను.

అట్టి యుపవాసమునకై నా మనస్సు సిద్ధపడియుండలేదనియు, నాకది యనిష్టముగ సయితముండెననియు గట్టిగ చెప్పగలను. ఐనను మఱేవిషయమైనను నెంత విస్పష్టముఁగా తెలియ వీలుం డునో అంతవిస్పష్టముగా నాకది తెలియవచ్చినది. ఇంకొక విషయమును మీకుచెప్పి ముగించెదను. నా జీవితములో నే నే ప్రముఖ కార్యములు చేసినను, తర్కముచే ప్రేరేపింపబడి చేసియుండలేదు. సహజప్రేరణచేత చేసియున్నాను. భగ వంతుని చేతనని నే నందును. 1930 సంవత్సరములో జరిగిన దండి యుప్పు సత్యాగ్రహమును తీసికొనుడు. ఉప్పుచట్టమును భంగపఱచు టెట్లు పరిణమించునో గోరంతసూచనయైనను నాకు కలుగలేదు. పండిత మోతీలాల్‌జీ మొదలగు మిత్రులు చిరబురలాడుచుండిరి. నేనేమి చేయనుంటినో వారికి తెలియ దాయెను. నేనును వారి కేమియు చెప్పజాలకపోతిని. దానిని గుఱించి నా కేమియు తెలియదయ్యె. కాని యొక మెఱుపు వలె నాకది స్ఫురించినది. అది దేశమంతను నొక ప్రక్క నుండి మఱొక్కప్రక్కకు నూపివేయునంత సమర్థమై పఱగుట మీ రెఱుఁగుదురుగదా! మఱొకటి తుది సంగతి, 1919 సంవ త్సరము ఏప్రియల్ 6–వదినము 'ఉపవాస ప్రార్థనా దినము'గా ప్రకటించుటను గుఱించి క్రిందటి దినమువఱకు నా కేమియు తెలియదు. కాని దానిని గుఱించి నా కొక స్వప్నము వచ్చినది. సరిగా నదే జరుగవలసిన పని యని నాకు స్ఫురించినది. 1930 సంవత్సరములోవలె శబ్దముగాని, దర్శనముగాని కలుగలేదు.

ఉదయము కాగానే యీ విషయమును రాజగోపాలాచారి గారితో చెప్పి దేశములో ప్రకటించితిని. ఎంత యద్భుతమైన అప్రయత్నపూర్వకమైన ప్రబోధము కలిగినదో మీకు తెలిసియే యున్నది.

## క్రియారూపమున సాక్షాత్కరించును

ప్ర:—కష్టములందును, సంశయములందును, శంకలయందును మీ ఆత్మకు గాఢతర తృప్తిని కలిగించునదేది ?

స:—భగవంతుని యందుగల సజీవవిశ్వాసము.

ప్ర:—మీ జీవితానుభవములలో సుస్పష్టమగు భగవత్సాక్షాత్కారము మీ కెప్పుడు కలిగినది ?

స:—భగవంతుడు క్రియారూపమున తప్ప, స్వీయమగు తన ప్రత్యేకరూపమున నెన్నడును నరునికి గోచరింపడని గ్రహించి, నే నట్టి విశ్వాసముతో నుందును. యీ విశ్వాసమే మహావిపత్సమయమునందు మనలను రక్షింపగలుగుచున్నది.

ప్ర:— భగవంతుని ప్రసక్తి లేకుండ సంఘటిల నసాధ్యములనదగు విషయములు కొన్ని సంఘటిల గలవని మీ యభిప్రాయమా ?

స:—అవును. అట్టివి మనకు తెలియకుండగను, హఠాత్తుగను సంభవించును. ఒక యనుభవము నాస్మృతిలో చాల

సుస్పష్టముగ నిలచియున్నది. అస్పృశ్యతా నివారణకొఱకైన నా యిరువదియొక్క దినముల యుపవాసమునకు సంబంధించినదది. ఆక్రిందటి రాత్రి నిద్రించబోవునప్పుడు మరునాటి యుదయముపవాస ప్రకటన చేయవలసి యుండునను తలంపు నాకిసుమంతయైనను లేదు. సుమారు రాత్రి 12 గంటల వేళ ఏదియో నన్ను హఠాత్తుగా మేల్కొలిపినది. ఏదియోశబ్దము వినవచ్చినది. లోపలనుండియో, వెలుపలనుండియో నేను చెప్పజాలను. "నీ వుపవాసము చేయవలయును." అను మందస్వరము వినిపించినది. "ఎన్ని దినములు" అని నే నంటిని. ఆవాణియే మరల "21 దినములు" అన్నది. "ఆరంభ మెప్పుడ"ని అడిగితిని. "రేపే యారంభింపు"డని చెప్పినది. తదను సారముగా నిర్ణయము చేసికొని, నిశ్చింతగా నిద్దురపోయితిని. మరునాడుదయపు ప్రార్థన ముగియువఱకు నా సహచరులలో నెవరికిని నే నేమియు చెప్పలేదు. నా నిర్ణయమును గుఱించి తెలుపుచు ప్రార్థనానంతర మొక కాగితపుముక్కను వారి చేతులలో పెట్టినాను. ఆ నిర్ణయ మనివార్యముగనుక నాతో వాదమునకు దిగవద్దని వారికి చెప్పివేసినాను.

సరే, డాక్టర్లు నే నాయుపవాసము ముగిసి, బ్రతుకజాలనని తలంచిరి. ఐనను నాలో నేదియో 'నేను బ్రతుకగల'ననియు దానిని సాగింపవలెననియు తెలిపినది. అంతకు పూర్వముగాని ఆ దినమునకు పిమ్మటగాని అటువంటి అనుభవము నా జీవితములో కలిగియుండలేదు.

ప్ర :— సరియే. అటువంటి విషయమున కేదేని దుష్ట హేతువు నుండగలదేమో నని మీ రూహింప రనుట నిశ్చయము.

స:—అటుల కాదనుట నిశ్చయమే. అది పొరబాటగు నేమోయని యెన్నడేని నేను తలంపనులేదు. నాజన్మలో నాధ్యాత్మ్యపేరితోపవాసము జరిగెనేని అదిదియే. ఆధిభౌతిక ముగా తృప్తినొసగ జాలనిది కొంతయున్నది. శరీరమును నిర్జించిననేతప్ప భగవంతుని ముఖాముఖిని చూచుట సాధ్య పడదు. భగవంతుని యాలయ మను భావముతో శరీరము నకు సంబంధించిన కార్యముల నిర్వహించుట యొక విష యము; మఱియు మాంసమయశరీరముగా దానికి సంబంధిం చిన కార్యముల విసర్జించుట వేఱొక విషయము నగును.

## ఈశ్వరవాణి శ్రవణము

"ఆక్స్‌ఫర్డు గ్రూపు" అను సమాజపు సభ్యులు గాంధీజీ నిట్లు ప్రశ్నించిరి:—

"మీరు భగవంతుని వాణిని వినుచున్నారు. భారత దేశములోని కోట్లకొలది జన మా భగవంతుని వాణిని వినుట మొదలుపెట్టిన యెడల మీ రెందుకొఱకై పాటుపడు చున్నారో యా సమస్యలు పరిష్కారమై పోవునని మా అభి ప్రాయము. ఈ యుద్యమములో మాకును స్థానము కలదని

తలంచుచున్నాము. అందువలన సంతోషముతో మీ కడకు వచ్చినాము.

స:—మిమ్ము ప్రేరేపించు నంతటి యుత్సాహము నాకును కలిగిన నే నెంతయో సంతసింతును. నేను 'ఈశ్వరవాణి' ని ఆలకించుటయొక్క అనుభవమును కలిగియే యున్నాను. విన నిరీక్షించుట మాత్రమే కాదు. నేను దాని నాలకించిన కొలది నేను భగవంతుని కింకను దూరముగా నున్నట్లధికాధికముగా తెలియవచ్చుచున్నది. నిర్దుష్టమగు శ్రవణము పొసగుటకే నియమముల పాటించుట ప్రధానమో, ఆ నీమములను నేను వివరింపగలిగినను సత్యముయొక్క యనుభవము నా కింకను చిక్కకుండ తప్పించుకొని పోవుచునే యున్నది. 'మేము ఈశ్వర వాణిని వినుచున్నాము; ప్రత్యుత్తరముల పొందుచున్నాము' అని మనము పలుకునపుడు యథార్థమునే మనమటుల పలుకుచున్నను గూడ, మనము భ్రమపాలవుటకును చాల నవకాశము గలదు. అట్టి భ్రాంతియు నాకు బొత్తిగ లేదని నేనన జాలను. నేను పొరబడుట లేదు గదా యని ప్రజ లప్పుడప్పుడు నన్నడుగుదురు. 'అవును, చాల నవకాశము గలదు. నేను చెప్పునది మీ యెదుట విస్తృతాకారము దాల్చిన నా చిత్తము యొక్క ప్రతిబింబమే కావచ్చును' అని నే ననుచుందును. ఒకానొక కార్యవిధానము నవలంబించుటలో తన కీశ్వర ప్రేరణ కలిగె నని

యొకడు వాదించుచుండగ, మఱొకడు అందుకు కేవల విరుద్ధమగు కార్యవిధానమును పూనుచు నదే వాదము చేయుటయు నెట్లు సంభవము కాగలదో చూడుడు. మీ కొక మంచి యుదాహరణము తెలిపెదను. రాజాజీని మీ రెఱిగి యుండవచ్చు; లేక వారి పేరునైనను వినియుందురు. భగవచ్చింతనయం దాయనను మించినవాడు లేరనుకొందును. సరే 1933 సంవత్సరమున యెర్రవాడజైలులో, 21 దినముల ప్రాయశ్చిత్తోపవాస దీక్షనుపూని, దానిని భగవంతుని యా దేశమున కనుగుణముగా పూనితినని నేను తెలిపినప్పుడు రాజగోపాలాచారిగారు నన్నా పూనికనుండి మానిపించు కొఱకై చెన్నపురినుండి ఎంతదూరమో ప్రయాణముచేసి వచ్చినారు. నేను భ్రాంతిపాలై పోయితిననియు, బహుశః నేను మరణింప వలసి వచ్చుననియు, ఒకవేళ చావుతప్పినను నిస్సందేహముగా, పిచ్చివాడనై పోదుననియు, ఆయనకు నిశ్చయముగా తోచినది. ఐనను నే నిప్పటికిని బ్రతికే యుంటి ననియు, నిర్మలచిత్తముతో నుంటిననియు మీరు చూచు చునే యున్నారు. ఐనను కూడ నేను భ్రాంతిపాలైతి ననియు ఏదో దైవవశాత్తు గండము గడిచెననియు రాజాజీ యింకను భావించుచునే యుండనోపు. మఱియు నా యభ్యంతరమున పలుగు సనాతన నూత్మ్మవాణి ననుసరించి నేనా యుపవాసము చేసితినని నేనును భావించుచునే యున్నాను. మనము సర్వత్ర ఈశ్వర వాణిని వినుచున్నామని నమ్ముట యెటుల న్యాయము

కాదో హెచ్చరిక చేయుటకో అకుమీకీవిషయము చెప్పుచున్నాను. అట్టి ప్రయత్నము చేయుటను గుఱించి నా కసమ్మతి లేదు సుడీ. వినను ప్రజానీకమునకు సులభముగ ప్రదర్శింపగల చేతిలోని యుసిరి కాయవంటి దానిగ తలంపగూడదని హెచ్చరిక గొలుపుచున్నాను. భగవంతుని నిర్ణయమును భారతదేశము వినునటుల చేయుటకై యూవచ్ఛక్తితోడ నేను ప్రయత్నించితి నని చెప్పిన నెవరును కాదనజాలరు. నాకు కొంత జయము చేకూరినది; కాని గమ్యమునుండి చాల దూరముగనే యున్నాను. మీరు తెలుపు రుజువులను విను నప్పుడు నేను హెచ్చరిక పూను చుందును. ఇంతేకాదు సంశ యాత్మకుడనుగూడ నగుచున్నాను. దక్షిణాఫ్రికాలో నొక బోధకుడు వచ్చి తాను చేయు నుపన్యాసానంతరము ప్రజల చేత త్రాగగూడదనుచు నిషేధము చేయు ప్రమాణ పత్రముమీద సంతకములు చేయించి యొక పుస్తక రూప మున ప్రకటించినాడు. ఆ ప్రమాణముల ననేకులు భగ్నము చేయగా నేను స్వయముగా చూచితిని. ఇయ్యది యా ప్రజల దోషముకాదు. ఆ బోధకునియొక్క వాగ్ధాటి చేత తాత్కా లికోత్సాహమునకు వశులై వారా ప్రమాణ పత్రము మీద సంతకములు పెట్టియున్నారు.

మెఱయునదెల్ల బంగారముకాదు. ఈత నేర్చినవాడు దాని నెన్నడును మఱచుట పొసగునట్లు ఈశ్వరవాణిని సత్యముగా

విడిన మానవుడు వెనుకకు దిగజారిపోవుట కలుగదు. ఈ విష యము నాకు తెలియును. అంతర్వాణి శ్రవణము నరుల జీవిత ములను నసుదినము ధన్యతరములుగ చేసితీరును.

మీ యుత్సాహమును భంగము చేయునట్లు తలంపకుం దురుగాక. సుస్థిరమగు కొండరాతి పునాదిమీద భవననిర్మా ణముచేయుట శ్రేష్టమగు విధమున, అంతఃశ్రవణము గూడ నిశ్చలమగు పునాదిపై నాధారపడియుండుట శ్రేష్ఠము. యీ యంత్రః శ్రవణము ఘటిల్లినదనిన ఆశ్రవణము చేయుటకు తగిన అర్హత యంతకు పూర్వమే కలిగినదన్నమాట. ఈ యర్హత యెడతెగకుండ నోర్పుతో సాగించిన సాధన వలనను, భగ వత్సేవ వలనను లభించును. శ్రీ శంకరాచార్యులవారీ ప్రయ త్నమును చిన్నగడ్డిపోచ కొనతో సముద్రపు నీటినంతను నెగ చిమ్మివేయు యత్నముతో పోల్చియున్నారు. కావున నీసాధన అంతులేక జన్మజన్మాంతరములు సాగింప వలసినదిగ నున్నది.

అట్లైనయ్యును గూడ, నీ సాధన కండ్లార్చుట, గాలి పీల్చుట వలె సహజచర్యగా జరుగవలెను. ఈ యింద్రియ వ్యాపార ములు మనకు తెలియకుండనె జరుగుచుండునుగదా. అట్లే ఈ సాధనయు మనము బ్రతుకుటయను వ్యాపారముతో సమ్మిళి తమై జరుగవలెను. మీ రిట్టి నిరంతర సాధనావిధానము నవలంబింతురని కోరుచున్నాను. తద్వారామాత్రమే మనము భగవంతుని ముఖాముఖిని చూడగలుగుదుము.

## ప్రయోజన కరానుభవములు

ప్ర:—మీ జీవితములోని మిగుల ప్రయోజనకరానుభవములేవి? మీ గతజీవితమును సింహావలోకనము చేసి చూచుకొను నెడల భగవంతునియందు విశ్వాసము పూను సందర్భమున సర్వమును మీకు వ్యతిరేక మార్గముననే నడచుచుండెను. ఎంతటి యసంభవముగ కాన్పించుచున్నను మట్టిలో నుండి ప్రాణము పుట్టుకొని వచ్చుచునే యుండెను. అట్టిచో భగవద్విశ్వాసము పూనుటలో మీకు ప్రేరణగల్గించిన యనుభవ మెట్టిది?

స:— అటువంటి యనుభవములు తండోపతండములు. కాని మీరు నన్ను ప్రశ్నించినారు గనుక నా జీవిత సరణిని మార్చివేసిన యొక ప్రత్యేకానుభవమును గురించి తెలిపెద గాక. అది నేను దక్షిణాఫ్రికా చేరినపిమ్మట నేడు దినములకు తటస్థించినది. నేను కేవలము నైహికమైనట్టియు, స్వార్థమైనట్టియు, నుద్దేశముతో నచ్చటికి పోయియున్నాను. ధనార్జన చేయకోరుచు, ఇంగ్లాండునుండి యప్పుడే తిరిగివచ్చిన పిల్లవానిగ నుంటిని. నన్నచ్చటికి తీసికొనిపోయిన కక్షిదారుడు హఠాత్తుగ 'డర్బను' పట్టణమునుండి 'ప్రిటోరియా' నగరమునకు రమ్మని కోరినాడు. అది తేలిక ప్రయాణము కాదు. 'చార్లుసుటౌను' వరకు రైలు ప్రయాణము సాగును. అచ్చటినుండి 'జోహాన్సుబర్గు' వఱకు బండిలో పోవలెను.

రైలుమీద పోవుటకై నాకు మొదటితరగతి టిక్కెట్టు కలదు. కాని పడక టిక్కెట్టులేదు. పడకలనిచ్చు నటువంటి 'మార్జ్ బర్గు' స్టేషన్ దగ్గర గార్డు వచ్చి నన్ను బయటికి నెట్టి వేసి 'వాను కంపార్టుమెంటు' లోనికి పొమ్మని చెప్పినాడు. నే నిష్టపడలేదు. చలిలో నేను వణకి పోవుచుంటిని. రైలు సాగిపోయినది. ఇట్టి సందర్భములో నా కా ప్రయోజనకర మగు ననుభవము వచ్చినది. నా బ్రతుకును గురించియే భయపడితిని. చీకటిగానున్న 'వెయిటింగు రూము' లోనికి ప్రవేశించినాను. ఆ గదిలో నొక తెల్ల దొరయుండెను. వానిని చూచి నేను భయపడితిని. "ఇప్పుడు నా ధర్మ మే"మని తర్కము సాగించితిని. నేను భారతదేశమునకు తిరిగి పోవల యునా? భగవంతునిపై భారమువేసి, నాకేమి వాటిల్ల నున్నను నెదుర్కొని ముందుకు సాగిపోవలయునా? అచటనే నిలిచియుండి బాధలు పడుటకు నిర్ణయించుకొంటిని. ఆచరణ రూపమగు నా 'అహింసా' సిద్ధాంత మా దినమున ప్రారంభ మైనది. ఆ ప్రయాణ సమయమున నే, భగవంతుడు నన్ను పరీ క్షలో పడవేసినాడు. * బండిలో నా కొసగ బడిన చోటును విడిచి తొలగుమని బండి నడుపువాడు నన్ను కఠినముగా బాదినాడు.

---

* బండి ప్రయాణములో గాంధీగారికి మొదట నిచ్చిన తావును, కొంత దూరము పోయిన పిమ్మట వేఱొకని కిచ్చుటకై లెమ్మనగా గాంధీగా రిష్టపడలేదు. అప్పుడు బండి నడుపువాడు గాంధీగారిని లాగివేసి కొట్టినాడు.

ప్ర:— ఆ దురవస్థలు దబదబ పైబడు చఱుపులు మీ హృదయమును కాల్చివేసి యుండును ?

స:— అవును. నా జీవితములో లభించిన శ్రేష్ఠతరమైన యనుభవములలో నదొకటిగా నుండెను.

## నా యుద్యమము

పంజాబు రాష్ట్రములో అమృతసరు నగరమందలి 'ఆల్ యిండియా సబ్ అసిస్టెంటు సర్జన్సు ఆసోసియేషన్' కు ప్రెసిడెంటగు ఘశిత రామపండితులు నాకొఱకుద్దేశించిన బహిరంగ లేఖను కొన్ని దినములక్రిందట 'యంగుఇండియా' పత్రికా సంపాదకునకు పంపియున్నారు. అందలి ముఖ్యాంసము లివి:— నేను బ్రాహ్మణుడను. డాక్టరును. మీవలెనే వృద్ధుడను. ఇట్టి మూడు అర్హతలతో మీకు కొంచెము సలహో నిచ్చుటకు పూనునెడల మర్యాదకు భంగము కలుగదు. ఇందులో విజ్ఞానమును, సత్యమును మీకు గోచరించి మీ సహజ వివేకమునకును, నభిప్రాయములకును ననురంజకముగా నుండు నెడల, దయచేసి నా సలహోను మనస్సున నిడుకొనుడు.

"మీరు ప్రపంచమును చాలవఱకు చూచి యున్నారు. దానిగుఱించి చాల చదివియున్నారు. ఆ హేతువుచేత మీ కద్భుతమగు లోకానుభవము కలిగినది. కాని మర్త్యలోకములో నింతవఱ కెవడును తానుపూనిన మహోద్యమమును

తన జీవితకాలములో సాధింప సమర్థుడై యుండలేదు. ఉదహారణకు బుద్ధు డుత్తమ నీతిధర్మావలంబియయ్యు కూడ తన బౌద్ధధర్మములోనికి భారత దేశమునంతను మార్చివేయ సమర్థుడు కాలేదు."

"శంకరాచార్యులు మహోన్నతశక్తి కలిగియుండియు భారతభూమి నంతను వేదాంతములోనికి త్రిప్పలేకపోయెను. క్రీస్తు గొప్ప ఆధ్యాత్మజ్ఞానియైనను యూదియాజాతి నంతను క్రైస్తవ మతము నవలంబించునటుల చేయలేకపోయెను. కాన మీ యుద్యమము గూడ పూర్ణముగ సిద్ధించునని నాకు నమ్మకములేదు. మఱియు నట్లగునని ఒక క్షణమైనను విశ్వాసము కుదుర్చుకొనజాలక యున్నాను. ఐనను చారిత్రక యథార్థవిషయములకు భిన్నముగా మీ జీవితములో సఫలత గాంతుమని మీరు నమ్మునెడల నట్టిది కేవలము స్వప్న భ్రాంతియే యని నేను చెప్ప సాహసించు చున్నాను."

"ఈ ప్రపంచము పరీక్షలకు, బాధలకు, చిక్కులకు స్థానమై యున్నది. మనుజుడు దానిలోనికి మునిగినకొలదిని శాంతి శూన్యుడగుచున్నాడు. తుదకు తన ఆధ్యాత్మిక నిశ్చలత్వమును మనోసంతుష్టిని కోల్పోవుచున్నాడు. ఆ కారణముచేత పూర్వకాలపు మహాత్ములు ప్రాపంచిక సంబంధములగు వ్యసనములను, పరితాపములను, అడియాసలను విడిచి దూరముగ పోయి పూర్ణశాంతిని మానసిక విశుద్ధసత్వమును సంపాదించు

టకై పాటుపడి, తద్వారా యెడతెగని సుఖమును శాశ్వతా నందమును పొందియున్నారు.

"జైలుజీవనము మీ జీవితములోను మీ సత్త్వము నందును గొప్పమార్పును కల్పించినది. మఱియు జబ్బువలన మీరు మిగుల బక్కచిక్కియున్నారు. కాబట్టి ఈ సందర్భము లలో మీరు శాంతజీవనమును గడుపవలెను. ఏకాంతముగా నే దేని గుహలో నీశ్వరధ్యానము చేసికొనుచు, పరిపూర్ణా ధ్యాత్మిక విశ్రాంతితో నిశ్శబ్దముగా కూర్చుండి, స్వాత్మదర్శ నము చేయుచు, మిగిలియున్న మీ జీవనతంతువును వడికి కొనుడు. ఏమందురా, ఇక మీదట ప్రాపంచిక తాపత్రయ భారమును వహించుటకు మీ యారోగ్య మవకాశము నొస గదు. మీ యెడ సుదాసులగు నుద్యోగులు జూపిన సదభి ప్రాయమును, కరుణను, సానుభూతిని మీరు పూర్తిగా గ్రహించి యుందురనిన తప్పుగాదు. మీరు పెక్కు సారులు దూషించిన యూరపియను ఔషధపద్ధతియే ఘోర మృత్యు ముఖమునుండి మిమ్ముల రక్షించినది. ఇంగ్లీషు ఆఫీసర్లు మీ కష్టావసరకాలమున మీకు సాహాయ్యము చేసియున్నారు.

"అవసర సమయమున నక్కఱకు వచ్చు మిత్రుడే నిజ మైన మిత్రుడు. మీ ప్రాణరక్షణం గురించియు, మీ జైలు విడుదలం గురించియు కృతజ్ఞతను వెలిబుచ్చుకొఱకు, సత్య ముగు మీ మిత్రభావమును చూపుచు, బ్రిటిషురాజు నెడ

యథార్థమగు సహకారియై మెలగుట మీ కింకను శేషించి యున్న ధర్మమగును. ఐనను మాటలరూపముననుు, చేతల రూపముననుు మీ రటుల చేయజాలకపోదురేని, రాజకీయ కర్మక్షేత్రములో ప్రవేశించుటైనను మానవలయునని నా ప్రార్థన. ఐనను చంచలమగు హృదయము మిమ్ము శాంతముగా కూర్చుండనీయని యెడల మహర్షులకు, మునులకు కన్నతల్లియగు నీ భారత భూమిలోని మీ సోదర భారతీయుల కాధ్యాత్మ తత్వబోధచేయు పనిని పూనుకొని, యథార్థమగు నాత్మసాక్షాత్కారమును పొందు పాఠమును నేర్పుడు. అటుల చేయుటవలన నిహలోక రాజ్యమును సంపాదించుకొనుటకు మారుగా ఆముష్మిక రాజ్యమును మీరు సంపాదించు కొనినవా రగుదురు.”

స:—ఈ ఉత్తరమును వ్రాసినవారు నిష్కపట భావము గలిగి తపించిపోవుచున్నారు. కాబట్టి మఱెందుకు కాకపోయినను, ఆకారణము చేతనైనను, సమాధానము చెప్పుట ధర్మమని నా యభిప్రాయము. మఱియు నా జీవితములో నే పూనిన యుద్యమము నెడల పొసగిన కొన్ని యపోహాలను పోగొట్టుటకును నాకు వీలగును. సరే మొట్టమొదటగా ఔషధాలను గురించిన నా యభిప్రాయ సందర్భమున వారి సలహాను విచారింతుగాక. ‘భారత స్వరాజ్య’ మను పుస్తక మిప్పుడు నా యెదుట లేదు. ఐనను నందు నే తెలిపిన భావము

లను మార్చుకొనుటకు తగిన కారణమేమియు లేదని చెప్ప జాలునంతటి జ్ఞాపకము నాకు గలదు. ఆ గ్రంథమును ఇంగ్లీషు వారి కొఱకై యింగ్లీషు భాషలో నేను వ్రాసియుండిన యెడల, ఆ యభిప్రాయమునే ఇంగ్లీషువారి చెవి కెక్కువరకు రమణీయముగా నుండు తెఱగున తెలిపియుందును. దాని మాతృకను గుజరాతీభాషలో, నేటాలునందలి 'ఇండియన్ ఒపీనియన్' పత్రికాపాఠకులగు గుజరాతీ వారికొఱకై వ్రాసి యున్నాను. ఇంతేగాక అందులో నొక యాదర్శస్వరూపము నభివర్ణింపుచు వ్రాసియున్నాను. చేతలను ఖండన చేయు నపుడు అందు వ్యక్తులప్రసక్తి యున్నదని తలంచుట సామాన్యముగా జరుగు పొఱపాటే. ఔషధసేవనము రోగియొక్క ఆత్మను తఱుచుగా జడప్రాయము చేయుచున్నది. అందువలన దాని నొక యనర్థముగా గణింపవచ్చును. ఐనను వైద్యులనే యటుల భావించి తీరవలెనను నీమములేదు. నా గ్రంథము వ్రాసినప్పు డుత్తమవైద్యులగు స్నేహితులు నా కుండిరి. మఱియు నవసర సమయములందు నేను వారి సలహాలను కోరుటకును వెనుదీసి యుండలేదు. అటులకోరుట నాకీ యుత్తరము వ్రాసినవారు భావించునటుల ఔషధప్రయోగ మును గుఱించిన నా యభిప్రాయమునకు విరుద్ధమగును. యీ యభిప్రాయమునే యక్షరాల నవే పలుకులతో మిత్రు లనే కులు నాకు తెలిపియున్నారు. నాది దోషమే నని ఒప్పు కొందును. ఐనను అటులనే నంగీకరించుట నేను నిర్దుష్ట మాన

వుడ కానని యంగీకరించుటే యగును. దురదృష్టవశమున పూర్ణత్వమునకు నేను చాలదూరమున నున్నాడను. నేను పరిపూర్ణత్వమును ప్రాప్తించుటకై యత్నించు నొక వినమ్ర సాధకుడను. దాని సాధించుమార్గముగూడ నాకు తెలియును. ఐననేమి? మార్గము నెఱుంగుట గమ్యమును చేరుట కాదు గదా! నేను పరిపూర్ణుడనై సంకల్పములందు సైతము నా వాసనలన్నిటిని స్వాధీన పఱచుకొని యున్నయెడల, శారీరక ముగ గూడ నేను పరిపూర్ణుడనై యుండవలసినదే! సంకల్ప ములను వశము చేసికొనుటకై చాల మానసికశక్తిని నను దినమును నేను వ్యయ పెట్టవలసి వచ్చుచున్నదని నిరాటంక ముగా నొప్పుకొందును. నేను విజయమును సాధించినపుడు అదెప్పుడైన లభించుగాక-ఎంతటి మహాశక్తి రాశి నేనుచేయు సేవకొఱకై సంసిద్ధముగ నాకు దొఱకగలదో యూహింపుడు. 'ఎపిండి సైటీసు' అను రోగము సంకల్పముయొక్క లేక మనస్సుయొక్క దుర్బలతకు ఫలితార్థమని నే నభిప్రాయపడు దును. అదే రీతిని నేను శస్త్రచికిత్సకు లొంగుటయు మఱి కొంత మానసిక దుర్బలత యే నని నే నొప్పుకొందును. నాయందు 'అహమ్మను' భావమే లేనియెడల నట్టి యనివార్య సంఘటనం గూర్చి నేను తూష్ణీభావముతో నుండియుందును. కాని యీ ప్రస్తుత శరీరముతో బ్రతికియుండ వలయుననియే కోరియుంటిని. సమ్యగనిస్సంగవృత్తి యంత్ర కర్మ గతివంటిది కాదు. ఓర్పుతో శ్రమపడి, ప్రార్థనలుచేసి యందు స్థిరపడ

వలసి యుండును. ఇక కృతజ్ఞత విషయములో నా యెడల నపారముగా జూపిన దయారసమును గూర్చి 'కర్నలు మాడక్' గారికిని వారి సహోద్యోగులకును, నొక్కసారి గాకుండ, ఎక్కుసార్లు బహిరంగముగా నా కృతజ్ఞతను ప్రకటించియున్నాను. ఐనను 'కర్నల్ మాడక్' గారి వలన నేను పొందిన యుపకృతికిని, నేను ఖండనచేయు పరిపాలనా విధానమునకును మధ్య నేలాటి సంబంధమును లేదు. కర్నల్ మాడక్‌గారు సమర్థుడగు శస్త్రచికిత్సకుడే. మఱియు నాయన తన ధర్మమును చక్కగా నిర్వహించెను. ఆ కారణము వలన 'డయరు' సేనాని చర్యలయెడల నా యభిప్రాయములను నేను మార్చుకొందునేని ఆ 'కర్నలు మాడక్' గారే నన్ను అలసునిగ నెంచగలరు. నాకు శ్రేష్ఠమగు శస్త్రచికిత్సా సాహాయ్యమును సమకూర్చి నందులకును, శిక్షాకాలమును పూర్తికానిదే నన్ను విడిచిపెట్టి నందులకును గవర్నమెంటు వారి యెడల కృతజ్ఞత చూపవలసిన హేతువేమియు లేదే. మొదటి దానిని ప్రతి ఖైదీకిని వారు సమకూర్చి తీరవలసినదే. రెండవ విషయమందురా, అది నన్నే చిక్కులలో పెట్టినది. మంచిదో, చెడ్డదో, చెఱసాలలో నా మార్గమును నే నెఱుగుదును. చెఱసాల గోడల వెలుపల నా యారోగ్యమును నెమ్మదిగా కూడదీసికొనుచున్నప్పటికినీ, నా మార్గము నెట్లు నిర్ణయించుకొన వలయునో నిశ్చయముతో నేను గ్రహింపజాల కుంటిని. ఇక, పై యుత్తరములోని ప్రధానాంశమునకు

వృత్తము. దానిని వ్రాసిన వారు మనస్సులో కలవరము చెందుటకు హేతువేమనగా, ఆయన పేర్కొనిన ప్రవక్తల జీవితోద్దేశమును గుఱించి యాయన భ్రాంతి చెందినాడు. మఱియు వారికిని నాకును కూర్చబడిన పోలిక నా యెడల వికృతముగా నుండెను. నిర్వాణము సాధించుట యను బుద్ధుని యుద్దేశము నెరవేర లేదనుట నే నెఱుగను. ఆయన దానిని సాధించె ననియే పరంపరగా నెల్లరు చెప్పుకొను చున్నారు. ఇతరులను మతాంతరములోనికి చేర్చుకొనుట యొక్క మహాత్మ్యముగా నెంచినను కూడ, నదియు ప్రధానాంశమే యగును. 'సమాప్తి అయినది' అని (తన కర్తవ్యమును గుఱించి) ఏసుక్రీస్తు శిలువమీద సాక్ష్య మిచ్చినటుల సువార్త లందు రచింపబడి యున్నది. పై వారల యనంతరము నందును వారియొక్క 'ప్రేమ ధర్మము' సమసిపోలేదు. అందలి యథార్థాంశము శాశ్వతమై యొప్పుచున్నది. వారి బోధానంతరము గడచిన రెండుమూడు వేల సంవత్సరములు, అనంతకాల చక్రమున ఒక్క నలుసుమాత్రమే యనదగును.

ప్రవక్తల శ్రేణిలో చేర్చి, ఏకవాక్యములో పేర్కొన బడుటకు తగిన యోగ్యత నాకు లేదని నా నమ్మకము. నేను సత్యమును గుఱించి సాధన చేయు నొక వినమ్రాన్వేషకు డను. నా యాత్మను సాక్షాత్కారము చేసికొనుటకును, నీ జన్మములోనే మోక్షమును సాధించుటకును, నే నాతురపడు

చున్నాను. శరీరదాస్యమునుండి యాత్మను విడుదలచేసి కొనుట కగు నా సాధనలో నేను చేయు జాతీయసేవ యొక భాగమే సుడీ. ఈ తీరున చూచునెడల, నేను జేయు సేవ కేవలము స్వార్థపర మైనదిగను నెంచవచ్చును. కాని నశ్వర మగు నైహికరాజ్యమును గుఱించి నాకు కాంక్ష లేదు. నేను మోక్షమనెడు పరలోక రాజ్యముకొఱకై తీవ్ర ప్రయత్నము చేయుచున్నాను. ఈ నా గమ్యార్థమును పొందుటకై యొక గుహాలో ప్రత్యేకముగా దూరి కూర్చుండ వలసిన అవసరము నాకు కాన్పించుట లేదు. తెలిసికోవలెనే గాని, యొక గుహ నా వెనువెంట నుండనే యున్నది. గుహాలో నివసించువాడును గాలిలో మేడలుకట్టుకొనవచ్చును. కాని జనకునివలె నగరులో వసించు నతడు కట్టుకోవలసిన మేడలే యుండవు. సంకల్పములనెడ ఱెక్కలతో ప్రపంచ ముపై గిఱగిఱ నెగురువానికి శాంతి యుండదు. సకలైశ్వర్య ముల నడుమ జీవించుచున్నను, జనకునకు ననిర్వాచ్యమగు శాంతి లభింపగలిగెను. నాకు వలయు మోక్షమార్గము నా దేశసేవయందును, నందు నైతము విశ్వమానవసేవ ద్వార మున నాచేయు నిరంతర కృషి రూపముననే యేర్పడియున్నది. సమస్త జీవులతోడను నైక్యానుభూతిని సాధించుటయే నా కోరిక. గీతాభాషలో చెప్పవలయునేని, శత్రుమిత్రుల యిరు వుర యెడలను హితవుమీఱ వర్తించుటే నా యభిమతము. కాబట్టి మహమ్మదీయుడుగాని, క్రైస్తవుడుగాని, హిందువు

గాని, నన్ను సహింపకొని ద్వేషించిననుగూడ, నా భార్య గాని, కుమారుడుగాని నన్ను ద్వేషించినను, నే నెట్లు మమ కారముతో వారిని ప్రేమింతునో, అదేవిధముగా పై వారిని ప్రేమించి వారి సేవ చేయుటకొఱకే నే నభిలషింతును. ఈ విధముగా శాశ్వత స్వేచ్ఛా శాంతిమయమగు దివ్య లోక మునకై నేను చేయు నా ప్రయాణములో, నా దేశాభిమాన మనునది యొక మజిలీగా నున్నది. కాబట్టి నా విషయములో మతధర్మదూరమగు రాజ్యాంగము జీవితచర్య యేమియు లేదని స్పష్టముగా గలదు. నా రాజకీయములు మతము ననుస రించి నడువవలసిన వే. రాజకీయములను మతమునుండి దూరము చేసినయెడల నవి యాత్మ వినాశకరములగును. అవి యమపాశములే యనదగును.

ప్ర:— మీరు దైవచోదిత జీవనమును గడుపుచున్నారు. ఆ చోదన ప్రేరణయొక్క మీ యనుభవమును నొకింత దయ యుంచి తెలుపగలరా ?

స:— భగవంతుడన, నరుని పోలువాడని నా భావము కాదు. నామట్టుకు నాకు సత్యమన దేవుడే. ఇహ లోకమున పాలకుడును, వాని శాసనమును వేఱువేఱై యుండు నటుల, భగవంతుడును భగవంతుని శాసనమును భిన్నభిన్న వస్తువులు గాని, విషయములు గాని కావు. భగవంతుడన పరమా దర్శము. అతడే శాసనమును అగును. కాబట్టి భగవంతుడు

తన శాసనమును భంగము గావించుట యనెడు భావమే యసంభవము. అందువలన నాయన మన కర్మలను శాసించి, దూరముగా వెడలిపోవువాడు కాడు. భగవంతుడు మన కర్మలను శాసించుచున్నాడని మనము పలుకునపుడు మనము మానవభాష నుపయోగించుకొనుచు, భగవంతుని పరిమితుని చేయ ప్రయత్నించుచున్నాము. అటుల కాదేని భగవంతు డును వాని శాసనమును నెల్లెడల ప్రకాశింపుచు సర్వమును నియమించు ననవలయును. మనము చేయు ప్రార్థనలందలి ప్రతి స్వల్పాంశమును భగవంతుడు సఫల పఱచునని నే నను కొనను. ఐనను ఆయన మన కర్మలను శాసించుననుటకు సందేహము లేదు. భగవంతుని యిచ్ఛ లేక యొక గడ్డి పోచ యేని మొలకెత్తుటగాని, కదలుటగాని సంభవింపదని అక్షరాల నమ్ముచున్నాను. క్రిక్కిరిసి పోయిన పడవమీద ప్రయాణము చేయు ప్రయాణీకున కుండు స్వాతంత్ర్యము కంటె, మన మనుభవింపగల స్వతంత్రత తక్కువ దగును సుమీ.

ప్ర:—మీ భగవద్ధ్యానము నందు స్వేచ్ఛభావము ననుభూతి చేయగలుగుదురా?

స:— ఆహా! చేయగలుగుదును. ప్రయాణీకులతో నిండిన పడవయందువలె, నేను ఒత్తిడి ననుభవించుటలేదు. కాని ప్రయాణీకునకుగల స్వేచ్ఛకంటె నా స్వేచ్ఛ తక్కువదని యెఱుగుదును. నరుడు తనకున్న స్వాతంత్ర్యము నెట్లు విని

యోగము చేసికొనదగునో యా విధమును నిర్ణయించు కొనుటలో వానికి స్వేచ్ఛ గలదనెడు నర్థమందు 'నరుని గతికి నరుడే నిర్ణయకర్త' యనుట గీతయొక్క ముఖ్య సిద్ధాంతమైయున్నది. దానిని నే నర్థము చేసికొనిన కొలదిని ఆ స్వాతంత్ర్యము నాకు హితవుగ తోచుచున్నది. ఐనను ఫలమిట్లుండ వలయునని నరుడు నిర్ణయింపజాలడు. అటుల తలంచుచో నా క్షణమే యతడు దుఃఖము పొలగును.

ద్వితీయ భాగము

# భగవంతుడు

భగవంతుని గురించి ప్రశ్నించుచు నా కనేకులు లేఖలను వ్రాయుచుందురు. అన్నింటికిని సమాధానము వ్రాయుట సాధ్యపడదు. ఐన నీ క్రింది కొన్నింటికి సమాధానముల వ్రాయ బూనుచున్నాను. మీ 'యంగు ఇండియాలో' మీ రిటుల వ్రాసినారు :— "ఈ లోకములో *భగవంతుడు తప్ప సర్వమును అస్థిరము. అట్టి ప్రపంచమున శాశ్వత భావమును నిరీక్షించుట పొరబాటని నాకు తోచుచున్నది." ఇంక నిటుల వ్రాసినారు :— "భగవంతు డోరిమిగలవాడు. మిగుల క్షమము చూపును. అప్పుడప్పుడతడు దెలుపు గాఢమగు హెచ్చరికల సరకుగొనని క్రూరులు తమ వినాశమును తామే కూర్చుకొనునటుల చేయును."

"భగవంతుని చర్యలపట్ల స్థిరతలేదని సవినయముగా మనవి చేయుచున్నాను. సర్వత్ర సత్యమును వ్యాపింపజేయుట వాని గమ్యముగా నుండవలసినది గదా! నానా భావములు గల దుష్టజను లీ ప్రపంచమున నుండుటను భగవంతు డేల

* బ్రహ్మ సత్యం ; జగన్మిథ్య.

యంగీకరింపవలెను? దుష్టజనులు ఘోరవర్తనులై దశదిశల వర్ధిల్లుచున్నారు. అంటుజాడ్యములవలె, నవినీతిని, మోసమును భావిసంతతి వారికి సంక్రమింప చేయుచున్నారు. భగవంతుడు సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు నందురుగదా. అట్టివాడు తన సర్వజ్ఞత్వము వలన నెందు దార్జన్యము గలదో గ్రహించి, తన సర్వశక్తివలన దుష్టసంహారము చేయరాదా? మఱియు మోసమునంతను మొగ్గలోనే త్రుంచివేసి, దుష్టజనులు ప్రబలకుండ చేయకూడదా?

"భగవంతుడు తుషను పూని ఓర్పు చూపనేల? అటులగు నెడల, నతడేమి ప్రభుత్వము నిర్వహింప గలడు? కపటము, మోసము, క్రౌర్యములతో నిండి లోకము ప్రవర్తిల్లుచున్నదే!

"దుష్టజనుడు తన వినాశమును తానే కూర్చుకొనునటుల దేవుడు చేయు నెడల క్రౌర్యవృత్తిచేత దీన జనుల నతడు బాధించుటకు పూర్వమే, ఆ దుర్జనుని పెటికి వేయరాదా? దార్జన్యమునకు పరిపూర్ణావకాశము నొసగు టెందులకు? వేలకొలది ప్రజలను నీతి భ్రష్టులను చేసి నాశమొనరించిన పిమ్మట నెన్నడో ఆ దుర్జనుని వాని పాపానవాడు నాశమై పోనిచ్చుటేల?

"ప్రపంచము పూర్వము వలెనే ఇప్పుడును చెడు త్రోవనే పోవుచున్నది. ఆ ప్రపంచమును మార్చి, యోగ్యులు

ధర్మపరులు నగు జనులతో నిండిన లోకముగా చేయుటకు తన శక్తులను వినియోగము చేయక యుపేక్షించు భగవంతుని యందు మీరు విశ్వాసము పూనుటెందులకు? పాపపు జనులు తమ పాపవర్తనలతో చిరకాల మారోగ్యవంతులై బ్రతుకుట నేనెఱుగుదును. వారి పాపఫలితముగా నట్టి పాపాత్ములు త్వరలో నేల చచ్చిపోగూడదు?

"భగవంతునియందు విశ్వాసము కలిగి యుండవలయు ననే, నేనును కోరుచున్నాను. కాని నా విశ్వాసమునకు ఆధారము చిక్కుటలేదు. మీ 'యంగు ఇండియా' పత్రిక ద్వారమున నా కొకింత వెలుగు నొసగి, దయచేసి నా యవిశ్వాసమును విశ్వాసముగా మార్ప యత్నించుడు."

స:—ఈ వాదన ప్రజాపతి పుట్టిన కాలము నాటిది! పురాతన మైనది! దీనికి నేను చెప్పు వినూత్న సమాధాన మేమియు లేదు. ఐనను నే నెందుకు విశ్వాసము పూనుచున్నానో తెలిపెద గాక. అటుల తెలుపనెంచు టెందుల కనగా, నా యభిప్రాయము లందును, నా చైదము లందును, నభిమానము గల యువకులు గలరని నే నెఱుగుదును. గావున నే! సర్వ వ్యాపకమై పఱగుచు, నిట్టి దట్టిదని వర్ణింప నలడ కాని విచిత్ర 'దైవీశక్తి' గలదు. దానిని నేను చూపి లేకున్నను, అనుభూతి చేయుచున్నాను. ఈ అదృశ్య శక్తి తనకు తానే యనుభూతికి వచ్చుచున్నది. ఐనను, రుజువు

చేయ శక్యము గాకున్నది. కారణ మేమనగా, నా యింద్రియములతో నేను తెలిసికొనగలుగు దానికెల్ల విలక్షణముగా నది యున్నది. అది నా యింద్రియముల కతీతముగ నున్నది.

కొంతవఱకు మాత్రమే భగవంతుని యునికినిగూర్చి తర్కవాదము చేయుట సాధ్యపడగలదు. సామాన్య వ్యవహారములలో సైతము తమను పరిపాలన చేయువారెవరో, అతడెట్లు పరిపాలన చేయునో ప్రజలకు తెలియదనుట మన మెఱుగుదుము. అయినప్పటికిని హద్దులలో నడపునటువంటి అధికారమొకటి నిశ్చయముగా కలదని వారెఱుగుదురు. గతసంవత్సరము నా మైసూరు పర్యటనములందు, బీదలగు చాలమంది గ్రామస్థులను నేను కలిసేవాడను. మైసూరు రాజ్యము నెవరు పాలించునదియు వారికి తెలియదని విచారించిన మీదట నేను గ్రహించితిని. ఒకానొక 'దేవత' పరిపాలించుచున్నదని మాత్రము వారు చెప్పెడివారు. వారి ప్రభువును గుఱించి ఈ బీదజనుల జ్ఞానమంత కొలదిగా నుండెను. వారల ప్రభువుకంటె వారెంత తక్కువవారో యంతటి కెన్నియో రెట్లు భగవంతునికంటె నేను తక్కువవాడను కాన నేను రాజులకెల్ల రాజగు భగవంతుని యునికిని గ్రహింపజాలనందు కాశ్చర్యపడ నగత్యములేదు. అయినప్పటికిని మైసూరును గుఱించి బీదలగు నీ గ్రామస్థులు అనుభూతిచేయు విధమున, విశ్వములో

నొక నియమగతి కలదనియు, నిరంతరముగా నధికారము చేయు ననుల్లంఘనియమగు నొక శాసనము కలదనియు ఉనికిగలట్టి లేక జీవించునట్టి, ప్రతి ప్రాణిని ఆ శాసనము పాలించుననియు నేను అనుభూతి చేయుచున్నాను. అది గ్రుడ్డి దగు జడశాసనము కాదు. ఏమన, జడశాసనమేదియు సజీవులగు ప్రాణుల గతిని పాలింపజాలదు. అదృష్టవశమున సర్ జగదీశ చంద్రబోసుగారి యద్భుతములగు పరిశోధనల సాహాయ్యమున జడద్రవ్యముగూడ సచేతనమని ఋజువుచేయ సాధ్యపడుచున్నది. సర్వప్రాణి లోకమును పరిపాలించునట్టి యా శాసనమే భగవంతు డనదగును. శాసనము, శాసన కర్తయు నేకమే. ఆ శాసనమును గురించిగాని, యా శాసన కర్తను గురించిగాని, నాకు తెలియునది బహుస్వల్పమను కారణమున, ఆ శాసనమును, ఆ శాసనకర్తను నేను త్రోసి వేయజాలను. ఆధిభౌతిక శక్తియొక్క యునికిని గురించి నే నెఱుగకున్నను, లేక దానిని నేను లేదనినను ప్రయోజనము లేదుగదా! అదేవిధముగా భగవంతుని శాసనమును నేను లేదని వాదించినను, వాని వశమునుండి నా వాదన నన్ను తప్పింపజాలదు. భౌతికాధికారముయొక్క యంగీకారము, వానిక్రింద నేను గడపు జీవనమును సుఖతరముగ చేయు నటుల, భగవంతుని శాసనమును వినయముతో మారాడక నే నంగీకరించు నెడల, నా జీవయాత్ర సుఖతరముగ జరుగ గలదు.

నా చుట్టునున్న సర్వమును నిరంతరము మారిపోవుచు నాశమొందుచునుండగా నట్టివర్తనము నంతటికిని నాధారమై తాను మార్పు చెందకయు సర్వమును భరింపుచును, సృష్టి, నాశము, పునస్సృష్టి చేయుచునుండు నొక చైతన్యశక్తి కలదనుట నాకు లీలగా తెలియవచ్చుచున్నది. అటుల తెలుపు శక్తి, లేక, 'ఆత్మ' యే భగవంతుడు. కేవలము నా యింద్రియముల ద్వారమున నాకు గోచరించు నితర మేదియు స్థిరముగా నుండుటగాని, నుండగలుగుట గాని పొసగదు. కావున [1] భగవంతుడు మాత్రమే సత్యము, లేక, ఉన్నాడు అనవలయును.

సరే, యీ శక్తి యుపకారకరమా? లేక, అపకారకరమా? అది కేవల ముపకార కరమని నేనెఱుగుదును. ఏమన మృత్యు మధ్యమున చైతన్యము స్థిరముగ నిలుచుటయు, అసత్యము నడుమ సత్యము స్థిరముగ నిలుచుటయు, చీకటినడుమ వెలుగు స్థిరముగ నిలుచుటయు నేను చూడగలుగుచున్నాను. కాబట్టి భగవంతుడు చేతనమును, సత్యమును, ప్రకాశము నని నేను గ్రహించు చున్నాను. అతడు ప్రేమస్వరూపుడు; అతడు శుభంకరమూర్తి!

కేవలము బుద్ధిని సంతృప్తి పఱచుట యెన్నడేని సాధ్య మైనను నట్టి బుద్ధిని మాత్రము సంతృప్తి పఱచువాడు భగ

1. బ్రహ్మ సత్యం

వంతుడు కాజాలడు. భగవంతుడగుట కతడు హృదయమును పాలించుచు, దానిని రూపాంతరము పొందింప జాలువాడుగా నుండవలయును. ఆయన తన భక్తునియొక్క యత్యల్ప చర్యలయందు సైతము ప్రత్యక్షము కావలయును. మన పంచేంద్రియముల ద్వారమున లభింపగల యనుభవమును మించి దృఢతరమును సుస్పష్టమునైన ప్రత్యక్షానుభవము ద్వారమున మాత్రమే ఇట్టిది సాధ్యము కాగలదు. మనకెంత సత్యములుగ కాన్పించినను, [2] నింద్రియానుభవములు మిథ్యలును, మోహజనకములును కాగలవు; కాగల వనుటేగాదు, తఱచుగా నవి యటులనే యుండును. ఇంద్రియాతీతమగు ప్రత్యక్షానుభూతి కలుగు నెడల నది నిర్దుష్టముగా గోచరించును. అంతరంగ మందు యథార్థ భగవత్సాక్షాత్కారము ననుభూతి చేసిన వారియొక్క, పూర్తిగ రూపాంతరము నొందిన శీలము వలనను, చర్యల వలనను తప్ప, బాహ్యమగు నిదర్శనముల చేత నది రుజువు పడునది కాదు.

అట్టి సాక్ష్యము సమస్త దేశములందును సర్వకాలములందును వెలసిన ప్రవక్తల యొక్కయు, ఋషుల యొక్కయు నఖండ పరంపర యొక్క స్వానుభవమునందు కాన్పించుచున్నది. ఈ సాక్ష్యమును తిరస్కరించుటన, తనను తాను తిరస్కరించు కొనుటయే యగును. ఇట్టి ప్రత్యక్షానుభూతి

2. యద్దృశ్యం తన్నశ్యం

కలుగుటకు పూర్వము నిశ్చల భక్తికలిగి తీరవలయును. తన శరీరమునందు భగవంతుడు కలడనెడు యథార్థమును పరీక్షింప దలచు నతడు, సజీవమగు గాఢ విశ్వాసముతో మాత్రమే యటుల చేయగలడు. మఱియు విశ్వాసమును బాహ్య నిదర్శనముల వలన ఋజువుచేయ వీలుపడదు. కావున ప్రపంచము నందలి నైతిక పరిపాలనమును మఱియు నటులనే నైతిక శాసనము యొక్కయు, సత్యశాసనము యొక్కయు, ప్రేమ శాసనము యొక్కయు శ్రేష్ఠత్వమును విధిగా నమ్ముట క్షేమకర మార్గమగును. సత్యమునకు, ప్రేమకు విరుద్ధమగు సర్వమును వెంటనే పరిత్యజించునట్టి వినిర్మల ప్రతిన గల చోట విశ్వాస సాధనమత్యంతము నిరపాయమై పఱగును.

ఎట్లైనను, నేనింతవఱకు చెప్పినది నాకుత్తరము వ్రాసిన వారి వాదనకు తగిన సమాధానము కాజాలదు. తర్కము వలన వారికి నచ్చచెప్పుటకు తగిన ప్రతివాదన నాకు దొఱక లేదని నేనొప్పు కొనుచున్నాను. విశ్వాస మనునది తర్కమును మించునదై యున్నది. అసాధ్యమగు దానిని సాధింప జూడకు డనుటే వారికి నేను చెప్పగల సలహా. ఏ తార్కిక విధానము ననుసరించియు; 'కీడు' అనునది యేల సృష్టి యయ్యెనో నేను వివరింపజాలను. అటుల చేయగోరుట భగవంతునితో సరిసమానుడ గాగోరుటే యగును. 'కీడ' నునది కలదని వినమ్రతతో గుర్తించి తృప్తిచెందుచున్నాను. భగ

వంతుకు ప్రపంచములో "క్రీడచుదానిని" నుండ నంగీకరించుట వలననే యాయన చాల శాంతమూర్తి యనియుఁ నోర్పుగలవాడనియు నేను చెప్పుచున్నాను. భగవంతుని యందధర్మము లేదని నే నెఱుగుదును. అయినను నధర్మము నెడల నందు కాయనయే కర్త యనియు, నట్టియ్యును దానినే స్పృశింపబడ డనియు నే నెఱుగుదును.

ప్రాణము పోగొట్టుకొనవలసి వచ్చిననుగూడ, నధర్మముతో పట్టుబట్టి పొరాదనిన యెడల, నే నెన్నడును భగవంతుని తెలిసికొనజాలనని గూడ నే నెఱుగుదును. వినమ్రుడనగు నా కొలదివాటి యనుభవము వలననే యట్టి విశ్వాసమునందు ధృతియు, సాహసమును నాకు కలుగుచున్నవి. నేను నిర్మలుడ నగుటకు ప్రయత్నించిన కొలదిని, నేను భగవంతునకు దాపగుచున్నటుల భావించు చున్నాను. ఈ నాడు నా విశ్వాసము నామమాత్రముగా నున్నది. కాని యది హిమాలయములవలె నచలమై దాని శిఖరములమీది మంచువలె ధవళమై, ప్రకాశవంతమై యొప్పుతటిని నేనధికాధికముగ భగవత్సాన్నిధ్యమును అనుభూతి చేయగలుగుదును. ఈ లోపుగ పూర్ణానుభవముతో నీ క్రింది రీతిని గానము చేసిన 'న్యూమను' మహాశయునితో గూడి స్వచ్ఛకుడు భగవత్ స్తోత్రము సలుపుగాక యని కోరుచున్నాను.

ఆటతాళం — ఆనందభైరవి

ఓ పరంజ్యోతి స్వరూపా నన్నుకాపాడుమో దయారూపా!
ఏ పట్టు జూచిన జూపట్టె జీకటి : మాపు నిలుజేర్పుమా,
నా పాదముల గాచి ॥ఓపరం॥

ఈ నా సమాధానమునకు ప్రోద్బలముగా 'యంగు ఇండియా' పాఠకులొకరు 'ఎమర్సన్' మహాశయుని యీ క్రింది వాక్యములను నాకు వ్రాసి పంపించిరి.

"అనుదినము మనచుట్టును నేమి జరుగుచున్నదో కొంచెము విచారణ చేసినయెడల, మన యిచ్ఛను మించిన యున్నత శాసన మొకటి సర్వసంఘటనలను నియమించుచున్నదని గ్రహింప గలుగుదుము. శ్రమకరమగు మన పరిశ్రమల నవసరములును, నిష్ఫలములును నగును. సులభమును, నిరాడంబరమును, సహజమును నగు కర్మయందే మనకు బలముచేకూరును. విధేయులమై వర్తించుటతో తృప్తిచెందుట వలన మనము దైవీసంపద గలవార మగుదుము. విశ్వాసము, భక్తి, అనగా విశ్వాస పూర్వకమగు భక్తి మహాదుఃఖ భారమునుండి మనలను రక్షింప గలుగును. ఓ నా సోదరులారా! భగవంతుడు గలడనుడీ! ప్రకృతి గర్భమునందు 'ఆత్మ' గలదు. మనలో నెవరుగాని జగత్తునకు భంగము కలిగింపకుండ గాచుకొనుటకు ప్రతినరుని యొక్క యిచ్ఛను అది పాలించుచున్నది. మన జీవితము మన మెటుల

నిపుడు గడపుకొనుచున్నామో యంతకంటె సుఖతరముగను, నిరాడంబరముగను చేసికొనగలము. ప్రపంచమిప్పుడు కాన్పించునటులగాక యెక్కువ యానందప్రద క్షేత్రమై యొప్పగలదు. తగవులకు, ఉద్రేకములకు, నిరాసచెంది చేతులు నలుపుకొనుటకు, క్రోధముతో పండ్లు కొఱుకు కొనుటకును నవసరముండదు. 'మన యనర్థములను అజ్ఞాన వశమున మనమే కల్పించుకొను చున్నాము' అనెడు గుణ పాఠము గాఢముగా మనము నేర్చుకొనవలసియే వచ్చు చున్నది. శుభంకరమగు ప్రకృతిని మనము పెడత్రిప్పు చున్నాము".

'యమర్సణ' వాక్యముపైని గాంధీజీ వ్యాఖ్య

కొంచెము విశ్వాసము వహింప నోడంబడుదుమేని మన చుట్టు నెల్లెడల భగవంతుని, వాని కరుణను గుర్తింప గలుగుదుము.

నేనీ యుత్తరమును వ్రాయుచుంటినని ఎటుల నమ్మెదునో, అటులే భగవంతుడు గలడనియు నమ్ముచున్నాను.

ప్రపంచమంతయు 'లేడు, లే' డనినను "భగవంతుడు కలడు. ప్రజానుమోదము లేకున్ననుగూడ, సత్యము నిలువ గలదు. అది తనంతట తానే పోషించుకొన గలదు" అని నా భావము.

విశ్వాసము పూని ప్రార్థనలు చేయు పురుషుడనని గట్టిగ చెప్పకొనగలను. నన్ను ముక్కలు ముక్కలుగా నరికినను గూడ భగవద్భక్తిని వీడక భగవంతుడు కలడని నొక్కి చెప్పగల బలమును భగవంతుడే నా కొసగగలడు. భగవంతుడు కలడనియు, అతడు వినా మరొక దేవుడు లేడనియు ముసల్మానుడు చెప్పచున్నాడు. క్రైస్తవుడును ఆ మాటే పలుకుచున్నాడు. హిందువు నట్లే వచించుచున్నాడు. వేఱగు వచన రచనతో నైనను, బుద్ధుడు గూడ ఆ విషయమునే ప్రవచించెనని వక్కాణింపనగును. భగవంతుడను శబ్దమునకు మనలో ప్రతివాడును తన స్వంతమగు నర్థమును చెప్పకొన వచ్చును. భగవంతుడు స్వల్పమగు మన భూగోళమునే గాక, లక్షలాదిగా గల నిట్టి గోళములను ఆవరించి యున్నాడు. భగవంతునిచే సృష్టింపబడి కేవలము నిస్సహాయులమై ప్రాకులాడు అల్పక్రిముల బోలు మనము భగవంతుని యొక్క మహిమను వాని అఖండ వాత్సల్యమును వాని అపారకరుణను కొలతవేయుట ఎట్లు సాధ్యమగును? నరుడు అహంకార పూరితుడై భగవంతుడే లేడనుచు భగవంతుని గుఱించి వాదులాడుచు, సోదరమానవుల గొంతులుగోయ సాహసించు మనయెడ నా భగవంతుడు చూపు క్షమను పూర్తిగ గ్రహింపజాలు టెట్లు? మహోదీప్యమానుడై నిరంతరము క్షమను జూపుచుండు భగవంతుని మహిమను మనమా గణింప జాలునది?

నేను పూర్తిగ దైవశక్తిపై ఆధారపడువాడను. నేను భగవంతుని నమ్ముకొనువాడను కావుననే నరులను నమ్ముకొనుచున్నాడను. నా కాధారమై పఱగు భగవంతుడే నాకు లేని యెడల సమానజాతి జీవులను ద్వేషించు 'శైమనును' బోలిన వ్యర్థుడనై పోయి యుందును.

సహస్ర నామముల ద్వారమున మనము భగవంతుని తెలిసికొనుచున్నను, భగవంతుడు ఒక్కడేయై మనయందఱి యెడలను ఏకరీతినే పఱగుచున్నాడు.

ప్రతివాడును భగవంతుని ఇచ్ఛను గ్రహింపజాలడు. భగవంతుని ఇచ్ఛను తెలిసికొను శక్తిని సంపాదించుటకు సుశిక్షణమును పడయవలసి యుండును.

భగవంతుడు తప్ప మఱేదిగాని మఱెవరుగాని నిర్దుష్టముగ నుంట అసంభవము.

సత్యముతప్ప నేనారాధింపగల భగవంతుడు నాకులేడు. ప్రతివాడును తాను గుర్తింపకున్నను భగవంతునియందు విశ్వాసముగలిగియే యుంటున్నాడు. ప్రతివాడును తనయందు తనకు విశ్వాసము గలవాడుగా నుంటున్నాడు. గాన, ఆ విశ్వాసమును అనంతపరిమితి గలదిగా పెంచినచో, అదే దైవీశక్తి (భగవంతుడు) యగును. ప్రాణముతో నొప్పు సమస్తముయొక్క మొత్తపురాశియే భగవంతుడు. చిన్న నీటిచుక్క సముద్రముయొక్క అంశయే యైనట్లు మనము

భగవంతుడు గాకున్నను, భగవదంశయేయై యున్నాము. నీటి చుక్కను సముద్రమునుండి విడదీసి కొన్నిమైళ్ళ దూరమునకు విసరివేసితి మనుకొనుడు. తన పరిసరములనుండి వేఱుబఱుప బడిన నీటిచుక్క ఆధారశూన్యమై పోవును; మఱియు సముద్రముయొక్క మహిమను, గంభీరతను అనుభూతి చేయ నోడును. ఐనను సముద్రముయొక్క అంశయే యని ఎవరేని దానికి ధ్వనపఱచజాలు నెడల, దాని విశ్వాసము తెప్పిరిలి, అది మహానందముతో, నృత్యముచేయ గలుగును. సముద్రముయొక్క మహిమయు, గంభీరతయు సర్వమును దానియందు ప్రతిబింబించును.

## చేతన స్వరూపుడగు భగవంతు డెందుగలడు ?

వంగదేశ యువకుడొకడు సంతాన నిరోధమును గురించి శంకించుచు నిట్లు వ్రాయుచున్నాడు.

ప్ర:— "మీ వ్యాసముయొక్క మూలసిద్ధాంతముతో నేను పూర్తిగ నేకీభవింపగలను. కాని ఆ వ్యాసములోని ఒక పంక్తిలో భగవంతునియందు మీరు విశ్వాసము సూచించి యున్నారు. మఱియు 'నేటి యువకులు భగవంతుడు కలడను భావమును నిరసింతు' రనియు, 'చేతన రూపియగు భగ వంతునియందు సజీవమగు విశ్వాసము తమకు లేదని చెప్పుకొనుట వారి కాచారమై పోయిన' దనియు మీరు వ్రాసినారు.

"ప్రత్యక్షమును, నిరాక్షేపమును నగు నిదర్శనమును దేనినైన భగవంతుడు కలడనుటను గుఱించి మీరు తెలుప గలరా యని శంకించుచున్నాను. హిందూతత్త్వవేత్తలును, పురాణ పురుషులును, ఈశ్వర స్వరూపమును నభివర్ణింప యత్నించి, అతడు అనిర్వాచ్యుడనియు, మాయచే కప్పబడి యున్నాడనియు చెప్పుచు, మఱియు నీ రీతినే యగు నిర్ణయ ముల వేనినో తుదకు తెలిపినారు. వేయేల, భగవంతుని గూర్చిన చిక్కు ప్రశ్నను విశదము చేయుటకు మాఱుగా ఆ భగవంతునే అంధకార మనెడు గాఢతరాచ్ఛాదనము నందు కప్పిపెట్టి, ఆ సమస్య నింకను తబ్బిబ్బు చేశివేసినారు. సామాన్య నరుని బుద్ధికి అందరాక, యెక్కడనో దూరమున నుండు దేవుని యునికిని, యథార్థమగు మీ వంటి మహా త్ముడో లేక అరవిందుడో లేక పూర్వకాలపు బుద్ధుడో లేక శంకరాచార్యుడో భావమున రూపకల్పన గావించుకొని అను భూతి చేయగలుగుటను నేను కాదన సాహసింపను.

"అంతులేని లోతునకు దిగజాలని మూఢబుద్ధిగల సామాన్య జనులమగు మేము మాయెదుట ఆ భగవంతుని ప్రత్యక్షముగా చూడజాలనపుడు, అట్టి దేవునితో మాకేమి ప్రయోజనము? అతడు మనల నెల్లఱ సృజించిన జనకుడే యగుచో, మన హృదయములయొక్క ప్రతిచలనమునందును వాని యునికిని సాక్షాత్కారము చేసికొన జాలకుండుటేల?

భగవంతుడు తన యునికి ననుభూతి చేయునటుల మెలగ జాలడేని, నా కతడు భగవంతుడే కాజాలడు. నా కింకొక శంకగలదు. అతడే జగమునకు తండ్రియగుచో తన బిడ్డల యొక్క దుఃఖములను అతడు అనుభూతి చేయుచున్నాడా? అతడటుల ననుభూతి చేయగలవాడే యగునేని, ఘోరవినాశ కరమగు క్షేత్రా, బీహారు భూకంపముల ద్వారమున విధ్వం సక కృత్యమునకు పూని, తన బిడ్డల నంతటి దుఃఖములపాలు చేయు టెందులకు? అబిసీనియను లనెడు అమాయకప్రజాతిని అత డవమానములపాలు చేయు టెందులకు? ఆ అబిసీని యనులు వాని బిడ్డలుకారా? భగవంతుడు సర్వశక్తి సంపన్నుడందురుగా! అట్లగునేని ఈ యాపదలను అతడెందు లకు తప్పింపలేక పోయినాడు? మన దురదృష్ట భారతమాత యొక్క స్వాతంత్ర్యము కొఱకు అహింసా, సత్యయుతమగు పోరాటమును మీమట్టుకు మీరు నడుపబూని భగవంతుని సాయపడ వేడుకొనియుంటిరే! కాని అట్టి సాహాయ్యము మీయెడల నిరాకరింపబడెననియు, భగవంతుని సాహా య్యముమీాద నెన్నడును ఆధారపడియుండని పశుబలము మిమ్మును అపజయము పాలుచేసి, అవమానించి యుండగా, విధిలేక కార్యరంగమును విడచి మీరు మూలదాగి యుండ వలసి వచ్చెననియు, నే నభిప్రాయ పడుచున్నాను. భగవం తుడే యుండునేని అతడు తప్పక సాహాయ్యపడియుండును. ఏల యన, మీ యుద్యమము యథార్థముగా యోగ్య

మైనది గదా. ఇట్టి యుదాహరణలను నే నింకను తెలుప నక్కఱలేదు.

"కాబట్టి ఈనాటి యువకులు దేవునిగుఱించి యూహా నిర్మాణము చేసికొను కోరికలేనివారై భగవంతుని యెడల విశ్వాసము ప్రానకుంక కొంతమాత్రమును వింతసంగతి కాదు. యథార్థముగా చేతనమూర్తియగు భగవంతుడు వారికి కావలయును. 'చేతనమూర్తియగు భగవంతుని యెడల సచేతనమగు విశ్వాసము' నుచు మీ వ్యాసమం దేమేమో వ్రాసియున్నారు. భగవంతుడు కలడనుటను గుఱించి ప్రత్యక్షమును, నిరాక్షేపమునునగు నిదర్శనములను మీరు చూపగలుగునెడల నేను మిగుల కృతజ్ఞుడనుగా నుందును. మఱియు యువకలోకమునకు మీరు మహోప కారము చేసినవారగుదురనియు నేను భావింతును. ఇప్పటికే దుర్గ్రాహ్యమైన ఈ సమస్యను, నింకను దుర్గ్రాహ్యము చేసివేయక, ఈ విషయమును నిశ్చయమగు కొంత వెలుగును మీరు ప్రసరింపజేయగలరని నా కాశగలదు."

స :— ఈ విలేఖరి ప్రస్తావనమునకు దెచ్చిన తిమిరమును తొలగించుటకు నేను వ్రాయబోవునది సమర్థము కాజాలదని నా కనుమానమే.

చేతనరూపుడగు భగవంతుని యునికిని నేను ప్రత్యక్షము చేసికొని యుండనోపునని ఈ విలేఖరి తలపోయుచున్నాడు.

అట్టి యదృష్టము నాకు కల్గెనని చెప్పజాలను. ఐనను భౌతిక శాస్త్ర పరిశోధకులు నాకు తెలుపునట్టి యనేక విషయము లందు నేను సత్యమగు విశ్వాసమును పూనునటులనే చేతన రూపుడగు భగవంతునియందును నేను సజీవ విశ్వాసము పూనువాడ నని చెప్పగలుగుదును. కాని రుజువులేకుండ మనము సత్యములని యంగీకరించు ఈ విషయముల సందర్భమున, వానిని రుజువుచేయుటకు నిర్ణయించిన విధానముల ననుసరించిన యెడల, శాస్త్రపరిశోధకులు చెప్పుదానిని ప్రత్యక్షముగా తెలిసికొనదగును గదా యని నాకు సమాధానముగా చెప్పవచ్చును. సరే, ఋషులును, ప్రవక్తలును సైతము సరిగా అదే రీతిని వచించియున్నారు. తామనుసరించిన మార్గమునుబట్టి పోయినచో నెవడేని భగవంతుని ప్రత్యక్షము చేసికొన వీలగు ననియే వారందురు. ఉన్న విషయ మేమన ప్రత్యక్ష సాక్షాత్కారమునకు త్రోవజూపు విధానము ననుసరించుటకు మన కిష్టము లేదు. యథార్థ ప్రయోజనము గల ఈ ఏకైక విషయమును గురించి స్వానుభవము గడించినవారి ప్రవచనమును మన మంగీకరింప నొల్లము. ప్రకృతిశాస్త్రములు సాధించిన విజ్ఞానమునంతను రాసిగాచేసిపెట్టినను, భగవంతునియందు సజీవవిశ్వాసమును మనకు ప్రసాదింపగల విజ్ఞానముతో నెంతమాత్రము సరి రాజాలదు. భగవంతుడు కలడని విశ్వసింప గోరనివారు దృశ్యమునకు అన్యముగా నుండు దేని యునికినిగాని విశ్వ

సింపజూడరు. మానవజాతి అభివృద్ధికి అటువంటి నమ్మకము అనవసరమని వారు నిర్ణయింతురు. భగవంతుని యొక్కయు, ఆత్మయొక్కయు యునికిని రుజువు చేయుటకు తెలుపబడు గట్టివాదనయంతయు నట్టి మానవులయెడ నిష్ఫల మగును. చెవులలో దూది క్రుక్కుకొని వినిపించుకొన నొల్లని పురుషుని అతి మనోహరమగు గానమును వినునటులచేయుట నీ చేతగాదు. మఱియు ఆ గానమును మెచ్చుకొనునటుల చేయుట అసలే పొసగదు. ఒప్పుకొన నిష్టములేని వారికి చేతనమూర్తియగు భగవంతుడు కలడని నచ్చచెప్పుటయు శక్యముకాదు.

అదృష్టవశాత్తు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు చేతన స్వరూపియగు భగవంతునియందు సజీవ విశ్వాసము కలదు. వారు దానిని గురించి వాదన చేయజాలరు, వాదనచేయ వారి కిష్టమును నుండదు. వారి విషయమును 'భగవంతుడు కలడు' అను మాట నిర్వివాదాంశము. ప్రపంచమున గల శాస్త్ర గ్రంథము లన్నియు మూఢవిశ్వాసులగు ముసలమ్మకథలేనా? మహాఋషుల యొక్కయు, ప్రవక్తలయొక్కయు సాక్ష్యము త్రోసి పుచ్చవలసిన దేనా? చైతన్యుని యొక్కయు, రామకృష్ణ పరమహంస యొక్కయు, తుకారాము యొక్కయు, ధ్యాన దేవుని యొక్కయు, రామదాసు యొక్కయు, నానక్ యొక్కయు, కబీరు యొక్కయు, తులసీదాసు యొక్కయు

ధృవ వచనములకు విలువయే లేదా? రామమోహనరాయ, దేవేంద్రనాథ ఠాకూరు, వివేకానంద మున్నగు వారందఱు ఆధునికులును, ఈ కాలపు వారిలో అత్యంత ధీశాలురతో పాటు బాగుగ చదువుకొనిన వారేగదా! అట్టి వీరిమాటేమి? నిరాక్షేపణీయముగా పాటింపదగు సాక్ష్యమొసగ గల సమకాలికులగు సాక్షులగుఱించి నే నెత్తుకొనలేదు. ఈ భగవద్విశ్వాసమనునది తర్కమున కతీతముగా నుండు నమ్మకముపైన ఆధారపడి యుండవలసినదే. సాక్షాత్కారానుభవము పైతము, తన కాధారముగా కొంత విశ్వాసమును ఆశ్రయించక తప్పదు. ప్రకృతి స్వభావము ననుసరించి అది అట్టులనుండవలసినదే. ఎవడేనియు తన జన్మయొక్క హద్దులను దాటిపోగలుగునా? సోపాధికమగు ఈ జీవితమున సంపూర్ణ సాక్షాత్కారానుభవము అసంభవ మని నా యభిప్రాయము. అట్టిది అవసరమును కాదు. మానవులు పొందగల సంపూర్ణ ఆధ్యాత్మికోన్నతిని పడయుటకు, అచంచలమగు ధృఢ విశ్వాసము మాత్రమే అవసరమైయున్నది. భగవంతుడు ఈ మన స్థూలోపాధికి బాహ్యమున నెక్కడో లేడు. కాబట్టి బహిరంగ మగు రుజువు సంభవమైనను, హెచ్చువిలువ గలదిగా నుండజాలదు. భగవంతుడు ఇంద్రియములకు అతీతుడుగా నుండును గావున, మనము వాని నెప్పుడును చూడనే జాలము. ఇంద్రియములనుండి మనము తొలగి నిలువజాలుదుమేని, మనము భగవంతుని అనుభూతి

చేయగలుగుదుము. భగవంతుని దివ్యగానము మన అంతరంగమున నిరంతరము జరుగుచునేయున్నది. ఇంద్రియములతో మనము చూడ గలట్టియు, వినగలట్టియు సర్వమునకు విలక్షణముగను, అతీతముగను వఱ్టు ఆ సూక్ష్మగానమును, పెద్దగ ఘోషించుచుండు మన యింద్రియములు అణచివేయుచున్నవి. భగవంతుడు కృపాళువును, న్యాయశీలియు నగు దేవుడే యగునేని మనకు చుట్టును గోచరించు దుఃఖములను, ఆవేదనలను ఆత డెందుకు అంగీకరించుచున్నాడో విలేఖరి తెలియ గోరుచున్నాడు. సంతృప్తికరమగు సమాధానమేదియు నే నొసగజాలను. నే నోడిపోయి అవమానమును అనుభవించు చుంటి నని యీ విలేఖరి ఆరోపణ చేయుచున్నాడు. ఓటమియొక్కగాని, అవమానముయొక్కగాని, లేక నిరాశయొక్కగాని, అటువంటి వేఱొక భావము గాని నాకులేదు. కార్యరంగమునుండి నేను వైదొలగిన దానికి నా అపజయముతో ఏలాటి సంబంధమును లేదు. అది నా ఆత్మ పారిశుద్ధ్యమునకును, ఆత్మ సంసిద్ధతకును నిర్ణయించుకొనిన ఒక విధానమేగాని, అంత కన్యమేమియు గాదు. తఱచుగా పైకి కాన్పించు స్వరూపమున విషయముల నిజస్థితి యుండదని తెలుపుటకే యీ మాట చెప్పుచున్నాను. మనము పొఱపడి దుఃఖములనియు, అన్యాయములనియు పేర్కొను నిట్టి విషయముల యథార్థ మారసిన నటువంటివి కాకనే పోవచ్చును. జగత్తులోని రహస్యము లన్నిటిని మనము

తెలిసికొనజాలు నెడల, మనము భగవంతునితో సాక్షాత్తు సములమే యగుదుము. సముద్రమునందలి ప్రతి నీటిబొట్టు గూడ ఆ సముద్రముయొక్క మహత్త్వమును పంచుకొనుచున్నను, అది సముద్రము కాజాలదు. స్వల్పమగు మన జీవితకాలమున మన యల్పత్వమును జ్ఞప్తికి తెచ్చుకొనుచు మా ఆశ్రమవాసుల మొక శ్లోకముతో ఉదయప్రార్థనమును ముగించుచుందుము. అది ఇది :—

"విపదోనైవ విపదః; సంపదోనైవ సంపదః
విపద్విస్మరణం విష్ణోః, స్సంపన్నారాయణ స్మృతిః."

[తా॥ లోకములో మనము ఆపద లనుకొనినవి ఆపదలే కావు; సంపదలనుకొనునవి సంపదలేకావు. విష్ణుదేవుని పరచుటయే నిజమైన ఆపద; నారాయణుని స్మరించుటే నిజమగు సంపద.]

సుస్థిరమును, నిర్వికారమును నగు సజీవశాసన స్వరూపుడగుటకు మాఱుగా, భగవంతు డొక చపల చిత్తమానవ సముడేయైనచో, తనను తన శాసనమును, మతము పేరిట తిరస్కరించు వారి నెల్ల భీకర క్రోధావేశుడై రూపుమాపివేసి యుండును. ఈశ్వరశాసనములు శాశ్వతములును, మార్పు లేనివియు, వానినుండి వేఱుపఱుప నలవి కానివియు నై యున్నవి. అట్లుండుట భగవంతుని పరిపూర్ణతకు అనివార్యము.

భగవంతుడు 'కాబా' లో గాని, కాశిలోగాని లేడు. ఆయన మనలో ప్రతివానియందును కలడు. నా అభిప్రాయములో రామ, అల్లా, దేవుడు అను పదములు సమానార్థకములుగానున్నవి. సత్య మన భగవంతుడే; అసత్య మన వాని నిరాకరణమే.

ప్రార్థన మనగా నేమనియు, భగవంతు డెవండనియు, నెవరును ప్రశ్నింపకుందురు గాక. ప్రార్థనయు, భగవద్భక్తియు విశ్వాసము యొక్క ఘనతర చర్యలై యున్నవి."

## దేవుడున్న నేమి ? లేకున్న నేమి ?

నేను దక్షిణదేశమున తిరుగుచుండు కాలమున భగవంతుని యందు తమకు విశ్వాసము లేదని చెప్పుకొను హరిజనులు మొదలగువారిని నేను గలిసికొంటిని. ఒకానొక తావున హరిజనులు తమ స్వంతఖర్చులతో తమకొఱకై నిర్మించుకొనిన ఒక దేవాలయము నీడను జరుగుచున్న, హరిజన మహాసభయందా సభాధ్యక్షుడు నాస్తికత్వమును గుఱించి అతి గంభీరోపన్యాసము నిచ్చియున్నాడు. పాపము! తమతోడి హరిజనులయెడ చూపబడు అన్యాయమును గుఱించి వాని హృదయము దహించుకొని పోగా, అటువంటి క్రూరచర్యలను సాగనిచ్చిన కరుణాళుడును, దివ్యశక్తి సంపన్నుడు నగు దేవుడొకడుండ గలడా యని శంకించుచు ఆయన ప్రారం

భించినాడు. అట్టి అవిశ్వాసమునకు నేదేని కొంత మిష యుండిన నుండనోపును. కాని వేఱొక కారణమునుండియు నిట్టిదే వేఱొక రీతి అవిశ్వాసము బయలుదేర గలదనుటకు మాదిరిగా నీ క్రింది వాదనను గమనింపుడు.

ప్ర:— భగవంతుడు, సత్యము, లేక యథార్థము అనెడు భావములను ముందుగా కల్పన చేసికొనుట వలన, మన అన్వేషణ విధానమంతయు వికృతమయిపోయి, మనకు గొప్ప అవరోధమేర్పడి, మన జీవిత గమ్యమునే భంగపఱచు చున్నదని మీకు తోచుటలేదా? చూడుడు, కొన్ని నీతి సూత్రములను ప్రధానములుగా మీరు గ్రహించుచున్నారు. కాని మనము అన్వేషకులముగా నున్నాము గదా! యథార్థ సత్యమును మనము తెలిసికొననంత వఱకును ఒకానొక నీతిధర్మము సత్యమని గాని, లేక అయ్యదియే మన అన్వేషణమున తోడ్పడ గలదనిగాని, మనము ప్రగల్భముగా పలుకు టెట్లు?

స:— ఏవో కొన్ని సామాన్యపు ప్రతిపాదనలే లేకుండ, యే అన్వేషణయు సాధ్యమేకాదు గదా! దేనిని గూడ అంగీకరింపని నాడు, దేనినిగాని పరిష్కరింపనే జాలము. సుజ్ఞానులు, నజ్ఞానులు నను నిరుతెగలవారితో గూడిన యీ ప్రపంచము ప్రారంభమైనది మొదలు మనముండిన భగవంతుడుండును; భగవంతుడు లేకున్న మనమును లేని

వారమే' అనెడు ప్రతిపాదనపై ఆధారపడి నడచుచున్నది. భగవంతుని యందలి విశ్వాసము మానవజాతితో సమకాలికమై వచ్చుచుండుటచేత, సూర్యుడు కలడను యథార్థ విషయము కంటె భగవంతుడు కలడనుటే హెచ్చుగ స్థిరతర సత్యముగా నంగీకరింపబడు చున్నది. ఈ సజీవవిశ్వాసమే యనేకములగు నిగూఢ జీవన సమస్యలను పరిష్కారము చేయగలిగినది. అది మన దుఃఖమును శమింపజేయు చున్నది. అది మన బ్రతుకునకు ఆధార మగుచున్నది. మరణమునందును మనకది శాంతి నొసగుచున్నది. ఈ నమ్మకము కారణముగనే, సత్యాన్వేషణము ప్రయోజనకరమును, ఆనందకరమునై యొప్పుచున్నది. సత్యాన్వేషణ మన భగవంతుడే. సత్యముకలదు గావుననే భగవంతు డున్నాడు. సత్యము కలదనియు, సుప్రసిద్ధములును, సుపరిష్కృతములును నైన కొన్ని పరిశోధనసూత్రముల ననుసరింపుచు, నేర్పుమెయి నన్వేషించుటచేత ఆ సత్యమును కనుగొనగల మనియు నమ్ముచున్నాము. కావుననే అట్టి అన్వేణమును మనము పూనగలుగుచున్నాము. ఈ అన్వేషణము వ్యర్థమై పోయినటుల చరిత్రయం దెచ్చటను నిదర్శనము లేదు. భగవంతుని యందు తమకు విశ్వాసము లేదని చెప్పుకొను నాస్తికులు సైతము; సత్యమునందు విశ్వాసము పూనుచునే యున్నారు. భగవంతునికి వేఱొక నామము పెట్టుటయను చమత్కారమునకు వారు పూనుచున్నారు, కాని,

అదియును క్రొత్తపేరు గాదు. భగవంతుని నామములు అసంఖ్యాకములు. కాని యన్నిటికిని "సత్యము" అను పేరు శిరోమణిగ నొప్పుచున్నది.

కొన్ని ప్రధానములగు నీతిధర్మముల సత్యత్వమును నిశ్శంకముగా అంగీకరింపక తప్పదనుట, దాదాపుగా భగవంతుని విషయమున ఎంత యథార్థమో అంత యథార్థము నగును. ఇంతయేల, భగవంతుడు, లేక సత్యమును గూర్చిన విశ్వాసమునందు ఆ నీతిధర్మము లిమిడియున్నవి. వీనినుండి దూరముగా పోయిన స్వేచ్ఛావర్తనులు అంతులేని దుఃఖముల పాలయిరి. సాధనలలో గల్గు కష్టములు, అవిశ్వాసమున కాధారముగా భ్రమింపరాదు. 'హిమాలయపర్వతముల పరిశోధనయాత్ర' జయప్రదమగుటకు కొన్ని నిర్ణీతపద్ధతు లుండును. ఆ నీమములను పాటించుటలో గల కష్టము ఆ 'పరిశోధన యాత్రయే' అసాధ్య మనుట కాధారము కాజాలదు. ఆ కష్టమే ఆ అన్వేషణమునందు ఆనందమును, ఉత్సాహమును చేకూర్పగలదు. ఇప్పుడు భగవంతుని, లేక సత్యమును అన్వేషించుయాత్ర, లెక్కలేనన్ని హిమాలయ "పరిశోధన యాత్ర" లను మించి అనంతముగా శ్లాఘ్యకార్యమై యుండును. కాబట్టి అది చాల నెక్కుడు ఆనందకరముగ నుండును. మనకు దానియందుత్సాహము లేదేని, మన విశ్వాస దౌర్బల్యము వలన నదట్లగును. ఆ యేకైక

సత్యవస్తుపుకంటె మన చర్మచక్షువుల కగుపడునదె ఎక్కువ సత్యత్వముకలదిగా మనకు చూపట్టుచున్నది. దృశ్యము లన్నియు భ్రాంతిమూలకము లని మనమెఱుగుదుము. అట్లయ్యును తుచ్ఛవిషయములను సత్యములుగా పాటించుచున్నాము. తుచ్ఛములగువానిని తుచ్ఛములుగా చూడగలుగుచో, మనము సగముయుద్ధము గెలిచినట్లే. అట్టి దృష్టి సత్యమునః లేక భగవంతుని గూర్చిన అన్వేషణములో సగము ఫలమునకు మించినదనవచ్చును. తుచ్ఛవస్తువుల బారినుండి మనము విడిపించుకొననియెడల, ఆ యఖండసత్యాన్వేషణమునకు వలయు అవకాశమే మనకు చిక్కదు. అయినను యెప్పుడో తీరిక చిక్కునని యీఅన్వేషణమును నిలిపిపెట్టదగునా? మనకు తెలిసినను; తెలియకున్నను, అస్పృశ్యతానివారణ కొఱకగు పోరాటము ఆ గొప్ప యన్వేషణమున నొక యంశమే సని హరిజనోద్యమ ప్రచారకులు తెలిసికొందురుగాక. అస్పృశ్యత యనున నొక మహామోహము! భ్రాంతి! ఆ విషయము గూడ మనకు రుజువైయే యుండవలెను. లేనియెడల మనము ఆ యుద్యమముయొక్క అభిమానులము కాజాలము. ఆ యుద్యమమునందు విజయము సాధించుకొఱకు అవసరమని తఱచుగా తెలుపబడుచు వచ్చిన నీమములను నేర్పుతోడను, క్రమముతోడను ఆచరించిననే మనము ఆ సత్యమును ఇతరులకును నందియ్య గలుగుదుము.

# సత్యము

సత్యశబ్దము "ఉండుట" యని అర్థ మిచ్చు 'సత్' అను ధాతువునుండిపుట్టుచున్నది. సత్యమువినా మఱేదియు యథార్థముగా నుండజాలదు. అనగా ఉనికి గలదికాజాలదు. ఆ కారణముచేతనే సత్ లేక సత్యము అనునది భగవంతుని యొక్క అత్యంతప్రధాన నామముగా నుండనోపును. భగవంతుడు సత్యమనుట కంటె, సత్యమే భగవంతుడనుట సమంజసమగును. అయినను నొక ప్రభువో, నాయకుడో లేనిది మనకు గనుపడు. కావున రాజరాజు, లేక పరాత్పరుడు అను నిటువంటి ఈశ్వర నామములు సామాన్యముగా వాడుకలో నుంటున్నవి; మఱియు నుండగలవు. లోతునకు దిగి యాలోచించితిమేని 'సత్' లేక సత్యము అనునదియే నిర్దుష్టమును, సార్థకమును నగు భగవన్నామ మని గ్రహింపగలుగుదుము.

ఎచ్చట సత్య ముండునో అచ్చట వినిర్మలజ్ఞానము నుండును. సత్యము లేనిచోట యథార్థజ్ఞాన ముండజాలదు. ఆ హేతువు చేతనే జ్ఞాన మను నర్థము నిచ్చు 'చిత్' అను శబ్దము భగవన్నామముతో అనుసంధానము చేయబడుచున్నది. ఇక, ఎక్కడ యథార్థజ్ఞాన ముండునో అక్కడ ఆనంద ముండును. దుఃఖమున కందు తా వుండదు. సత్యము శాశ్వతమై వఱగు విధమున, అందుండి జనించు ఆనందమును

శాశ్వతమే. కాబట్టి భగవంతుని సచ్చిదానందరూపునిగా మనము గ్రహించుచున్నాము. వానియందు సత్యము, జ్ఞానము, ఆనందము నిమిడియుండు నని అర్థము.

ఈ సత్యమునెడ భక్తి మన యునికికే ఏకైక మూలాధారము. మన చైదము లన్నిటికిని సత్యమే కేంద్రముగా నుండవలయును. సత్యము మన ప్రాణాధార వాయువుగా నుండవలయును. మన తీర్థయాత్రయం దొక్కసారి యీ మజిలీని చేరుకొంటిమేని, సజ్జన జీవనధర్మములలో తక్కిన వన్నియు అప్రయత్నముగా లభింప గలవు. మఱియు వాని అనుసరణము సహజచేష్ట యగును. కాని సత్యములేనియెడల మన జీవితములో ఏ ధర్మములనుగాని, నీతులనుగాని ఆచరించుట దుస్సాధ్యమే యగును.

సత్యధర్మము నాచరించుటయనగా సామాన్యభాషయందు 'మనము సత్యమును పలుకవలయును' అని మాత్రమే యర్థము చేయుచున్నారు; కాని మన ఆశ్రమములో సత్యమను శబ్దమును నెక్కువ వ్యాపకార్థములో మనము గ్రహించుచున్నాము. సంకల్పములో సత్య ముండవలయును; మాటలో సత్యముండవలయును; చేతలోసత్యముండవలయును. సంపూర్ణముగా నీ సత్యమును సాక్షాత్కారము చేసికొనిన మనుజునకు నిక తెలిసికొనవలసినదేమియు మిగిలియుండదు. ఏలయన, సమస్త జ్ఞానమును తప్పక సత్యమునందిమిడియుండును.

సత్యము నందిమిడియుండనిది సత్యము కాజాలదు; కాబట్టి సత్యమైన జ్ఞానము కాజాలదు. సత్యమైన జ్ఞానము లేనిది అంతరంగశాంతి అలవడజాలదు. అపవాద మనునది లేని సత్యమునకై శోధనను ఎట్లు ప్రయోగించుటో నేర్చుకొంటిమేని ఏది చేయ నర్హమైనదో, యేది చూడ నర్హమైనదో, ఏది పఠింప నర్హమైనదో తత్క్షణమే మనము తెలిసికొన గలుగుదుము.

చింతామణితోడను, కామధేనువుతోడను పోల్చదగిన యీ సత్యమును సాక్షాత్కారము చేసుకొనుటెట్లు? తదేకదీక్ష వలనను అనగా అభ్యాసమువలనను, మఱియువాంఛారాహిత్యము వలనను అనగా వైరాగ్యమువలనను పొసగు నని భగవద్గీత చెప్పుచున్నది. అట్టి దీక్ష యున్ననుగూడ ఒకనికి సత్యముగ గాన్పించు విషయము మఱొకనికి అసత్యముగా గాన్పించుటయు తఱచుగాతటస్థించుచున్నది.అయినను దానినిగుఱించి సాధకుడు దిగులుచెంద నవసరము లేదు. నిష్కపటమగు ప్రయత్నముండునేని భిన్నభిన్న సత్యములుగా కాన్పించునవి ఒకేచెట్టునందు చూపులకు భిన్నములైతోచు నసంఖ్యాకములగు పత్రముల వలె నుండును. భిన్నభిన్న వ్యక్తులకు భిన్నభిన్న స్వరూపములతో భగవంతుడే కాన్పించుట లేదా?ఐనను భగవంతుడు ఒక్కడేనని మన మెఱుగుదుము. సత్యమునునది భగవంతునికి నిర్దుష్టమైన బిరుదుగా నున్నది. కాబట్టి ప్రతివాడును తనవిజ్ఞానము కొలది సత్యమును అనుసరించుటలో తప్పేమియు లేదు.

యథార్థమునకు అటుల చేయుటయే వాని విధి. ఆవిధముగా నొకడు సత్యమును ననుసరించుటలో పొరపాటు సంభవించిన యెడల, తనంతట నదియే సవరణమై పోగలదు. ఏమన సత్యాన్వేషణము నందు తపస్సు నిమిడియున్నది. తప స్సనగా ఆత్మనిగ్రహమను మాట. ఒక్కొక్కప్పుడది మరణ పర్యంతము సాగును. దానియందు స్వార్థపరత లేలగనైనను నుండుటకు తావులేదు. అటువంటి నిస్వార్థమగు సత్యాన్వేష ణమునం దెవడును చిరకాలము మార్గము తప్పిపోజాలడు. అట్టివాడు త్రోవతప్పగనే బోర్లపడును. తన్మూలమున సరి యైన త్రోవకు మఱలింప బడగలడు. కాబట్టి సత్యానుసరణ మనగా సత్యమగు భక్తియన్నమాటే. అది భగవంతుని దాపునకు తీసికొనిపోవు మార్గము. ఆ మార్గమునందు పిఱికి తనమునకు తావులేదు. అపజయమునకు తావులేదు. మరణ మును సైతము అమరజీవమునకు ద్వారము తెఱచు దానిగ మార్చు చేయగల రక్షాబంధన మది.

ఈ సందర్భమున హరిశ్చంద్రునియొక్కయు, ప్రహ్లాదుని యొక్కయు, రామచంద్రునియొక్కయు, అస్సాక్ హుస్సేన్ ఇమాములయొక్కయు, క్రైస్తవ భక్తాగ్రేసరులయొక్కయు, జీవితాదర్శములను మనము చక్కగా విచారింపదగును. మనలో నెల్లఱును, చిన్నలు, పెద్దలును, స్త్రీలు, పురుషులును, ఏమేమి పనులు చేయుచుండనీ, తినుచుండనీ, త్రాగుచుండనీ, లేక ఆటలాడుచుండనీ; జాగ్రత్సమయములందంతటను, స్వప్న

రహితమగు గాఢనిద్రలో మనము మునిగిపోవుచుండుదుము, మన మేమి చేసినను పూర్ణముగా సత్యమునే అనుసరించు నెడల యెంత రమ్యముగ నుండును! సత్యరూపుడగు భగవంతుడు నాపట్టుకు నాకు అగణిత సంపదరాశిగా తోచుచున్నాడు. మనలో ప్రతివానికిని భగవంతుడు అటులనే గోచరించుగాక!

## భగవంతుడు - కాంగ్రెసు

ఒక మిత్రు డిట్లు వ్రాయుచున్నాడు:—మీ సమాధానము కొఱకై, ఒక విషయమును గుఱించి మీకు వ్రాయవలయు నని వాంఛించుచున్నాను. 'భగవంతుడు' అను శబ్దమును గుఱించియే. 1925 వ సంవత్సరము జనవరి 22 వ తేదీ 'యంగ్ ఇండియా' పత్రిక 27–వ పుటలో నిట్లున్నది. "చదువు లెక్కువగుటచేత నెవరిదృష్టి చెదరిపోలేదో, ఎవరి విశ్వాసము చిమ్మగిలిపోలేదో, అట్టి పాఠకుని కొఱకు రామ నామమును గుఱించి ప్రస్తావించుచున్నాను. మన జీవితములో అనేక దశలందు చదువులు మనకు తోడ్పడును; కాని పరి శోధనలు, అపాయములు, గలుగు సమయములందవి కేవ లము నిష్ఫలము లగుచున్నవి. అట్టి సమయములందు విశ్వా సము మాత్రమే మనలను రక్షింపగలుగును." జాతీయ సేవ కుడనుగాన నీ వాక్యములకు వ్యతిరేకముగా నేను చెప్పున దేదియు నుండదు. ఏమన నది మీ వ్యక్తిసంబంధమగు విశ్వా సమును తెలుపునదై యున్నది. మఱియు యుచిత సందర్భము

లందెల్ల, మనస్సాక్షిగా నిరీశ్వరవాదులై వర్తించువారి యెడల గూడ, మీరు స్తుతివాక్యములు పలుకుటకు వెను దీయుట లేదనియు నేనెఱుగుదును. మీరు రచించిన నీతి ధర్మము అను గ్రంథమున గల ఈ క్రింది వాక్యము లందుకు నిదర్శనములుగా నున్నవి. "అత్యంతము నీతిబాహ్యములగు పనులు చేయుచును, తామెంతో మతానుష్ఠాన పరుల మని గర్వముతో చెప్పకొను దుష్టమానవులను అనేకులను నేనును చూచియున్నాను. మరొకపక్షమున అత్యంతము ధర్మపరులును, నీతిమంతులును నైయుండి, నాస్తికులమని చెప్పకొనుటలో గర్వము వహించు కీర్తిశేషులైన బ్రాడ్లాగారి వంటి పురుషు లును కలరు. అపాయములు, శోధనలు పైబడు కాలమున మనలను రక్షింప నేకైక సాధనమగు రామనామమందలి విశ్వాస సందర్భమున, స్పెయిన్ దేశమున 'బార్సెలోనా' నగరమునందు 1909 వ సంవత్సరమున తమ ప్రాణములను బలియిచ్చిన 'హేతువాది' ఫ్రాన్సిస్కో ఫెర్రర్ మహాశయుని నేను పేర్కొనదగును. అచ్చటి పురుషులు తమకు రామ నామము వంటి ఏసు నామమునందు విశ్వాసముగలవారే ఆ మహాశయుని హత్యగావించిరి! ... ఇది అటుల నుండనిండు.

"దైవభీతిగల మానవులు మాత్రమే అసహాయోద్య మము పూనగలరని మీరు పలుకుటను గుఱించి యొకా నొకరు తన యాక్షేపణము వెలిబుచ్చిన సందర్భమును జాతీయ

సేవకుడనగు నేను మీ దృక్పథమునకు తేవలసి యున్నది. మఱియు జాతీయసేవా కార్యక్రమమును బట్టి యెవరును తమ మత విశ్వాసమును ప్రకటింప నక్కఱ లేదనుచు మీరు ధృవపఱచుటను గుఱించి మీకు జ్ఞప్తి చేయుచున్నాను. "దేవునియెదుట నేను" అనుచు మొదలిడు దీక్షలను, ప్రమాణములను కాంగ్రెస్ వాలంటీర్లచేత చెప్పించు నీసమయమున వెనుకటికంటె నిప్పుడే ఆ యాక్షేపణమునందు బలము హెచ్చుగా కాన్పించుచున్నది. బౌద్ధులు, జైనులు మఱియు ప్రాచీన సంప్రదాయములకు చెందని చాలమంది భారతీయులును తమ విశ్వాసములందు అజ్ఞేయవాదులుగా నున్నారని యిప్పుడు మీకు తెలిసియుండవచ్చును. వీరు వాటింపని ఒకానొక నామముతో ప్రారంభమగు ప్రమాణమును పూర్తిగ అర్థము చేసికొని మనస్ఫూర్తిగ, కాంగ్రెసు వాలంటీర్లుగ చేరగోరుదురేని వారికి అవకాశముండునా? అట్టి అవకాశము లేనియెడల వారి మత విశ్వాసము కారణముగా కాంగ్రెసు సేవనుండి అటువంటి వారిని వెలిగా నుంచుటే న్యాయమగును......"

స:— నేను రచించితినని నే నభిమానించు 'కాంగ్రెసు ప్రతిజ్ఞ' నుండి భగవంతుని ప్రసక్తిని మనస్సాక్షి సంబంధమగు ఆక్షేపణ పొసగునంత వఱకు తొలగింపవచ్చును. దాని రచనా కాలముననే అట్టి ఆక్షేపణ తెచ్చినయెడల నప్పుడే

నేనందుల కొప్పుకొని యుండెడు వాడను. భారతదేశము వంటి క్షేత్రమున ఆ యాక్షేపణ కలుగునని నే ననుకొని యుండలేదు. పేరునకు చార్వాక సిద్ధాంతముండినను, తదను చరులు కలరని నాకు తెలియదు. బౌద్ధులు జైనులు నాస్తికు లనిగాని అజ్ఞేయవాదులని గాని నే నొప్పుకొనను. వారజ్ఞేయ వాదులు కానే కారు. శరీరముతో సంబంధము లేకుండను, దాని నాశనానంతరమును నిలువ గలిగి స్వతంత్రముగా నుండు ఆత్మ కలదని నమ్మువారు నాస్తికులు కాజాలరు. భగవంతుడని మన మందఱమును వేఱువేఱు నిర్వచనముల చెప్పుకొందుముగాక. భగవంతుని గుఱించి మన మందఱ మును స్వీయములగు నిర్వచనముల చేయగలుగునెడల, నెంత మంది స్త్రీ పురుషులు గలరో అన్ని నిర్వచనములు బయలు దేరగలవు. అయినను భిన్న భిన్నములగు నీ నిర్వచనము లన్నింటి వెనుకను, సందేహమున కెడమీయని, యొకానొక ఐక్యత గూడ పఱగుచుండును. ఏమన, మూలము ఒకటియే గనుక మనమందఱమును అనుభూతి చేయునట్టియు, అట్ల య్యును నిట్టిదని తెలియరానట్టియు, అనిర్వచనీయ తత్త్వమే భగవంతుడు. చార్లసు బ్రాడ్లా గారు తాను నాస్తికుడ నని చెప్పుకొనుట నిజమే కాని క్రైస్తవు లనేకులు ఆయన నట్టి వానిగా పరిగణింప నొల్లరైరి. చాలమంది నామ మాత్రపు క్రైస్తవుల కంటె బ్రాడ్లాగారే తమ కెక్కువ సన్నిహిత బాంధవునిగా వారు గుర్తించిరి. భారతదేశ సన్మిత్రుడగు

బ్రాడ్లాగారి అంత్యక్రియలను చూచు నదృష్టము నాకు కలిగి నది. చాలమంది క్రైస్తవ పురోహితులను వారి అంత్యకర్మ వద్ద నేను చూచితిని. ఆ యూరేగింపులో ననేకులు ముసల్మా నులును, హిందువులును గూడ చేరియుండిరి. వీరందఱును భగవంతునియందు విశ్వాసము గలవారే. బ్రాడ్లాగారు భగ వంతుడు లేడనినప్పుడు, వారికి నిర్వచనముచేసి చూపిన స్వరూపముగల భగవంతుడు లేడని మాత్రమే ఆయన నిరా కరణ. ఆకాలము నందలి దైవారాధన పద్ధతియొక్క సిద్ధాం తమునకు, ఆచరణకు మధ్యగల ప్రభిన్నత్వమును వారు నిర్దా క్షిణ్యముగాను, కఠినముగాను ఖండించి యున్నారు. నా విషయమునగో భగవంతుడనగా సత్యమే; ప్రేమయే. భగ వంతుడే నీతియు; ధర్మమును. భగవంతుడన నిర్భయత్వమే. భగవంతుడు ప్రాణవిజ్ఞానములకు మూలాధారము. అయినను ఆయన వీని కన్నింటికి అతీతముగ దూరముగ నుండును. భగ వంతుడన అంతస్సాక్షియే. భగవంతుడు నాస్తికునియొక్క నాస్తికతత్త్వమే యనవచ్చును. ఏలయందురా, భగవంతుడు అపారప్రేమతో నాస్తికునిగూడ మననిచ్చుచున్నాడు. ఆయన హృదయ పరివర్తన శోధకుడు. ఆయన వాక్కునకును, తర్కమునకును అందువాడుకాడు. ఆయన మనలను, మన హృదయములను మనకంటెను బాగుగ నెఱుంగును. ఆయన మన వాక్కులను పాటించడు. ఏమన, మనలో కొందఱు తెలిసియో తెలియకయో మాటల కను గుణ

ముగా భావనచేయుచుండుట లేదని ఆయనకు తెలియును. సాకారమగు ఆయన ప్రసన్నత యెవరి కవసరమో, అట్టివారి యెడ ఆయన సాకారుడై పజగును. ఆయన స్పర్శయెవరి కవసరమగునో వారియెడ నాయన సశరీరుడై ప్రత్యక్షమగును. ఆయన విశుద్ధ తత్త్వస్వరూపుడు. విశ్వాసము కలవారికి ఆయన కలడు. భగవంతు డందఱి మానవులకు నన్నివిధముల నొప్పును. ఆయన మన అభ్యంతరమున నున్నాడు. అట్లయ్యును మనకు పైగను, దూరముగను నుండును. కాంగ్రెస్‌నుండి 'భగవంతు' డను మాటను నెవరేని దూరముగ నెట్టివేయవచ్చును. కాని ఆ తత్త్వమునే దూరముగ నెట్టి వేయుటకు నెవరును శక్తులు కారు. మనఃపూర్వకముగా 'ధృవపఱచుట' యను మాట భగవంతుని పేర ప్రవచించుట కానిచో, దానికి విలువ యేమున్నది? దే-వు-డు అనెడు మూ డక్షరముల సమ్మేళనమునకు. నెంతయో కష్టపడి నమ్రతతో కూర్చబడిన పర్యాయ పదమే 'మనస్సాక్షి' యననొప్పును. భగవంతుని పేరిట నీచములగు నధర్మకార్యములును, అమానుషములగు ఘోరకృత్యములును చేయబడుచున్న కారణమున, భగవంతునకు అస్తిత్వము లేకుండ పోదు. ఆయన శాంతమూర్తి; మఱియు రౌద్రాకారుడు నగును. ఈ లోకము నందును పరలోకమునందును గూడ నత డతి కఠిన శాసకుడుగా నున్నాడు. మానవులనుగాని, జంతువులనుగాని, మన చుట్టునున్న వానిని మన మెట్లు

చూచుదుమో, సరిగా నదేవిధమున భగవంతుడు మనకు న్యాయము కలుగచేయును. ఆయన యెదుట అజ్ఞానము సాకుగా చెప్పకొనిన సాగదు. అటులయ్యును భగవంతుడు క్షమాప్రపూర్ణుడు. ఎట్లన పశ్చాత్తాపపడుటకు మన కాయన సదా అవకాశము నొసగుచుండును. ఆయన ప్రపంచ మొతిగిన ప్రజాస్వామ్యవాదులలో నగ్రగణ్యుడు; ఎట్లందు రేని, మంచి చెష్టలలో మన యిచ్ఛానుసారము పరిగ్రహించుటకు సాక్షాత్తుముగా మన కనుమతి నొసంగుచున్నాడు. భగవంతుడు మహానిరంకుశ ప్రభువునగును. ఎందువలన నన, ఆయన మన నోటి కందుగడలోనున్న పాత్రను తఱచుగా పెడకి వేయును. స్వాతంత్ర్య మను మిషతో మనకు కొంత స్వేచ్ఛ నొసగినను, అది వానికి మాత్రము వినోదము గూర్చుచు మన లాభమును భంగపఱచు నంతటి అల్ప ప్రయోజనము కలదిగ నుండును. అందువలననే హిందూ మతము 'సర్వము వానిలీల' యని పేర్కొనును; లేదా 'మాయ' యని వచించును. మనము లేనివారమే; అనగా మిథ్య. భగవంతుడు మాత్రమే కలవాడు; అనగా సత్యము. మనము మనగోరెదమేని, సదా వాని స్తోత్రగానము చేయుచు, వాని యిచ్ఛానుసారము ప్రవర్తింపవలయును. కాబట్టి మనము వాని వేణురవమున కనుగుణముగా నృత్యము సలుపుదుము గాక! అప్పుడు సర్వమును శుభంకరమై పఱగును.

## సత్యము అద్వితీయము

ఒక పోలిషు పండితు డిట్లు వ్రాయుచున్నాడు. "యంగు యిండియా" పత్రికలోని మనోహరములగు మీ వ్యాసములను మిగుల ఆనందముతో పఠింపుచుందును. అవి మీ దేశమునకేగాక ప్రపంచమంతటికిని శక్తిని ప్రసాదించునవిగ నున్నవను సత్యమును మీకు నచ్చచెప్ప కోరుచున్నాను. మీ కెంతయో విశాలమగు ఆధ్యాత్మికానుభవము కలదు. కావున వీలగునేని 'యంగు ఇండియా' పత్రికద్వారమున సమాధానము తెలుపుటకొఱకై నే నొక ప్రశ్న నడుగదలచియున్నాను. అది ఒక మిగుల ప్రాముఖ్యము గల సమస్య. అందును గూర్చిన మీ సమాధానమునకు చాల విలువయుండును. ఉదాహరణకు: భగవంతుడనుచు భగవత్ప్రార్థనల చేయు సందర్భమునందు పూర్ణమును నిర్వికారమునునగు సత్యమును చేరితిమని భావన చేయుదుము. ఆ రీతి నిర్ణయమువంటి అచంచల నిశ్చితార్థమే దేని సదా మానవ హృదయమునందుండునని మీరు ఒప్పుకొందురా? కొన్ని అపాయకర జంతువులను చంపు సందర్భమునందువలె, మీరు తొలిగా పూనిన యభిప్రాయము నేదేని యొకానొక ప్రత్యేకానుభవము మార్చివేసెననిగూడ మీ రంగీకరింతురా? ఇప్పుడు నే నడుగు ముఖ్యమగు ప్రశ్న యేమనగా, ఏ ప్రత్యేక విషయములపై నాధారపడి మీరు మీ యభిప్రాయములను

మార్చుకొందురు ? ఒకప్పుడు సుస్థిరముగా దోచిన సత్యమును గుఱించి, యిట్టి మార్పులకు మూలము కాగల దృఢతర నిశ్చితార్థ మేమిటి ? ప్రధానవిషయములలో పరమ నిశ్చితార్థముయొక్క సుస్థిరభావమునకును, తాత్కాలిక ప్రయోజనములకొఱకగు అభిప్రాయ పరివర్తనకును తారతమ్యము నెట్లు కనుగొనుట ? ఎట్టి విషయములలో మనము మారనగునో, ఎట్టి విషయములలో మనము మారకుండ నిలువవలయునో మీరు స్పష్టీకరింపగలరా ? ప్రతిదేశముయొక్కగాని జాతియొక్కగాని స్వాతంత్ర్యమనునది అఖండ సత్యములలో నొకటియా ? లేక జర్మనులు తా మితరజాతులను పరిపాలింప సమర్థత గలవారమని చెప్పుకొనుచు తమను ప్రేరేపించు రాజ్యాకాంక్ష ధర్మమే నని వాదులాడునటుల కొన్ని జాతులందు స్వపరిపాలన విషయములో స్వాభావ సిద్ధమగు నసమర్థతయు, మఱికొన్ని జాతులందు అట్టి అసమర్థ జాతులను పరిపాలించు స్వాభావిక సమర్థతయు నుండునా ?

స:— ఈ లేఖకుని యభిప్రాయము వాని లేఖలో చూపట్టునంతకన్న హెచ్చు విస్పష్టము చేయుకొఱకు, వాని లేఖలో నక్కడక్కడ నొక్కొక మాటను మార్పుచేయు స్వాతంత్ర్యమును వహించితిని. ఈ విలేఖరి నా యందారోపణ చేయు యోగ్యతలు నాయందుకలవని యేవిధముగాను యేరూపముగాను నేనంగీకరింప కుండనే, పూర్ణవినమ్రభావముతో వాని

ప్రశ్నలకు సమాధానము చెప్ప యత్నించెదను. మనస్ఫూర్తిగా నాకు కలదని చెప్పుకొను స్థిరత చాల తేలికయైనది. మఱియు దృఢమైనది కూడను. నమ్రభావముతోడను మిక్కిలి నిష్కపటోత్సాహము తోడను నేను సత్యాన్వేషణము చేయువాడనై యున్నాను. నేను నా పొఱపాటులను తెలిసికొని, వానిని సవరించుకొను నిమిత్తము, నాతో గూడి అన్వేషణముల చేయువారి నందఱిని నా అన్వేషణమునందు పరిపూర్ణ విశ్వాస పాత్రులనుగా స్వీకరింతును. నేను వేసిన అంచనాలందును, చేసిన తీర్మానము లందును, తఱచుగా పొఱబడి యుంటినని యొప్పుకొను చున్నాను. ఉదాహరణకు ఖేడా ప్రజలు సాత్విక శాసనోల్లంఘనము చేయ సిద్ధముగా నున్నారని, తగినంత ఆధారము లేకయే నేను నిర్ణయించిన సందర్భములో, హిమాలయ పర్వతమంత గొప్ప పొఱపాటు చేసితినని హఠాత్తుగా కనుగొంటిని. బాధాకరములని భావింపదగినను, నీతి బాహ్యములు కానట్టి శాసనముల యెడల బుద్ధిపూర్వకముగా విధేయత జూపుట వారికి తెలియని కారణమున, వారు సాత్విక శాసనోల్లంఘనము చేయ జాలరని తెలిసికొంటిని. ఆ విషయమును నేను కనుగొనిన తత్క్షణమే, నేను తిరోగమనము చేసితిని. ఇటువంటి నిర్ణయదోషమునే "బార్డోలి అంత్య సందేశము" అని పేర్కొనబడిన సందేశమును పంపు సందర్భమునను నేను గావించి యుంటిని. అప్పుడును దేశము అనగా ప్రజలు ప్రబోధముగాంచి యుండి

రనియు, యుద్ధముచే ప్రేరితులై దౌర్జన్యరాహిత్యము యొక్క ప్రయోజనమును గుర్తెఱిగి యుండిరనియు, నేను తలంచియుంటిని. ఆ అంత్య సందేశమును పంపిన యిరువది నాలుగు గంటలలోపల నా పొఱపాటును నేను గ్రహించి, నా నడకను మఱలించితిని. నా గతిని వెనుద్రిప్పిన ప్రతి సందర్భమునను శాశ్వతమగు అపకారమేదియు జరిగియుండలేదు. అందుకు మారుగా అంతకు పూర్వముకంటె దౌర్జన్యరాహిత్య ధర్మముయొక్క మూలతత్వము అఖండముగా ప్రకటితమైనది. మఱియు దేశమున కేవిధమునను శాశ్వతాపకారము సంభవించి యుండలేదు.

కాని నా వ్యాసములలో, ప్రత్యేకముగా సూచించిన కొన్ని సందర్భములలో కొన్ని ఘాతుక జంతువులను చంపు నవసరమును గుఱించిన నా యభిప్రాయములను నేను మార్చుకొని యెఱుగను. నా యభిప్రాయములను గుఱించి నే నెఱింగినంతవఱకు ఆ వ్యాసములలో ప్రకటించిన అభిప్రాయమునే సదా కలిగియుంటున్నాను. అట్లనుటచేత ఆ యభిప్రాయము మారనేజాలదని నా యర్థముకాదు. పొఱపాటున కవకాశములేని యే మార్గసూచికయో, లేక అంతఃప్రబోధమో నాకు కలదని నేను చెప్పజాలను. నా యనుభవమునుబట్టి చూడ, మానవుల పక్షమున అమోఘతను ప్రతిపాదించుట సాధ్యపడునదికాదు. అంతర ప్రబోధము సైతము ద్వంద్వముల ధాటికి లోబడక

దాటిన వానికి మాత్రమే ప్రాప్తింపగలదు. ఒకానొకని సందర్భమున ద్వంద్వాతీత దశను ప్రతిపాదించుట సమంజసమో కాదో నిర్ణయించుట కష్టము. ఇట్లు చూడ అమోఘతా ప్రతిపాదన చాల నుపద్రవ ప్రతిపాదనగా నెల్లెడల కాన్పించుచున్నది. అయిననుకూడ మనకు మార్గదర్శకమై యొప్పున దేదియు లేక నిరాధారులము కాము. ప్రపంచమున నుద్భవించిన ఋషిసత్తముల యనుభవ రాశి మనకు లభించుచున్నది. ఇంకను సర్వదా లభించుచునే యుండును. మఱియు ప్రధానములగు సత్యము లనేకములుగా నుండవు. సత్యమనునది యేకైక ప్రధాన సత్యముగా నున్నది. మఱొక తీరున నదియే అహింసగా సుప్రసిద్ధ మగుచున్నది. సత్యము లేక ప్రేమ అనెడు తత్వము అఖండమై వఱగుచున్నది, మితప్రజ్ఞుడగు నరుడు దాని నెన్నడును సంపూర్ణముగ తెలిసికొన జాలడు. అయినను మనకు దారి చూపుటకు చాలినంత మట్టుకది మనకు తెలియ వచ్చుచునే యున్నది. దాని నాచరణయందు పెట్టుటలో మనము పొఱబడుచున్నాము. ఒక్కొకప్పుడు చాల ఘోరముగ పొఱబడుచుందుము. అయినను నరుడు స్వయం ప్రభుతగలజీవి యనవలయును. తప్పులు చేయు నధికారమును, మఱియు నెన్ని సారులు తప్పులు జేసిన నన్నిసారులు వానిని సవరించుకొనుటకు గల యధికారమును స్వయం ప్రభుతయం దిమిడియున్నవి. నాకుత్తరము వ్రాసిన వారి కీసమాధానము తృప్తికరముగ

నుండునో లేదో నాకు తెలియదు. కాని, అది తృప్తికరముగ నున్నను లేకపోయినను నింతకంటె హెచ్చు తృప్తికరముగ నుండు సమాధానము నొసగు శక్తి నాకు లేదు. పర్యవసానమునకు ప్రతివాడును తనకు తానే శాసకుడుగ నుండవలెను. తాను సదా దైవభీతిగలిగి నడచుచు, తన హృదయమును నిరంతరము పవిత్రవంతముగా నుంచుకొనుచు వర్తింపవలయు ననుట మాత్రము నిరాక్షేపముగు నియమముగా నున్నది. పురుషుడు నిజముగా సార్థకనాముడు కావలయునన్న, హిందువులు చెప్పరీతిని 'ద్విజుడు' కావలయును; అనగా క్రైస్తవు లనునట్లు 'పునర్జన్మమును' పొందవలయును.

ఇక విలేఖరి యొక్క తుది ప్రశ్నలకు ప్రత్యుత్తర మిడుట సులభమే. నిజమునకు నే నింతవఱకు తెలిపియున్న వ్యాఖ్యల వలన ప్రత్యుత్తరముల నూహింప వచ్చును. ప్రతి దేశమునకు స్వాతంత్ర్యముండవలయుననుట, యే యర్థములో నెంతవఱకు ప్రతి మానవునికి స్వాతంత్ర్య ముండదగునందువో, ఆ యర్థమున ఆ పరిమితి వఱకు సత్యమే నని నా యభిప్రాయము. కాబట్టి యే దేశమునకు గాని లేక ఏ జాతికిగాని స్వయం పరిపాలన యుండవలయునా యను విషయములో, స్వాభావసిద్ధమగు అనర్హత లేదు. అటులనే యితర జాతులను పరిపాలించుటకు స్వాభావసిద్ధమగు అర్హతయు నుండదు. ఇతర జాతుల పైని పరిపాలనాధికారము చెల్లించుటకు నీశ్వరదత్తమగు

సమర్థత తమకు గలిగినట్లు జర్మనీవారు చెప్పుకొందు రని విలేఖరి నిష్కపటముగా తలంచుననుట నిస్సందేహాము. అయినను జర్మనీలో సామ్రాజ్యవాదులున్నట్లే, నిరాడంబర ముగా తమను తాము పాలించుకొనుటతో తృప్తి పొంద వలయునను వినయశీలురగు ప్రజాపరిపాలనా వాదులును న్నారు.

## ఆక్షేపణలకు సమాధానము

సరళవర్తనమనగా (క్షేత్రగణితప్రవీణుడగు) యూక్లిడు గారి సరళరేఖవంటిది కాదు. అదొక సుందరమగు వృక్షమును బోలునది. దాని యందుగల లక్షలకొలది యాకులలో నొక టేని మఱొక దానిని సర్వవిధముల పోలియుండ జాలదు. అన్నియు ఒకే విత్తనమునుండి ప్రభవించినను, ఒకే చెట్టునకు చెందినవైనను, ఆ చెట్టుయొక్క అవయవములలో వేనిని తీసి కొనినను, క్షేత్రగణితసంబంధి ఆకృతులందు చూపట్టు ఏక రూపత కాన్పింపదు. అయినను విత్తనము, కొమ్మలు, ఆకులు, అన్నియు ఒక్కచెట్టు సంబంధమగునవే యని మన మెఱుగుదుము. మఱియు ఏ క్షేత్రగణిత పటమైనను పూర్ణ వికాసము పొందిన చెట్టుతో అందమునందుగాని, రామణీయత యందుగాని సరిపోలజాలదని కూడ మనకు తెలియును.

అటులనే నా జీవితమునందు విలేఖరికి నసంబద్ధత కాని పించుపట్ల వైపరీత్యముగాని, వెఱ్ఱితనముగాని నాకు కాన్పిం

చుటలేదు. నరుడు తన వీపును తాను చూచుకొనజాలని రీతున తన దోషములను, తన వెఱ్ఱిపోకడలను, తాను తెలిసికొనజాలడనుట నిజము. అయినను పారమార్థిక జీవియగు మానవుని బుద్ధులు తఱచుగా వెఱ్ఱివానికి పోల్తురు. అందు వలన నేను వెఱ్ఱివాడను కాకున్నను నిక్కముగా మత ధర్మ పరాయణుడ నను విశ్వాసము నాకెంతయు సమ్మతము. ఈ రెండు తెగలలో నిజముగా నే నే తెగలోని వాడనైనది నా మరణానంతరము మాత్రమే నిర్ణయింప వీలగును.

జపమాలకు మారుగా రాటము చేపట్టుమని నే నెన్నడును శ్రోతలను కోరియుండలేదు. నారాయణనామ జపము చేయుచును కూడ రాటము వడకనగు నని మాత్రము నేను సూచించియుంటిని. ఈనాడు దేశమంతయు అగ్నిజ్వాలలో పడియుండెగాన, నోట నారాయణనామ జపముచేయుచు రాటములనెడు కడవలను నూలుదారమనెడు నీటితో నింపి ఆ యగ్నిని చల్లార్పదగునని నా యభిప్రాయము.

ఎచ్చో జూచినను దారిద్ర్యము తాండవించుటవలన నెల్ల తావులందును రాటము తిరుగుచుండ చూడవలయునని నా కోరిక. భారతదేశమున నడయాడు అస్థిపంజరము లనదగు క్షుధార్తులకు మన మన్న వస్త్రములను చేకూర్చిననే తప్ప, వారి సందర్భమున 'మత' మను మాట కేమాత్రము అర్థమును నుండ జాలదు. వారీనాడు పశు జీవనములను గడపు

చున్నారు. అందుకు మనము బాధ్యులమై యున్నాము. అందువలన రాట్నము త్రిప్పుట మనకొక తపస్సుగా నున్నది. 'మత' మనగా దిక్కులేని వారిని సేవించుటయే. దిక్కులేని వారి యొక్కయు హతభాగ్యుల యొక్కయు ఆకారము లందు భగవంతుడు మనకు ప్రత్యక్ష మగుచున్నాడు. మన ముఖములందు తిలకధారణములు చేయుచును గూడ వీరిని గురించి అనగా భగవంతుని గురించి మనము లక్ష్యము చేయుటలేదు. భగవంతుడు వేదము లందున్నాడు; మరియు లేడు ననవచ్చును. వేదములయొక్క భావమును పఠించు వానికే అందు భగవంతుడు గోచరించును. వేదములయొక్క అక్షరములను మాత్రము పట్టుకొని వ్రేలాడువాడు వేదీయుడు మాత్రమే. అనగా చదువరి మాత్రమే కాగలడు. నరసింహా మెహతాగారు జపమాల మహిమను స్తోత్రము చేసి యున్నారు. ఆ స్తోత్రము చేయబడిన సందర్భమున నది చాల యోగ్యమైనదే. అయినను ఆ నరసింహా మేహతాగారే ఇట్లు వచించుచున్నారు.

"తిలకమును, తులసిని ధరించుటవలన నేమి ప్రయోజనము? జపమాల త్రిప్పినను, నామజపము చేసినను ప్రయోజనమేమి? వేదములకు వ్యాకరణ సూత్రానుగుణ్యముగా వ్యాఖ్యలు చేసినను నేమి? అక్షర పాండిత్య మెంత గడించిన నేమి? ఇవన్నియు పొట్ట నింపుకొను నుపాయములే? పర

బ్రహ్మానుభూతి బడయుటలో తోడ్పడ జాలని సర్వమును వ్యర్థమే సుడీ!"

ముసల్మానుడు తన తస్బీదండను త్రిప్పుచున్నాడు. క్రైస్తవుడుచు తన పూసలను లెక్కించు చున్నాడు. కాని పాము కాటుచే పీడితుడై యెవడేని పడియున్నచో వాని రక్షణ కొఱకు పరుగిడుటలో తస్బీ గాని, పూసలపేరు గాని వారి కడ్డమై నిలచునెడల తాము (మత) ధర్మ భ్రష్టులమనియే వారెంచుకొందగుదురు. కేవలము వేదములను వల్లెవేయుట వలన మన బ్రాహ్మణులు ఆధ్యాత్మ గురువులు కాజాలరు. అట్లు కాగలుగుచో మాకును ముల్లనగారుగూడ నట్టివాడై యుండెడువాడే. ఈనాడు మతధర్మమును గ్రహించిన బ్రాహ్మణుడు వైదిక పాండిత్యమునకు తప్పక అప్రాధాన్యత నొసగి, రాట్నచక్ర ధర్మమును ప్రచారము చేయుచు, కోట్ల కొలదిగ నన్నము లేక మాడుచున్న స్వదేశీయుల ఆకలి బాధను ముమ్మొందు తీర్పగడంగ నొప్పును. ఆ పిమ్మట మాత్రమే ఆ బ్రాహ్మణుడు తన వేదాధ్యయనమునందు సాంతముగ నిమగ్నుడు కానగును.

సంకుచిత సాంప్రదాయిక మతాచరణముకన్న నూలు వడకుట శ్రేష్ఠతరమని నాదృఢాభిప్రాయము. అయినను మత ధర్మాచరణ విడిచివేయ దగినదని నా యర్థము కాదు. సర్వ మతములవారును ఆచరింప తగినధర్మము, విశిష్టమత ధర్మ

చరణముకంటె శ్రేష్ఠతరమైనదని నేను భావించుచున్నాను. అందువలన సేవాభావముతో రాటము త్రిప్పిన యెడల, బ్రాహ్మణుడు శ్రేష్ఠతర బ్రాహ్మణుడుగను, ముసల్మానుడు శ్రేష్ఠతర ముసల్మానుడుగను, క్రైస్తవుడు శ్రేష్ఠతర క్రైస్తవుడుగను కాగలుగునని నేను చెప్పుచున్నాను.

నా అవసానకాలము సమీపించెనను భావముతో నేను రామనామము జపించుటగాని, తులసీమాల త్రిప్పుటగాని ప్రాప లేదనుట నిశ్చయము. కాని రాటము త్రిప్పుపాటి బలము నా కిప్పుడు లేకుండెను. రామునిమీాద చిత్తము నేకాగ్రము చేయుటలో నాకు సహాయపడు నప్పుడెల్ల నేను తులసీ మాలను త్రిప్పుచుంటిని. మఱియు నా చిత్తైకాగ్రత సుస్థిరమై, తులసీమాల సహాకారమగుటకు మాఱుగా అవరోధముగ నుండునప్పుడు నేను దానిని కూడ వదలుచుంటిని. ప్రక్కలో పరుండియు రాటము త్రిప్పుట నాకు సాధ్యముగు నేని, నా మనస్సును భగవంతుని మీాద నేకాగ్రము చేయుట కది నాకు తోడ్పడునని తోచు నెడలను, నేను తప్పక తులసీ మాలను నావలబెట్టి, రాటమును చేబట్టుదును. నేను రాటము త్రిప్పగలంత బలముగల వాడనై యుండి, రాటము త్రిప్పుటనో, తులసీమాలను త్రిప్పుటనో, యొక్క-దానినే నిర్ణయించుకొనవలసి వచ్చునెడల, దారిద్ర్యము, క్షుద్బాధ దేశమును పీడించుచున్నట్లు నాకు కాన్పించునంత కాలము, తప్పక రాటమునే చేపట్టుటకు నిర్ణయించుకొందును. రామనామ జపము

సైతము అవరోధమై పోవుకాలము రాగలదని నిరీక్షించు చున్నాను. వాక్కును సైతము రాము డతిక్రమించు నని నేను అనుభూతిచేయు తరిని రామనామ జపము కూడ నా కవసర ముండదు. అప్పుడు రాటము, తులసీమాల, రామ నామము నాకు ఒక్కటియే యగును. అవన్నియు ఏకైక ఫలితార్థమును కూర్చు నవియే. అవి పరోపకార ధర్మమును నాకు బోధించుచున్నవి. పరోపకార ధర్మము నాచరింపకుండ నేను అహింస నాచరింప జాలను. అహింసా ధర్మము నాచ రింపనిది నేను సత్యమును కనుగొన జాలను. మఱియు సత్య మును మించిన మతధర్మము లేదు. సత్యమనిన నే రాముడు, నారాయణుడు, ఈశ్వరుడు, ఖుదా, అల్లా. దైవమును గూర్చి "నారసింహ మేహాతా మహాశయు" డిట్లను చున్నాడు; బంగారును "వేలు వేలు రూపమును పొందించినపుడు భిన్న భిన్న నామరూపములు కలుగుచున్నవి. ఐనను తుదకంతయు బంగారమే యగును......"

## భగవత్సేవ

ప్రశ్న :— మనము భగవంతుని నెఱుగనప్పుడు భగవ త్సేవ చేయు టెట్లు ?

స:— మనము భగవంతుని నెఱుగక పోవచ్చును. అయి నను వానిసృష్టి నెఱుగుదుము గదా. వాని సృష్టిని సేవిం చుటే భగవత్సేవ యగును.

ప్ర :— మనము భగవంతుని సృష్టికంతకు సేవచేయ గలుగు టెట్లు ?

స :— మన కత్యంతము సమీపమువనుండి, మనకు హెచ్చుగా తెలిసిన భగవత్సృష్టిలోని భాగమునకు సేవచేయ గలుగుదుము గదా. మన పొరుగువాని సేవతో మనము ప్రారంభమును చేయగలుగుదుము. మన వాకిలి ముందు శుభ్రముగా నుంచుకొనుటతో మనము తృప్తి పొందరాదు. మన పొరుగు వాని వాకిలిముందుగూడ శుభ్రముగా నుండు నటుల చూడవలయును. మనము మన కుటుంబమునకు సేవ చేసికొన వచ్చును. అయినను మన కుటుంబము యొక్క క్షేమము కొఱకు గ్రామము నుపేక్షింపగూడదు. మన గ్రామముయొక్క గౌరవ రక్షణమునందే మన గౌరవము నుండును. అయినను మన హద్దులను మనలో ప్రతివారమును తెలిసికొనియుండవలయును. మనము నివసించునట్టి ప్రపంచ మును గూర్చిన మనజ్ఞానము, మన సేవావకాశమునకు సహజముగా హద్దుపెట్టుచున్నది. ఈ విషయమునే మిక్కిలి స్పష్టమగు భాషలో తెలిపెదగాక : మన పొఱుగువాని క్షేమముకంటె మన క్షేమమును తక్కువగా తలంప వల యును. మన యింటి ముందఱి పాచిని పొరుగు వాని యింటి ముందర పేర్చుచో, అది మానవ సేవ యనిపించుకొనదు. అది యపరాధమే యగును. మన పొరుగువాని సేవతో మనము ప్రారంభింతుము గాక. భగవంతునకు వ్యక్తిపర

ముగా వాని కగు సేవలే అగత్యము లేదు. ప్రతిఫలముగా తన కొఱకై యెట్టి సేవను కోరకుండగనే, భగవంతుడు తన సృష్టిలోని జీవులకు సేవ చేయుచున్నాడు. ఇతరములగు ననేక విషయములందు వలెనే, ఈ విషయమందును భగవంతుడు విలక్షణుడుగా నున్నాడు. భగవత్సేవకు లెవరో, వాని సృష్టి లోని ప్రాణులకు వారు చేయు సేవలవలన తెలిసికొనవగును.

నరుని పరమనిష్ఠ భగవత్సాక్షాత్కారమే, గాన గ్రామములో కూర్చుండి గ్రామవాసులకు, తనకు చేతనైన సేవ చేయుటయే 'మానవసేవను' గుఱించిన గాంధిజీ గమ్యమగునా? యని ఒక మిత్రుడు ప్రశ్నింప గాంధీజీ ఇట్లు సమాధానము చెప్పుచున్నాడు.

స:—ఈ గ్రామజనుల సేవద్వారమున నా ఆత్మసాక్షాత్కారమును సిద్ధింపచేసికొనుచు, నితరుల కెవరికో కాక, నాకు నేనే యిక్కడ సేవ జేసికొనుచున్నాను. భగవత్సాక్షాత్కారమే నరుని పరమనిష్ఠయై యున్నది. సాంఘికముగాని, రాజకీయముగాని, ఆధ్యాత్మికము గాని, నరుని కర్మలన్నియు తుదకు భగవద్దర్శనము సాధించుకొఱకే సాగింపవలసినవిగ నున్నవి. భగవంతుని వాని సృష్టియందు సాక్షాత్కారము చేసికొని, ఆ సృష్టితో నైక్యానుభూతి పొందుటయే భగవంతుని కనుగొను ఏకైక మార్గము. కాబట్టియే సర్వమానవ సేవ ప్రప్రథమమున పూనుకొనుట ఆ పరమనిష్ఠయందు ప్రధా

నాంశమగుచున్నది. ఈ సేవ స్వదేశసేవద్వారమున తప్ప లభింపజాలదు. నేను అఖండముయొక్క అంశమునై యున్నాను. మఱియు మానవప్రపంచమునుండి వేఱుగా నేను భగవంతుని చూడజాలను. నాకత్యంతము దాపుననున్న పొరుగువారనగా నా స్వదేశీయులే. నేను వారి సేవ నెక్కెక నిష్ఠగ ప్రాపుటవసరముగునంతటి నిస్సహాయులుగను, నిరాశాపరులుగను, జడప్రాయులుగను వా రున్నారు. ఏదేని హిమాలయ పర్వత గుహయందు నేను భగవద్దర్శనము చేయగలుగుదు నని విశ్వసింపజాలు నెడల తక్షణము నే నచటికి పోయి యుందును. కాని మాధవుని మానవ సమాజము నుండి వేఱు చేసి కనుగొనజాలనని యెఱుగుదును.

ప్ర:— ఎట్టైనను నరుని ఆధ్యాత్మికాభివృద్ధికి సైతము కొన్ని సౌకర్యము లవసరము లగును. కోడిగ్రామస్థులయొక్క దుఃఖదారిద్ర్యములతో తా నేకీభావము పొందుటచేత నెవడును నభివృద్ధి పొందజాలడు.

స:— కొంతపరిమితి వఱకు శారీరక సుఖసౌఖ్యము లవసరమే. ఆ పరిమితి దాటినచో అవి సహాకారము లగుటకు మాఱుగా అవరోధములే యగును. కాబట్టి లెక్కలేకుండ మన అవసరములను పెంచుకొనుచు వానిని సమకూర్చుకొనుచుపోవు 'ఆదర్శము' భ్రాంతిమయమై, మనను భంగపఱచు గాలమువలె కాన్పించుచున్నది. మన శారీరకావసర

ములను, నింతేల, సంకుచితాత్మ ప్రేరితమగు బుద్ధియొక్క అవసరములను సైతము తృప్తిపరచుకొనుచు పోతిమేని, అట్టిచర్య తుదిముట్టక యెక్కడనో ఆగిపోవలసినదే. లేదా, శారీరక, మానసిక వ్యభిచారమున ముంచి నాశనమును కూర్చును. నరుడు తన శక్తుల నన్నిటిని నెందు నేకాగ్రము చేయవలసియుండునో, అట్టి మానవలోక సేవయందలి, తన కవరోధములై నిలువకుండ, తన శారీరక, మానసిక చర్యలను నియమించుకొనవలసి యుండును.

నేను ముఖాముఖిని భగవంతుని చూడ వాంఛించుచున్నాను. భగవంతుడు సత్యస్వరూపుడని నేనెరుగుదును. ఆ భగవంతుని తెలిసికొనుటకు నాకుగల ఏకైక సాధనము దౌర్జన్యరాహిత్యమే. అనగా అహింసాచరణయే. అనగా ప్రేమయే. భారతదేశ స్వాతంత్ర్యము, నే నారాధించు సత్యమునందు ఒక అంశయే గావున నేను దానికొరకై యే జీవించుచున్నాను. మఱియు దానికొరకే ప్రాణము లర్పింతును. స్వతంత్రమైననే భారతదేశము సత్యమగు దైవమును పూజింపగలుగును. భారతదేశములో పుట్టినవాడ నగుటచేతను, ఆ భారత సంస్కృతికి వారసుడ నగుటచేతను, నేను భారతదేశసేవకు పూర్తిగా నర్హుడననియు, నాసేవను ప్రప్రథమముగా కోరుటకు భారతమాతకు అధికారము గలదనియు, నా స్వదేశీవ్రతము నాకు బోధించుటచేతను నేను భారతదేశ

స్వాతంత్ర్యముకొఱకై పాటుపడుచున్నాను. అయినను నా దేశాభిమానము అన్యులను నెట్టివారవేయునది కాదు. నా దేశాభిమానము ఏ యితరజాతికిని నపాయకరము కాకపోవుటే గాక, యథార్థముగా సర్వజాతులకు మేలు గూర్చునదై యున్నది. నేను భావనచేయునట్టి భారతదేశ స్వాతంత్ర్యము ప్రపంచమున కెంతమాత్రమును నపకారకరము కాదు.

శ్లో॥ తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తేస్తేనఏవ సః॥

అని గీత బోధించుచున్నది. ఇతరులకు దానము చేయకుండ భుజించునట్టివాడు దొంగయే యగును. భగవంతుడు మనకు అధికారముగాని, ఆరోగ్యముగాని యిచ్చునెడల, స్వార్థపరమగు తుచ్ఛశరీరభోగముకొఱకు గాక, మానవకోటి క్షేమము కొఱకు వినియోగించు నిమిత్తమే వానిని మనకు ప్రసాదించు చున్నాడు.

మాధవసేవ నాకెంత ధర్మమో మానవసేవయు నా కంత ధర్మమగుచున్నది. భారతీయుడనై నేను భారతదేశమును సేవింపక పోయినను, హిందువుడనై హిందూదేశపు మహామ్మదీయుల సేవింపనియెడలను నేను మాధవసేవకుడను గాని, మానవసేవకుడనుగాని కాజాలను. ఐచ్ఛికమగు సేవయనగా వినిర్మలమగు ప్రేమవర్తనమని భావము.

భగవంతుడు అద్వితీయుడు, ఒక్కడేనని నా విశ్వాసము. కాబట్టి మానవజాతియు ఒక్కటేనని నా నమ్మకము.

ఎవడు తన తోడి మానవునికి సేవలొనర్చునో అట్టివాని హృదయమునే భగవంతుడు తనసింహాసనముగా వరించును.

భగవంతునియందును, వాని న్యాయదృష్టి రూపమగు కరుణయందును నిసుమంతేని విశ్వాసముగల నరుడు, మానవుల యధర్మ మార్గములను ద్వేషింపవలసిన వాడగుచును, ఆ మానవుల మాత్రము ద్వేషింపజాలడు. తనలో కావలసినంత దోషముండుటచే ఇతరుల దాక్షిణ్యము తనకే అవసరమగుచుండగా తనకు దోషులుగా కాన్పించువారిని, నరుడు ద్వేషింపతగడు. భగవంతుడు అద్వితీయుడై కేవలుడుగా నున్నాడు. అయినను ఆయన నాకు తనను చూడగలశక్తి నొసగుచు శిలయందును ఇంగ్లీషువాని యందును నింకను ద్రోహియందు సైతము తనను పూజించుట కవకాశ మిచ్చుచున్నాడు. నేను ద్రోహిని సైతము ద్వేషింపజాలను. నా ఆత్మధర్మము నన్నంతవరకు తోడ్కొని పోవుచున్నది.

నా ఆత్మధర్మము సత్యముపైనను, అహింసపైనను నాధారపడియున్నది. సత్యమే నా దైవము, అహింసయే ఆ దైవమును ప్రత్యక్షము చేసికొనుటకగు నా సాధనము.

భగవంతునియందు యథార్థమగు విశ్వాసము కలిగి 'మతము' యొక్క యథార్థ స్వరూపమును గ్రహించు

వారితో ప్రపంచమునకు తగాదా లేదు. ఒకవేళ లోకులు తమతో తగాదాకు దిగినను, అట్టి పురుషులు తమ సజ్జనత్వమువలన శత్రువుల క్రోధమును చల్లార్చివేయ గలుగుదురు. ఇచ్చట 'మత' మనిన నమాజుచేయుటగాని, దేవాలయములు దర్శించుటనిగాని అర్థముకాదు. 'మత' మనగా ఆత్మజ్ఞానమనియు దైవజ్ఞానమనియు, భావము...........

తృతీయ భాగము

# ప్రార్థన

భగవంతుని పూజించుటనగా భగవంతుని స్తోత్రగానము చేయుటే. ప్రార్థన యన మన దుర్బలతను, అనర్హతను వెల్లడించుట యగును, భగవంతునకు సహస్ర నామములు గల వనవచ్చును: లేదా ఆయనకు పేరే లేదనవచ్చును. మన కిష్టము వచ్చిన పేరుపెట్టి భగవంతుని పూజింపవచ్చును. ప్రార్థింప వచ్చును. కొందరు వానిని రామా యందురు; కొందరు కృష్ణాయందురు; ఇతరులు వానిని రహీ మందురు; మఱికొందరు వానిని దేవు డందురు. అయినను నందరును ఒకే పరమాత్మను పూజించుచున్నారు. అన్ని యాహారములు నందఱికి సరిపడనట్లు అన్ని పేరులును అందఱికిని హితవుగా నుండవు. ప్రతివాడును భగవంతుని గుఱించిన తన భావముల కనుగుణమగు పేరును నిర్ణయించుకొనును. భగవంతుడు అంతరంగవాసియు, సర్వశక్తి సంపన్నుడును, సర్వజ్ఞుడును కావున మన ఆంతరంగిక భావములను అత డెఱుగును, మఱియు మన అర్హతల ననుసరించి ఆయన ప్రసన్నత చూపుచుండును.

కాబట్టి పూజనుగాని, ప్రార్థనను గాని పెదవులతో చేయుట తగదు ; హృదయముతోడ చేయవలసియుండును. ఆ కారణముచేత మూగవాడును, నశ్త్రిగలవాడును, పామరుడును, మూర్ఖుడును ప్రార్థన చేయగల్గును. మఱియు నాలుకలయందమృతమును, హృదయములందు విషమును పెట్టుకొను వారి ప్రార్థనలు భగవంతుడెన్నడును వినడు. కావున భగవత్ప్రార్థనచేయువాడు తన హృదయమును నిర్మలము చేసికొనవలయును. రాముడు హనుమానుని పెదవులమీద మాత్రమే యుండువాడుకాడు; ఆయన హనుమానుని హృదయమందలి సింహాసనముమీద అధివసించి యుండువాడు. ఆయన హనుమానునకు శక్తియు బలమును ప్రసాదించినాడు. ఆయన ప్రసాదించిన బలముతోడనే హనుమానుడు పర్వతము నెత్తగలిగినాడు; సముద్రమును దాటగలిగినాడు. తుపానులు వచ్చినపుడు సముద్రములమీద మన పడవలను నిరపాయముగ నడుపగల్గునది మన విశ్వాసమే. విశ్వాసము మహాపర్వతములను కదలించి వేయగలుగును. విశ్వాసము మహాసముద్రములను లంఘింప గలదు. విశ్వాస మనగా అంతరంగమున వెలయు సచేతనమును, జాగరితనమును నగు భగవంతుని స్మృతియే. అటువంటి విశ్వాసమును సంపాదించుకొనిన వానికి నేలాటి కొరత యుండదు. అతడు శారీరకముగ రోగగ్రస్తుడయ్యును, ఆధ్యాత్మికముగా నారోగ్య

వంతుడై యుండగలఁడు; కాయికముగ దీనుడయ్యు ఆధ్యాత్మిక సంపదలందు నోలలాడ గలుగును.

సరే యింతటి హృదయ పారిశుద్ధ్యము సిద్ధించుటెట్లని శంక కలుగవచ్చును. పెద్దలభాష తేలికగా నేర్పవచ్చును; కాని హృదయభాష నెవరు నేర్పగలరు? భక్తుడు అనగా యథార్థముగు భక్తుడు మాత్రమే ఆ భావనెఱింగి, బోధింపగలుగును. భక్త లక్షణములను గీత మూడు తావులందు నిరూపించినది. మఱియు సర్వత్ర సామాన్యముగా వాని ప్రశంస చేసినది. అయినను 'భక్తుడ'న నిర్వచనము చేయఁగల తెలివి కలిగినంత మాత్రాన బాగుగా మార్గము తెలిసినట్లు కాదు. భక్తులు ప్రపంచమునకు సహజముగా నుందురు. కాబట్టి సేవా ధర్మమును లక్షణముగా సూచించియున్నాను. భగవంతుడు తన పీఠము నుంచు కొఱకై యెవరు తోడిమానవుల సేవనొనర్తురో యట్టి వారి హృదయములను తనంతట తానే వెదకి యేర్పరచుకొనును. కాబట్టియే "ఇతరుని దుఃఖము చూచి, కఱగిపోవ నేర్చినవాడే సత్యమగు వైష్ణవుడ"ని ప్రత్యక్షానుభవముచే గ్రహించిన నరసింహ మేహతాగారు గానము చేసియున్నారు. "అబుబెన్ ఆధామ్‌గారు" నట్టివారే. ఆయన తోడిమానవుల సేవ సలిపియున్న కారణమున, భగవంతుని సేవించువారి పట్టికలో ఆయన నామము ప్రప్రథమమున పేర్కొన బడెను.

సరే, బాధలు పడువారు, దుఃఖము లనుభవించువారు అన నెవరు? అణఁగ ద్రొక్కబడినవారును దారిద్ర్యమున క్రుంగిన

వారుననే, భక్తుడు కాగోరువాడు త్రికరణశుద్ధిగ, మనో వాక్కాయములతో, నిట్టి వారిని సేవింపవలయును. అణగ ద్రొక్కబడిన తరగతుల వారిని పాకరాని వారినిగా నెంచు నతడు శారీరకముగ వారికేమి సేవ జేయగలడు? దరిద్రుల సాహాయ్యము కొఱకు నూలు వడకుపాటి శరీరశ్రమనైనను చేయుటకొడంబడక, ఏవేవో మాటలు చెప్పువాడు సేవ యన నర్థము తెలిసికొనజాలడు. దృఢకాయుడగు సోమరికి బిచ్చ మెత్తు వర్తతయుండదు. పనిజేసి భక్తి సంపాదించుకొనుమని అట్టి వానిని ప్రోత్సహింపవలయును. భిక్షమిడుట వానికి పతనము చేకూర్చును. పేదవారి యెదుట కూర్చుండి నూలు వడకుచు వారిని గూడ తనవలెనే చేయుడని ఆహ్వానించు నతడు భగవత్సేవ చేయువాడే యగును. తదితరుడెవడును వారి సేవచేసిన వాడుకాడు. "భక్తి భావముతో నొక ఫల మునో పుష్పమునో లేక పత్రమునో నాకేమిచ్చినను నట్టి వాడు నా సేవకుడగును" అని భగవానుడు గీత యందు తెలిపియున్నాడు. నమ్రజనులు, నిమ్నులు, గతి లేనివారు నెచ్చోనుందురో యా క్షేత్రము భగవానుని పాదపీఠమగును. అట్టివారి కొఱకై నూలు వడకుట శ్రేష్ఠతమమగు ప్రార్థనయే యగును. అదియే శ్రేష్ఠతమమగు పూజయు, శ్రేష్ఠతమమగు యజ్ఞమును కూడ నగును.

కాబట్టి యే పేరుతోనైనను ప్రార్థన చేయవచ్చును. ప్రార్థనా భరితమగు హృదయమే తగిన యాచన. సేవా

సాధన హృదయమును ప్రార్థనా భరితము చేయును. మన స్ఫూర్తిగ నీయుగమున అంటరాని వారి సేవ చేయు హిందువులు సత్యముగా ప్రార్థన చేసినవారే యగుదురు. హిందువులుగాని తదితరులుగాని ప్రార్థనా పూర్వకముగ బీద వారి కొఱకును దిక్కులేని వారి కొఱకును నూలు వడకుదు రేని నిజముగా ప్రార్థన చేసినవారే యగుదురు.

ప్రార్థన చేయనిది నే నే కార్యమును పూనను. నరుడు పొఱపాట్లు చేయుజీవి, అతడు తన కర్మఫలముం గుఱించి యెన్నడును స్థిరనిశ్చయముతో నుండజాలడు. తన ప్రార్థనకు ఫలితమని యతడు చెప్పుకొనునది వాని గర్వము యొక్క ప్రతిధ్వనియు కావచ్చును. నరుడు నిర్దుష్టముగా మార్గమును తెలిసికొనవలయుననిన, దోషచింతనమే చేయజాల నట్టియు, పరిపూర్ణముగా నిష్కల్మషమగునట్టియు హృదయమును కల్గి యుండవలయును. నాకట్టిది కలదని చెప్పికొనజాలను. నా హృదయము పరితాపపడుచు, పాటుపడుచు, పొఱపడుచు పూర్ణతగానలేక తిరుగుళ్లు పడుచున్నది. అయినను నాయెడ లను, యితరులయెడలను, ప్రయోగములు సాగించుట మూల మున, నున్నతికి రాగలుగుదును. భగవంతుడు నిస్సందేహ ముగా నొక్కడే యనియు, కావున మానవకోటి యంతయు నొక్కటే యనియు నేను నమ్ముచున్నాను. మన కనేకము లగు శరీరములున్నను, మన అందఱి ఆత్మయు ఒక్కటియే.

సూర్యుని కిరణములు ప్రసారణముచేత ననేకములుగా నున్నవి. మూలతేజము మాత్ర మొక్కటియే. నేనత్యంతము దుష్టాత్ముని నుండియు వేఱుపడి పోజాలను. అటులనే యత్యంత వినిర్మలాత్మునితోడి యైక్యతయు నాకు లేకుండ పోదు. కావున నాకిష్టమున్నను, లేకున్నను నాతోడి జీవుల సంపర్కిని నా ప్రయోగములం దిముడ్చుకొనవలసిన వాడనై యున్నాను. ప్రయోగములు చేయకను నుండజాలను. జీవిత మిదియనే అనంత మగు ప్రయోగ మాలికగా నున్నది.

## ప్రార్థనయందు విశ్వాసము

ప్రార్థన సమావేశములకు హాజరుగాకుండ తనను వదలి వేయుడని కోరుచు నొక విద్యార్థి యొక జాతీయ పాఠశాలాధ్యక్షునకు నీ క్రింది రీతిని విజ్ఞాపన చేసియున్నాడు.

లేఖ:- నేను ప్రార్థన చేయవలసిన దేవత యని పేర్కొనబడు దేనియందుగాని నాకు విశ్వాసము లేదు. కావున, ప్రార్థన మన నాకు విశ్వాసము లేదని మనవి చేయుచున్నాను. నా మట్టుకు దేవుడొకడు కలడనియే యూహచేయు నగత్యము నా కెన్నడును తోచుటలేదు. నెమ్మదిగను, శ్రద్ధగను నా ప్రయత్నములను నేను సాగించుచు, దేవుడు కలడని పాటింపకుండ వర్తించినచో నాకు నష్టమేమి?

సాముదాయకముగా ప్రార్థన చేయు సందర్భమందురా! అది వ్యర్థపు పని. ఎంతటి స్వల్పపుదైనను, నేదేని యంశమును

కూర్చి ఆ పెద్ద ప్రజా సముదాయమున ఏకాగ్ర చిత్తతను కూర్చుకొన సాధ్యమగునా? దేవుడు, ఆత్మ, సర్వమానవ సమానత్వము, ననుచు మన పవిత్రగ్రంథములు చెప్పు నతి గంభీర వాక్యముల సూక్ష్మతర భావములమీద నజ్ఞానులగు చిన్న బిడ్డలు తమ చంచలచిత్తముల నేకాగ్రము చేయ వలయునని మీ రాశించుదురా? ఇట్టి మహాత్కార్యము కూడ నొకానొక విశిష్ట పురుషునియొక్క యాజ్ఞననుసరించి యొకానొక ప్రత్యేక సమయమున జరుగవలసియుండెను గదా! అటువంటి జడయంత్ర క్రియను బోలు కర్మవలన నీ బాలుర హృదయములలో ఆ పరమేశ్వరు డనువాని యందలి భక్తి వేరూనుకొనగలుగునా? నానాచిత్తవృత్తులుగల మానవుల నుండి యొకే చర్యను నిరీక్షించుటకంటె వివేకశూన్యమగు కార్య ముండబోదు. కాబట్టి ప్రార్థనను గుఱించి నిర్బంధ ముండ తగదు. ప్రార్థనయం దభిరుచి గలవారిని ప్రార్థన చేయ నిండు; ఇష్టము లేని వారిని దానిని వదలి వేయనిండు. నమ్మకము లేక చేయు కార్య మెట్టిదైనను అవినీతికరమై పతనహేతు వగును.

స:— ఈ చిట్టచివఱి అభిప్రాయముయొక్క యోగ్యతను మొట్టమొదట విచారింతము గాక. క్రమశిక్షణముయొక్క యవసరమును గుఱించిన నమ్మకము ఒకనికి గోచరింప నారంభించుటకు పూర్వము, అట్టి శిక్షణమునకు లొంగుట యను

కార్య మవినీతి కరముగను, పతన హేతువును నగునా? బడిలో నేర్పు పాఠక్రమముయొక్క ప్రయోజనమును గుఱించి నమ్మకములేని యొకడు అట్టి పాఠములను చదువుట యవినీతి కరమును, పతన హేతువును నగునా? మాతృభాషను నేర్పుట నిరుపయోగమని యొక బాలు డభిప్రాయము పూనునెడల, నట్టి బాలునికి వాని స్వభాషను నేర్పకుండ వదలివేయ నగునా? ఒకబడి కుఱ్ఱవానికి తాను నేర్వవలసిన పాఠముల గుఱించియు, తాను పొందవలసిన శిక్షణముల గుఱించియు నెట్టి విశ్వాసమును నుండదనుటయే యెక్కువసత్యము కాదా! అతడొక పాఠశాలలో చేర నిర్ణయించుకొనుకాలమున, వాని కేమేని నిర్ణయాధికారమున్నను, అది యంతటితో నంత మొందుచున్నది. అత డొక పాఠశాలలో చేరినప్పుడు, ఆ పాఠశాలయొక్క నీమములకు, విధులకు నతడు లోబడుట కంగీకరించెననియే యర్థము. ఆ బాలు డా పాఠశాలను వదలి వేయుట కభ్యంతర ముండదుగాని, తా నేమి నేర్చుకొన వలయునో, యెట్లు నేర్చుకొన వలయునో యాతడు నిర్ణ యించుట యొప్పదు.

విద్యార్థులకు మొట్టమొదట నసహ్యాకరముగను, నిరు త్సాహాకరముగను కాన్పించు దానిని సుగ్రాహ్యముగను, మనోహరముగను చేయుపని యుపాధ్యాయులదై యుండును. 'నేను భగవంతుని యందు విశ్వాసము పూనను' అని చెప్పుట

చాల తేలికయే. ఏమందురా, నిర్భయముగా తనను గుఱించి యేమి చెప్పినను భగవంతు డూరుకొనును. ఆయన మన చేతలను చూచుచుండును. భగవంతుని శాసనమును భంగ పఱచునెడల నసి తీర్పుకొను దండన వెంటనే మనపై బడదు గాని, మనను ప్రసీతుల జేయునట్టియు, నిగ్రహించునట్టియు శిక్షణము ప్రాప్తించును. భగవంతుని యునికిని ఋజువు చేయజాలము; ఋజువు చేయుటకు నవసరమును లేదు. భగ వంతుఁ డున్నాడు! భగవంతుని అనుభూతి చేయజాలమేని, ఇది మన దురదృష్టము. అనుభూతి శూన్యతయేదో యొక నాడు, మన కిష్టమున్నను లేకున్నను నివారించుకొని తీర వలసిన రోగమువంటిది.

విద్యార్థి వాదనకు దిగతగదు. తా నున్న విద్యాలయము వారు ప్రార్థన సమావేశములకు రావలయునని కోరునెడల, క్రమశిక్షణాంశముగ పాటించి అటు డటుల చేయవలసి యుండును. తన సంశయములను ఉపాధ్యాయుల యెదుట సవినయముగా తెలుపుకొనవచ్చును. తనకు సత్యముగ తోచనిదాని నతడు విశ్వసింప నక్కఱలేదు. అతడు తన గురువుల యెడల గౌరవము గలవాడగునేని, తనకు విశ్వాసము లేకున్నను వారు చెప్పుదానిని చేయును. అటుల చేయుట భయముచేత గాని, చిత్తోద్రేకముచేతగాని కాగూడదు, కాని అటుల చేయుట తనకు ధర్మమను జ్ఞానముతోడను, తన

కీ నా డంధకారమయముగ గోచరించునది, ముందొకనాడు తేట తెల్లము కాగలదను నాసతోడను అటుల చేయఁదగును.

ప్రార్థనయనగా దేనికొఱకేని అడుగుట కాదు. అది హృదయముయొక్క యావేదన. అది అనుదినము మన దుర్బలతను నంగీకరించుట మాత్రమే. మనలోని మహాత్మునకు సైతము, మరణము, రోగము, వృద్ధాప్యము, ఆపాంతరబాధ కలుగు సమయములందు, నిస్సహాయ్యులమని సదా జ్ఞప్తి నుంచుకొనవలసినవా డగుచున్నాడు. మనము మృత్యు మధ్యమున జీవించుచున్నాము. మన యుద్యమము తెప్పపాటు కాలములో రూపుమాసి పోజాలుచుండగా, మఱియు అంతటి వేగముతోడనే, మనకు తెలియకుండగనే, మనము మన ఉద్యమములను వీడిపోవలసినవార మగుచుండగా, మన యుద్యమములను మనమే సాగించుకొందు మనుటలో నేమి సారస్యముగలదు? అయినను మనము భగవంతుని కొఱకును, వాని యుద్యమము కొఱకును సేవ చేయుచున్నామని యథార్థముగా చెప్పగలుగుదు మేని, పర్వతమును బోలి, సుస్థిరులముగా నెంచుకొనగును. అప్పుడు సర్వమును పట్టపగటివలె సుస్పష్టముగా నుండును. అట్టిచో నేదియు నాశ మొందునటుల దోపదు. అప్పుడు నాశమునందు సర్వమును చూపులకే అటుల గాన్పించును. మరణ మన్నను, నాశనమన్నను ఆ స్థితియందు, మఱియు ఆస్థితియందు మాత్రమే మిథ్యాభూతము లగును.

అప్పుడు మరణముగాని నాశముగాని యొకానొక దశాంతర మనిపించును. శిల్పిశ్రేష్ఠతర సృష్టికొఱకై యొక విగ్రహమును నాశనము చేయునుగాదా? గడియారముల బాగుచేయు నతడు, క్రొత్తదాని నమర్చునిమిత్తము, ప్రాతరేకు చుట్టును తీసివేయుట లేదా?

సాముదాయక ప్రార్థన యొక మహత్తర విషయమై యున్నది. మన మొంటరిగా చేయజాలని దానిని, తఱచుగా సమిష్టినికూడి చేయగలుగుచుందుము. బాలుర కనుభవ పూర్వక విశ్వాసముండ నక్కఱలేదు. అంతర్యమందు విరుద్ధ భావము లేకుండ ప్రార్థనకొఱకై పిలుపు వచ్చినపుడు, శిరసా వహించి ప్రార్థనచేయ పూనువారుత్సాహమును తమలో ననుభూతి చేయగలుగుదురు. కాని చాలమంది ఆ తీరున చేయరు. వారు కొంటెతనమునుకూడ చూపుచుందురు. ఎట్లైనను తమయందుగల్గు అవిజ్ఞాత సంస్కారము నణచి వేయజాలరు. ప్రారంభమునందు నిరసనము జూపుచు వర్తించినట్టియు, కాలక్రమమున సాముదాయక ప్రార్థనా మహిమమునందు గట్టి విశ్వాసము గలవారైనట్టియు బాలురులేరా? సాముదాయక ప్రార్థనయొక్క యానంద మును కోరుకొనుటకు తగినంత ప్రబల విశ్వాసములేని పురుషులకును నట్టి యనుభవము చేకూరుటయు సామాన్య విషయమే. చర్చీలందును, దేవళములందును, మసీదులందును

గుమిగూడు వారందఱును పరిహాసకులు గాని, మోసగాండ్రు గాని కారు. వారు సౌజన్యభావముగల స్త్రీ పురుషులు సుడీ! వారిపట్ల సాముదాయిక ప్రార్థనమన నిత్యముచేయు స్నానము వంటిది. అది వారి బ్రతుకునకు నవసరమగు విషయమే. ఈ యర్చనాలయము లన్నియు నవకాశము చిక్కిన తోడనే తుడిచిపెట్టి వేయదగిన మూర్ఖకూటములు కావు. ఈ నాటి వఱకు నెన్నియో దాడుల నవి గడచి నిలచినవి. మఱియు ననంత కాలమును నటుల నిలిచి యుండనోపును.

## వ్యర్థపఠనములు

ప్ర:— ప్రార్థనలను, జడయంత్రములవలె నాలాపము చేయుట కేవలము వ్యర్థచర్య యగుటేగాక యనర్థమునగునని యెల్లరు నొప్పుకొందురు. అది ఆత్మవిూద నల్లమందువలె పని చేయును. ప్రతి ఉదయము, సాయంతనము, పదునొకండు మహాప్రమాణములను రోకంటిపాటవలె పాడుటను మీ రెందుకు ప్రోత్సహించు చున్నారో యని నేను తఱచుగ విస్మయము చెందుచున్నాను. అది మన బాలురయొక్క నైతిక జ్ఞానమును మొద్దుబాఱ చేయుటలేదుగదా? ఈ ప్రమాణములను నేర్పుటకు శ్రేష్ఠతరమార్గ మేమియులేదా?

స:— కేవలము యంత్రముల వలెగాక, పదేపదే పలుకు శబ్దములకు నద్భుతమగు ఫలము గలదు. అందువలననే జపతావళము త్రిప్పుటను మూఢాచారముగ నేను భావింపను.

చంచలమై తిరుగులాడు మనసును శమింపజేయుటకది సాహా
య్యముగ నుండును. ప్రమాణములను అనుదినము వల్లెవేయు
టన అది నేత్రోక రకముక్రింద చేరును. నిష్కపటియగు సాధ
కునిపట్ల, నతడు నిద్ర జేయుచున్నను, పరుండబోవు నప్పుడును,
లేక ప్రవర్తనను సవరించుకొను కొఱకు, పదునొకండు
ప్రమాణముల కతడు సదా వశమైయున్నాడను మాటను
వానికి జ్ఞప్తిచేయుచుండును. కేవలము వాచకమాత్రాననే
అవి వ్యర్థపదములగునను భ్రాంతిలోపడి, కేవల జడయంత్రము
మాదిరి నొక పురుషుడా ప్రమాణములను పదేపదే పఠించు
నెడల వాని మహిమ భంగపడు ననుటకు సందేహము లేదు.
"అసలీ ప్రమాణములను పదేపదే పేర్కొను టెందులకు?
అట్టి ప్రతిజ్ఞలను మీరు తీసికొంటిరనియు, వాని నాచరించు
వారుగా విశ్వసింపబడుచునే యున్నారనియు, మీకు తెలి
యును గదా" యని మీరు ప్రశ్నింపవచ్చును. ఆ వాదన
యందు కొంత బలము కలదు. కాని బుద్ధిపూర్వకముగా పదే
పదే చెప్పకొనుటవలన ప్రతిజ్ఞలకు బలము, ప్రోత్సాహము
కలుగుట అనుభవసిద్ధము. మనుష్యుల శరీరములకు లేహ్యము
లెటువంటివో, మనుష్యుల హృదయ మానసములకు ప్రమాణము
లటువంటివి. ఆరోగ్యవంతములగు శరీరములకు లేహ్యా మగ
త్యము లేనట్లు, దృఢమగు మనస్సు ప్రమాణముల యొక్క
గాని, వాని ననుదినము జ్ఞప్తిచేసికొనుట యొక్కగాని యగ
త్యము లేకుండనే, ఆరోగ్యమును సంరక్షించు కొననగును.

ఈ ప్రమాణములను పరీక్షించినమీదట, మాలో ననేకుల మట్టివంటి ప్రమాణముల సాహాయ్యమవసరమగు సంతతి దుర్బలులముగానే యుంటిమని తెలిసికొంటిమి.

ఒక విశేషకరి శ్లాఘావేశముతో వ్రాయుచున్నాడు:—భగవత్ప్రార్థన చేయు నలవాటును గుఱించి, ముఖ్యముగా నాము దాయక ప్రార్థనల గుఱించి, మీరు గావించిన యద్భుతమగు మండనమనెడు తైలములో నొక చిన్న ఈగ పడెనేమో యని నేను భయపడుచున్నాను. చర్చీలు, దేవళములు, మసీదుల సందర్భమున మీ వ్యాసము తుది నిట్లు వ్రాసియున్నారు: "ఈ యర్చనాలయము లన్నియు నవకాశము చిక్కినతోడనే తుడిచిపెట్టి వేయతగిన మూర్ఖకూటములు కావు. ఈనాటి వఱకు నెన్నియో దాడుల నవి గడచి నిలిచియున్నవి; మఱియు ననంతకాలమును నిలచి యుండనోపును."

దీనిని చదివిన మీదట నే నిట్లు తర్కించు కొంటిని. దాడులా? యెవరివి? దైవభక్తులలోని పరస్పర విరుద్ధశాఖల వారే యొండొరుల అర్చనాలయముల మీద దాడి వెడలి యున్నంత విఱివిగా నాస్తికులుగాని, పరిహాసకులుగాని యెన్న డేని దాడులు సలిపి నటుల ప్రసిద్ధిలేదు. నిజ మేమన, మీరు పేర్కొనిన దాడు లన్నియు కాకున్నను, అత్యధికమైనవి 'భక్తిపరాయణులగు' దుండగీండ్రులచేత, తమతమ దేవతల పేర, ఆ దేవతల ప్రభావ ప్రకటనకొఱకు, జరిపియున్నవే!

నేను ఉదాహరణలు తెలుపుట మీ ప్రపంచ చరిత్రజ్ఞానమును అవమానించుట యగును.

నా రెండవ సంశయ మిది :— ఈ యర్చనాలయములు దాడుల నన్నిటిని గడచెనని చెప్పుట నిజమా? అట్లు యథార్థముగ చెప్పనగునా? నాకు తట్టిన జవా బిది :— ఎంతమాత్రమును కాదు. బుద్ధదేవుని కాలమునకు పూర్వమునుండి సైతము, ననేక శతాబ్దములవఱకు, విశ్వనాథుని యాలయము వెలసిన వారణాశియందలి యా ప్రదేశమును చూడుడు. 'జిండాపీరు,' 'సుల్తాన్ అవులియా' అను బిరుదులు వహించిన మహాపవిత్ర చక్రవర్తి ఔరంగజీబ్ యొక్క ఉత్తరువుల ననుగుణముగా విధ్వంసము చేయబడిన యా ప్రాచీన దేవళము యొక్క శిథిలముల పైని నిర్మింపబడి యా పవిత్ర నగరమున నధిష్ఠానముగ వెలయు మసీదుగల క్షేత్రమును చూడుడు! ముసల్మానులకు పవిత్ర భూమియగు హెడ్జాజీలోని యనేక ప్రార్థనాలయములయం దిటీవల జరిగిన విధ్వంసక వినాశకార్యములకు బాధ్యులగు వారు ఘోర భక్తాగ్రణి యగు 'యిబిన్‌సాదు'ను, మఱియు వాని వహాబీ దండులే గాని, విశ్వాసశూన్యులగు బ్రిటిష్‌వారు కారుగదా? ఈ ఘాతుక కార్యములను గుఱించి ముసల్మానులగు భారతదేశీయులు ముక్తకంఠములతో నీనాడు దుఃఖములను వెలిబుచ్చుచుండిరి. ప్రపంచములోని ముసల్మాన్ ప్రభువులలో నొక్కడు

మాత్రమే, అనగా మన హైదరాబాద్ నైజాం మాత్రమే, తన స్వంత సొమ్ముతో నా యర్చనాలయములను పునర్నిర్మాణము చేయుటకై వ్యర్థప్రయత్నములు చేసియుండలేదా!

ఓ మహాత్మాజీ! యీ ప్రత్యేక సంఘటనలు విూరు పాటింప నర్హములు కావా యేమి?

స:— ఈ ప్రత్యేకాంశములు నేను మిక్కిలిగా పాటింప తగినవే! అవి నిస్సందేహముగా నరునియొక్క దుర్నయమును రుజువు చేయుచున్నవి. మఱియు నా కవి బుద్ధిగఱపుచున్నవి! అసహాసపూరితుడనై పోకుండ నన్ను హెచ్చరించుచున్నవి. అసహన శీలునిపట్ల సైతము నన్ను సహనము పూనునటుల చేయుచున్నవి! అవి నరుని యల్పత్వమును ప్రదర్శింపుచు నతడు ప్రార్థనచేయ పూనినపట్ల ఆ ప్రార్థనల నలుపు నటులనే ప్రేరేపించుచున్నవి. ఏ మందురా, సర్వశక్తుని ప్రోల మోకరించి, నెత్తురోలుకు కన్నీటితో వాని పాదముల కడుగుచు, వాని పదతాడనము క్రింద ధూళియైపోవ కోరుకొనుచు, గర్వభంగము పొందిన యుదంతముల నీ చరిత్ర చూపుట లేదా? సత్యముగా 'అక్షరాలు ప్రాణముతీయును; భావము బ్రతుకు నొసగు' ననుట తథ్యము. 'యంగు యిండియా' పత్రికను చాల సక్రమముగను మిక్కిలి శ్రద్ధగను పఠించు వారిలో నొకరగు ఈ విలేఖరి 'యర్చనాలయము' లనగా, నా యభిప్రాయములో, కేవలము ఇటుకలు సున్నము

కావని, యిప్పటికైన తెలిసికొని యుండవలసినది. అవి సత్య వస్తువుయొక్క ఛాయామాత్రమే. వినాశము చేయబడిన ప్రతి చర్చికి, ప్రతి మసీదునకు, ప్రతి దేవాలయమునకు బదులుగా వందల కొలది నూతనముగా వానికి మారుగా పుట్టుకొని వచ్చుచున్నవి! భక్తులని పిలుచుకొనువారు తమ భక్తికి చిహ్నముగా వర్తించుచుండుటయు, మహా పుణ్యక్షేత్రములుగా ప్రసిద్ధిబడసిన యాలయము లనేకము నేలమట్టము చేయబడు చుండుటయు, ప్రార్థనయొక్క యావశ్యకతకు సంబంధించిన వాదనకు పూర్తిగ నప్రస్తుతములు, ఎవరియెడ ప్రార్థన మనునది ప్రత్యక్షముగ ప్రాణాధారమై యొప్పునో, అట్టి పురుషులు ప్రపంచమున పూర్వమునుండెడివా రనియు, నిప్పుడును కల రనియు నేను రుజువు చేయగలుగుచో, నా వాదనకు సరిపోవు నని నా యాశ. మఱియు సరిపోవుచుకూడను. ముందుగ నెట్టి నిశ్చితాభిప్రాయములను పెట్టుకొనక నిరాడంబరముగా మసీదులకును, దేవాలయములకును, చర్చిలకును పోవు నలవాటును చేసికొనుడని విశేషరీతి హెచ్చరించెద గాక. ఆడంబరము కొఱకు గాని, లేక మోమోటమిచేత గాని, భయముచేత గాని కాకుండ, కేవలము భక్తి ప్రేరితులై ఈ చోటులకు పోవువారిని సంస్కరింప జాలునదియు, హృదయరంజక మగునదియు నేదియో కొంత వానియందు కలదని, నేను కనుగొని నట్టులనే, విశేషరీతియు కనుగొన గలుగును. అదేదియో యిట్టి దని వివరించుట సాధ్యపడదు. దోషములకును మూఢ విశ్వా

సములకును అవి నీతికి నైతము నాలవాలములైన, ఈ నాటి తీర్థ క్షేత్రములకును పోవునట్టి విదిర్గాలాస్త్రాలు తాము గావించు పూజా క్రతువుల వలన హెచ్చు పవిత్రవంతులై యా క్షేత్రములనుండి మఱలివచ్చుచున్నారను సత్యమునకు భంగములేదు. కాబట్టి

శ్లో॥ యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం

ఎవరే రీతిన నన్ను పూజించుచున్నారో నేను వారి కా రీతిననే ఫలము నొసగుచున్నాను. అనెడు భగవద్గీతలోని ప్రతిజ్ఞావాక్యము సార్థకమగుచున్నది.

ఈ విలేఖరి వ్రాసినది, మన నీనాడు బాధించునట్టియు, సాధ్యమైనంత వేగముగా మనము తొలగింప ప్రయత్నము చేయవలసినట్టియు అనర్థములను తెలుపుచున్నదనుటకు సంశయము లేదు. మన దృక్పథమును విశాలతరము గావించుకొని మతములను పావనతరములు చేయుకొనుటకగు ప్రబోధమే అది! ఆ మాత్ర మవసరమగు సంస్కరణము నిశ్చయముగా కలుగు చునే యున్నది. శ్రేష్ఠతరమగు ప్రబోధము విశ్వమున సామాన్యమై వెలయుచున్నది. మఱియు మనమందఱము గాఢముగ వాంఛించు సంస్కరణకు నైతము, శ్రేష్ఠతరమగు నాత్మవారి శుద్ధ్యమలవడు నిమిత్తము, సాంద్రభావ ప్రేరితమగు ప్రార్థనము అవసరమని నా మనవి. ఏలయనగా సామాన్యముగా మానవజాతియందు గాఢతర పారిశుద్ధ్యము పొడసూపనిది,

పరస్పర సహనభావము, పరస్పర సద్భావము సాధ్యము కాజాలవు.

## మాటల పీడ

ప్రార్థనయందు తనకు విశ్వాసము లేదను బాలుని గురించిన నా వ్యాసమును చూచి యొక విలేఖరి నన్నిట్లు ప్రశ్నించుచున్నాడు.

మీరు వ్రాసిన వ్యాసమా బాలునికిగాని — గొప్ప మనీషావంతులగు మీకుగాని న్యాయము చేకూర్చునదిగ లేదే! ఆ బాలుడు తన ఉత్తరములో వాడిన మాటలు పూర్తియైన పొందిక లేనివనుట నిజమే. కాని వానిభావ నైర్మల్యము నిశ్శంకముగానే యున్నది. సాధారణముగా 'బాలుడ'ను మాటకు మన మర్థము చేయు వ్యక్తివంటివాడు; అతడు కాడనుటయు స్పష్టమే. అత డిరువది సంవత్సరములకు లోపువాడగుచో నాకాశ్చర్య మగును. ఒకవేళ నతడు చిన్నవాడేయైనను, 'బాలుడు' తర్కమునకు పూన తగడనుచు త్రోసిపుచ్చదగిన వ్యక్తికంటె చక్కని బుద్ధి పాటవమును ప్రకటింపజాలినవాడుగా కాన్పించుచున్నాడు. ఆ లేఖవ్రాసిన యతడు తర్కానుసరుడు; మీరో విశ్వాసప్రియులు. తర్కవిశ్వాసములనునవి ప్రాచీనకాలమునుండి వచ్చుచున్న రెండు తెగలు. పూర్వకాలమునుండి వీనికి వైరమే. ఒక తెగవారి వైఖరి నాకు నచ్చచెప్పుడు, నేను నమ్మెదను' అనునట్లుండును.

రెండవ తెగవారి వైఖరి 'ముందు నమ్ముము, మనస్సమాధాన మలవడును' అనునట్లుండును. మొదటి తరగతివారు తర్కముపై నాధారపడుదురు; రెండవ తరగతివారు ప్రమాణ మేదేని కలదా యని చూతురు. అజ్ఞేయవాదము యువకులలో వెలసిన క్షణకాలపు వైఖరి యనియు, త్వరలోనో ఆలస్యముగనో వారియందు విశ్వాస మంకురించు ననియు మీ రభిప్రాయ పడుచున్నట్లు కాన్పించుచున్నది. మీ యభిప్రాయమున కాధారముగా వివేకానందస్వామియొక్క సుప్రసిద్ధ చరిత్ర కలదు. అందువలన ఆ 'బాలుని' క్షేమము నిమిత్తము ప్రార్థన యను మోతాదును బలత్కారముగా మీరు నియమింప చూచితిరి. అందుకు మీరు చెప్పు కారణములు రెండు : నరుని యొక్క అల్పత్వమును, ఊహాకల్పితు డగు దేవత యొక్క మహిమను, నౌదార్యమును నంగీకరించుటకు ప్రార్థన గుర్తుగా నుండు ననుట యొకటి, దాని ప్రయోజనము కోరుకు అనగా శాంతి గోరువారికది యొసగు శాంతికోరుకును అవసర మనుట రెండవది. ఇవి మీరు చెప్పు నిష్కామ ప్రార్థనకు కారణములు. ఈ రెండవ కారణమును గూర్చి నేను మొదట విచారణ సలిపెదను. బలహీనున కొకరీతి చేతికఱ్ఱవలె ప్రార్థనను మీరు సిఫార్సు చేయుచున్నారు. జీవితపు పరిశోధన లట్టివిగా నున్నవి; మఱియు మానవుల వివేకమును భ్రష్టముచేసి యేదో యొక కాలమున ప్రార్థనము విశ్వాసము ప్రజలలో చాలమంది కవసర మనిపించునంతటి గొప్పదిగా వాని

జల మున్నది. అట్టి భావమునకు వారర్హులు, వారటుల భావించుకొన వచ్చును. మఱియు నట్టి భావస్ఫురణ నే యెన్నడు నెఱుంగని వివేకవాదులు కొలది మందియే యనుట నిజమే. కాని, యీ కొందఱైనను నెల్లప్పుడు నుండిరనుటయు, నుండగల రనుటయు నిశ్చయము. మఱియు తీవ్రముగా శంకించుచున్నను, మతము నెడల నుపేక్షాపరులై వర్తించు ప్రజలును కలరు.

సమస్త జనులకును తమకు ప్రార్థనయొక్క సాయ మగత్యమగునది కాదు; దాని యగత్యమును గమనించువారు స్వేచ్ఛగా దాని నవలంబించవచ్చును; అవసరమగువట్ల అవలంబించి తీరుదను కాదను. అంతమాత్రాన ప్రయోజనపు దృష్టితో ప్రార్థనయందు నిర్బంధముండుట సమంజస మనలేము. ఒక పురుషునియొక్క శారీరక మానసికాభివృద్ధికి నిర్బంధమగు శరీర వ్యాయామమును, విద్యాభ్యాసమును నవసరములు కావచ్చును. అయినను నైతికాభివృద్ధికి దేవునందు విశ్వాసము గాని, ప్రార్థనగాని యటు లవసరము కాదు. ప్రపంచమున వెలసిన అజ్ఞేయ వాదులలో మహాఘనులు కొంద అత్యంతము నీతిపరులుగ నుండియుండిరి. అటువంటివారికిని, నిజముగా మీ మొదటి వాదన ననుసరించి నమ్రతాప్రదర్శనము కొఱకు నిష్కామమగు ప్రార్థనను మీరు సిఫార్సు చేయుదురను కొందును. ఈ నమ్రత యనువిషయమును మీరు కొండంతలు

చేయుచున్నారు. శాస్త్రజ్ఞులలో మహాప్రవీణులు సైతము, కొన్ని సమయములందు నమ్రభావము ప్రకటింపవలసి వచ్చునంతటి మహోన్నతమైనదిగా విజ్ఞానము పెరుగుచున్నది. అయినను వారి శోధన కేవలము పరిశోధనగానే యున్నది. మరియు ప్రకృతిమీద వారు సాధించిన విజయము కొంత ఘనములుగ నున్నను, తమ శక్తి సామర్థ్యములందు వారి విశ్వాసము కూడ కొంత ఘనముగనే యుండెను. అటుల జరిగి యుండని యెడల ఈ నాడుగూడ దుంపలకై దేవులాడుకొనుచు మన వేళ్ళతో నేలను గీరుకొనుచుండవలసిన యవస్థలోనే పడి యుండెడివారము. ఇంతేల, మనము భూమిమీద నిలువజాలక తుడిచిపెట్టుకొని పోయెడివారమే. నరజీవులు చలిచే చచ్చుచుండిన హిమయుగమున పరిశోధనల సాగించి నిప్పును ప్రప్రథమమున కనుగొనిన కాలమున మీవైఖరికి ప్రతినిధిగా నాకాలమున నున్న పురుషుడు "నీ ఈ పన్నుగడలవలని లాభమేమి ? భగవంతునియొక్క శక్తిని ఆగ్రహమును మీరు మీపూనికలేమి చేయగలవు" ? అనుచు ఆనాటి పరిశోధకుని పరిహాసము చేసియుండును. వినయశీలురకు ముందెన్నడో దేవరాజ్యము వచ్చునని వాగ్దానము చేయబడుచున్నది. వారి కట్టిది లభించునో లేదో మనకు తెలియదుగాని, యిప్పుడు భూలోకమున మాత్రము వారిగతి హానిసతనమే. ప్రధాన విషయమునకు మరలుదము. "నమ్మకము ప్రధానము. స్థిరవిశ్వాస మదే వచ్చును." అనెడు మీ ప్రవచనమునందు గొప్ప సత్య

మున్నది. ఘోరమగు సత్యమే యున్నది. ప్రపంచములోని మత సంబంధమగు మూర్ఖావేశములో చాలభాగము, ఈ విధమగు బోధకు ప్రత్యక్షఫలముగా తెలియదగి యున్నది. వీలగునంత చిన్నవారినిగాచూచి పట్టుకొని పదేపదే చాలకాలముగ, చెవులలో నూరిపోయుచుంటిరేని, మానవజీవులలో మిగుల నధికసంఖ్యాకులు దేనియందైనను విశ్వాసము పూనునటుల మీరు చేయగలరు. ఆ తీరుననేకదా, మీపూర్వాచారపరాయణుడగు హిందువుని, మూర్ఖావేశుడగు మహమ్మదీయుని మీరు తయారు చేసియుంటిరి. ఈ రెండుజాతులలోను గూడ తమ నెత్తిపైని బలాత్కారముగా పడవేసి రుద్దబడిన విశ్వాసములను తప్పించుకొని బ్రతుకగల కొందఱు, అల్పసంఖ్యాకులే కానిందు తప్పక సదా యుండనే యుందురు. ఈ హిందువులును, ముసల్మానులును యుక్తవయస్సు వచ్చువఱకు తమ మతగ్రంథములను చదువుట మానుదురేని, వానియందలి హఠవాదములయెడ విశ్వాసము పూని దురావేశపరులు కాకుండెడివారనియు, మఱియు ఆ మూర్ఖవిశ్వాసముల కొఱకైన పోరాటముల దలపెట్టక యుండెడివారనియు మీకు తెలియును. హిందూ ముసల్మానుల దొమ్ములాటలకు, ఆదిఘాతిక విద్యయే తగిన మందై యున్నది; కాని మీరట్టితత్వము గలవారుకారు. గావున, ఈ పరిహారమును మీ రామోదింపనొల్లరు. భయభీతులతో ప్రజలు సర్వత్ర యణగారియున్న ఈ దేశములో ధైర్యము, కార్యశూరత, త్యాగము ననువానిం

గూర్చి మెన్నడు కని విని యెఱుగని రీతిని మహోన్నతాదర్శ మును నెలకొలిపినందులకై మీయెడ మేమెంతయో ఋణ పడియున్నమాట నిజమే. కాని మీ జీవన విధానమును గుఱించి తుది తీర్పు చెప్పబడు కాలమున, ఈ దేశమందలి బుద్ధివికాసము, మీ పలుకుబడివలన చాల వెనుకకు నెట్టి వేయబడినదనియే తీర్మానింపబడును సుడీ !

స:—ఇరువదేండ్ల వయసుపిల్లవానిని 'బాలుడ'న చెల్ల నిచో, ప్రపంచము సామాన్యముగా గ్రహించు తెలుగున 'బాలుడ'న నర్థమేమో నాకు తెలియదు. ఇంతేల! బడికే 'పోవువారి నందఱిని వయస్సు విపక్షత లేకుండ 'బాలురు' 'బాలికలు' అనియే పిలుతురు. అయినను శంకాయుక్తుడయిన ఆ విద్యార్థి 'బాలుడ'న తగినను, 'పురుషు'డన తగినను నా వాదన యట్లే నిలిచియుండును. విద్యార్థి సైనికునివంటి వాడు. ఒక సైనికుడు నలుబదియేండ్లవాడునై యుండవచ్చును. అత డొక శిక్షణక్రింద చేరి యందు నిలచియుండ నిశ్చయించు కొనినపుడు ఆ శిక్షణ విషయములను గుఱించి వాదనకు దిగ తగదు. సైనికుడు తన సైనిక కూటములో నొకడుగా నుండక మానుకొనవచ్చును. మఱియు తనకు నియమించిన పనులను చేయుటకు గాని, చేయకపోవుటకుగాని తన యిష్టానుసారము నిర్ణయించుకొను నవకాశము అత డందు చేరు సమయమునందు మాత్రమే కలదు. అదేతీరున తానెంతటి బుద్ధిశాలియైనను

వయస్సుగల వారైనను యొక పాఠశాలయందో, కళాశాల యందో చేసి సమయమున నచ్చుటి శిక్షణమును నిరాకరించు నధికారమును విద్యార్థి వదలుకొనుచున్నాడు. ఈ సందర్భమున ఆ విద్యార్థియొక్క తెలివితేటలను లాఘవము చేయుటగాని నిరసనము చేయుటగాని లేనేలేదు. ఐచ్ఛికముగా శిక్షణమునకు లోబడుట వాని బుద్ధిపాటవమునకు సహాకారమే యగును. కాని ఈ విలేఖరి బుద్ధిపూర్వకముగా శబ్దముల దుర్భరపీడను తనమీద వేసికొని మోయుచున్నాడు. కర్తకు హితవు గానట్టి ప్రతి కర్మయందును అతడు నిర్బంధమును పసిపట్టుచున్నాడు. కాని నిర్బంధ మనేక రీతులుగా నుండును. స్వయముగా పెట్టుకొనిన నిర్బంధమును ఆత్మనిగ్రహామందుము. దానిని ప్రీతితో స్వీకరించి దాని యందను వృద్ధిగాంచ జూతుము. కాని మన ప్రాణమునైనను బలియిచ్చి తొలగించుకొనవలసిన నిర్బంధముకూడ కలదు. మనయిచ్ఛకు వ్యతిరేకముగాను, తఱచుగా మనను హీనపఱచు నుద్దేశ్యముతోడను పురుషులుగానో మఱియు వారియిష్టముచొప్పున బాలురుగానో కూడ మన గౌరవమును భంగపఱచుచు మన నెత్తిని రుద్దబడు నిర్బంధము అట్టిదగును. సాంఘిక నిరోధములు సామాన్యముగా క్షేమకరములే యగును. వానిని తిరస్కరించితిమా భంగపడుదుము. 'పొట్టపైని ప్రాకులాడుచు పొమ్మ' నెడు నుత్తరువులకు లోబడుట పౌరుషహీనమును, పిఱికితనము నగును. ప్రతిక్షణమును మన జీవితములో మన చుట్టును మూగి మనను

బానిసలఁజేసి వేయుటకు సిద్ధముగా నుండు దుర్వ్యసనము లనేకము. వానికి లోఁబడుట అంతకంటెను నీచమైనది.

మఱియు ఈ విశేషణిని గొలుసులతో బంధించి పట్టుకొనిన మఱొక మాటకలదు. 'వివేకవాదము' అను ఘనమగు శబ్దమే యది. మంచిది. నేను దాని నాతోడను హెచ్చుగానే పుచ్చుకొని యుంటిని. మన వివేకమునకుగల ప్రత్యేకపు పరిమితులను పాటింపవలసిన వాఁడనగు నంతగా నా యనుభవము నా గర్వమును అణచినది. అనుచిత స్థానమున నుంచిన పదార్థమును దేనినైనను మనము మలమందుము. అట్లనే దుష్ప్రయోగము చేసిన తర్కము వెఱ్ఱిలో చేరును. ఇచ్ఛాపూర్వకముగ 'సీజరుకు చెందువానిని సీజరున కర్పించినచో' సర్వమును క్షేమముగ నడచును. వివేకవాదు లనువారు అద్భుతవ్యక్తులు. వివేకవాదము సర్వశక్తివంతమని వక్కాణించునెడల నది ఘోర పెనుభూతముగా సిద్ధమగుచుండును. మన వివేక జ్ఞానమునకు సర్వసమర్థతను ఆరోపించుట కేవలమొక కొయ్యముక్కనో, రాతినో యదియే దేవతయనుచు పూజించుటతో తుల్యమగు ప్రతిమార్చనమే యగుచున్నది.

ప్రార్థనయొక్క ప్రయోజనమును తర్కసాహాయ్యమున నెవ్వరు ఎపుడు నిరూపించిరి ? దాని ప్రయోజనము సాధనయనంతరము అనుభూతికి వచ్చును. ప్రపంచమొసగు సాక్ష్యమట్లే యున్నది! కార్డినల్ న్యూమన్ మహాశయుడు తన

వివేకము నెన్నడును వదులుకొని యెఱుగడు. కాని "ఒక్క యడుగు నాకు చాలును" అని ఆయన నమ్రభావముతో గానము చేసినప్పుడు, ప్రార్థనకు శ్రేష్ఠతమ గౌరవమునే అంగీకరించినాడు. శ్రీ శంకరులవారు తార్కికులలో చక్రవర్తి. శ్రీ శంకరుని తర్కవాదమును మించిన దేదియు ప్రపంచ వాఙ్మయమున లేదన దగును. అయినను వారు ప్రార్థనకును, విశ్వాసమునకును ప్రథమస్థానము నంగీకరించుచున్నారు.

మన యెదుట సంభవించుచున్న క్షణభంగురములును, సంక్షోభకరములును నగు సంఘటనలపై నాధారపడి వేగిరపాటుతో విలేఖరి యొక సామాన్యసూత్రమును కూర్చుచున్నాడు. కాని ఈ పుడమిని ప్రతి విషయమును దుర్వినియోగమున కవకాశమిచ్చుచున్నది. అట్లగుట నరునికి సంబంధించిన ప్రతి విషయమున గూడ సాధారణ ప్రకృతి ధర్మముగా కాన్పించుచున్నది.

చరిత్రయందు గోచరించు మహాఘాతుక కార్యములలో కొన్నింటికి మతము బాధ్యత వహింప వలయు ననుట నిస్సందేహామే. కాని అది మతముయొక్క దోషము కాదు. నరునందలి దుర్దమ మగు పశుత్వముయొక్క దోష మన వలయును. తన పశురూప వారసత్వముయొక్క ప్రభావమును నరు డింకను వదలించుకొని యుండలేదు.

ఏ పనినిగాని యెన్నడును కేవలము విశ్వాసముపై నాధారపడక, తా నొనర్చు కార్యములలో ప్రతిదానిని తర్కము మీదనే ఆధారపడి చేసియుండిన యొక్క తార్కికు నైనను నే నెఱుగను. కాని తన సృష్టికర్తయందు పసివారింబోలి విశ్వాస ముంచుటచేత సాధారణముగు సక్రమ జీవితములను నడుపుచున్న కోట్లకొలది మానవజీవులను మన మెఱుగుదుము. అట్టి విశ్వాసమే యొక ప్రార్థన. ఎవని లేఖపై నాధారపడి నా వ్యాసమును వ్రాసితినో యా బాలుడును అట్టి విశాల మానవ సంఘమునకు చెందియున్నవాడే. మఱియు నా వ్యాసము ఆ బాలుని, వానితోడి సత్యాన్వేషకులను స్థిరమతుల గావించుకొఱకును, ప్రస్తుత విలేఖరివంటి తర్కవాదులయొక్క యానందమును భంగపఱుప కుండుటకును వ్రాయబడి యున్నది.

అయినను ప్రపంచ యువకసమితికి వారి పెద్దలును, గురువులునుచూపు మార్గమును గుఱించిగూడ ఆయన వివాదమునకు దిగుచున్నాడు. ఒకవేళ నటుల మార్గము చూపుటయు లోపేమైనచో భావగ్రహణ వయసున ననివార్యముగ ఘటిల్లు లోటుగా కాన్పించుచున్నది. కేవలము ఆదిభౌతిక విద్యనైతము యువక హృదయము నొకానొక తీరున తీర్చుటకగు ప్రయత్నమేగదా! శరీరమునకును, మనస్సునకును శిక్షణగఱపి యుక్తమార్గమున నడుపదగునని యంగీకరించుపాటియాదార్య

మును విలేఖరి చూపుచునే యున్నాడు. కాని ఆ శరీరమును, మనస్సును సంభవములుగా చేసిన యాత్మను గురించి వాని కేమియు విచారములేదు. ఒకవేళ దాని యునికిని గూర్చియే వానికి సందేహము కలదేమో; కాని వాని విశ్వాసరాహిత్యము వానికి ప్రయోజనకారి కాజాలదు. తన తార్కిక పర్యవసానమునుండి తానును తప్పించుకొన జాలడు. ఏలయన, ఈ విలేఖరియొక్క హేతువాదము నాధారము చేసికొనియే, విశ్వాసవాదియు తర్కమునకు పూని, తదితరులు తమ బాలుర యొక్కయు, బాలికల యొక్కయు శరీరమును, బుద్ధిని సవరింప బూనునట్టులనే, తానును తన బాల బాలికల యాత్మను సవరింపవలసి యున్నదని యేల వచింపరాదు ? మతబోధవలని యనర్థములు యథార్థ మతభావము యొక్క వికాసము కలుగగనే యంతరింపగలవు; మతబోధనే విడిచివేయుట, పొలమును సక్రమముగా దున్ని సేద్యముచేయు జ్ఞానము సేద్యగానికి కొఱవగుటచేత, భూమిని వ్యవసాయము చేయుట మాని కలుపు పెరుగనిచ్చు పోలిక నుండును. విలేఖరి పూనిన ప్రాచీనుల ఘనతర విజ్ఞానముయొక్క పరిపోషణ యిప్పటి విచారణాంశమునకు పూర్తిగా నప్రస్తుతమై యున్నది. వారి పరిశోధనా ఫలితముల యొక్క ప్రయోజనమును నేనుగాని, మఱెవరుగాని కాదనుట లేదు. ఆ పరిశోధనా ఫలితములు తర్కముయొక్క వినియోగమునకును, వ్యాయామమునకును సామాన్యముగా నుచితమగు క్షేత్రమై యొప్పును. కాని ఆ ప్రాచీనులు సైతము

విశ్వాసమునకును, ప్రార్థనకును సత్స్థానము తమ జీవితము లందు నిరాకరించి యుండలేము. విశ్వాసము, ప్రార్థనము లేనట్టి శాస్త్రములు గంధశూన్యములగు కృత్రిమ పుష్పముల వలె నుండును. నేను తర్కమును నణగద్రొక్కి వేయుమనుటలేదు. మనలోని తర్కమును దైవము పవిత్రీభూతము చేయునట్టి శక్తిని గుర్తించి దానిని గౌరవింపుమని మాత్రము మనవి చేయు చున్నాను.

## రెండింటి ద్వంద్వయుద్ధము

ఒక మిత్రు డిట్లు వ్రాయుచున్నాడు :- 'యంగ్ ఇండియా' పత్రిక యం దొక వ్యాసములో అహింసకును, పిరికితనమున కును పొత్తు కుదరదని నొక్కి చెప్పియున్నారు మీ వ్రాతలో సందిగ్ధముగా నున్న యొక్క యక్షరమైనను లేదు. కాని నరుని వర్తనమునుండి పిరికి తనమును పూర్తిగ నెట్లు తొల గింపదగునో తెలుపు డని మిమ్మర్థించుచున్నాను. అందఱి ప్రవర్తనలును వారు వారు కూర్చుకొనిన అలవాటుల మొత్తపు రాశియే యని నేను గుర్తించి యున్నాను. మనము పూర్వపు టలవాటులను రద్దుచేసికొని, సాహసము, బుద్ధి కుశలత, కార్యశూరత మున్నగు క్రొత్తవానిని కూర్చుకొను టెట్లు ? ప్రాత యలవాటులను ఛేదించివేసి, పురుషునిలో నూత్న ప్రవర్తన ప్రభవించుకొఱకు శ్రేష్ఠతరములును, ఘన తరములును నగు నభ్యాసములను నిర్మాణము చేయదగునని

నేనొప్పుకొందును. పురుషునకు ద్విజత్వము నొసగు శిక్షణము, ప్రార్థనలు, అధ్యయనములు మీకు తెలియు నని నా యభిప్రాయము. వానిం గుఱించి దయచేసి మాకు తెలుపుదురు గాక. 'యంగ్ యిండియా' సంచికలలో నొకదాని ద్వారా మీ విజ్ఞానమును, మీ సలహాను మా కొసగుడు. దేని సాహాయ్యమున నరుడు ద్విజుడు కాగలుగునో యట్టి ప్రార్థనమును, జీవన చర్యల యొక్క విధానమును వివరింపుచు దయతో మాకు తోడ్పడుడు.

స:— ఇతిహాస మను నెపముతో మహాభారతమునందు ప్రస్ఫుటముగా వర్ణింపబడి నట్టియు, కోట్లకొలది హృదయసీమలం దనుదినము జరుగు చుండునట్టియు, తెంపులేని ద్వంద్వ యుద్ధమునకు సంబంధించినది ఈ సమస్య. ప్రాతయుల వాటులను జయించి, తనలోని యధర్మము నడంచివేసి ధర్మము నన్నపీఠమున తిరిగి ప్రతిష్ఠచేయుట నరుని విధ్యుక్త కార్యమైయున్నది. ఈ విజయమును సాధించుట యెట్లో మతము మనకు బోధించని యెడల, అది మన కేమియు బోధించనట్లే; అయినను, యథార్థముగా మన జీవితములో సాహసకార్యమనదగు ఈ విషయమున విజయము నొందుటకు రాజమార్గ మేమియు లేదు. మనను బాధించు నధర్మ వృత్తుల లోనికెల్ల పిఱికితనము మిక్కిలి గొప్పదన వచ్చును. సామాన్యముగా దౌర్జన్య మని చెప్పుకొను రక్తపాతము

మున్నగు చర్యలకంటె నది మిక్కిలి ఘోరతర మైనదనుట నిశ్చయము. ఏమన : భగవంతునియందు మనకు విశ్వాసము లేకపోవుటవలనను, భగవంతుని కళ్యాణగుణములను మన మెఱుగక పోవుటచేతను పిఱికితనము తలజూపుచున్నది. పిఱికితనమును, అట్టి యితర దోషములను తొలగించి వేయుటకై, విశేషించి నన్ను తెలుపుమని కోరిన విజ్ఞానమును, సలహాను నొసగు సమర్థత నాకడ లేనందుకు నేను విచారపడుచున్నాను. అయినను నా యనుభవసాక్ష్యమును తెలుపగలను. పిఱికితనమును నింక నితరములగు ప్రాత చెడ్డ యలవాట్లను నిర్జించుటకు నరునికిగల మహాశక్తివంతమగు నాయుధము నిక్కముగా హృదయ పూర్వకమగు ప్రార్థనమే నని చెప్పగలను. మన అభ్యంతరమున భగవంతుడు కలడనెడు సజీవ విశ్వాసము లేనిది, ప్రార్థన దుస్సాధ్యమగును. దేవునికిని, సైతానునకును బహిరంగమున గాక ఆంతర్యమున జరుగు ద్వంద్వ యుద్ధమని క్రైస్తవ మతమును, ఇస్లాంమతమును దాని నభివర్ణించుచున్నవి. జొరాష్ట్రమతము దానిని 'అహూార్ మజదు' 'అహ్రిమాను'ల మధ్య జరుగు పోరాట మనును. హిందూమతము దానిని శిష్ట శక్తులకును, దుష్ట శక్తులకును నడుమ జరుగు ద్వంద్వయుద్ధముగా పేర్కొనుచున్నది. మనము దుష్ట శక్తుల పక్షమున చేరుదుమో, లేక శిష్ట శక్తుల పక్షమున చేరుదుమో నిర్ణయము చేసికొనవలసి యున్నాము. భగవత్ప్రార్థన మనగా తిమిరరాక్షసి బారినుండి నరుడు

విభవల పొందుకొనుటకు నారాయణునితో కూర్చుకొను పవిత్ర మైత్రికన్న వేఱుకాదు. కాని, హృదయపూర్వక ప్రార్థనమనగా పెదవులతో చేయు నుచ్చారణ గాదు. ప్రార్థన మన అంతరంగమునుండి వచ్చును. ప్రతి మాటయందును, ప్రతి చేతయందును, చింతేల నసుని ప్రతి సంకల్పమునందును ప్రకటితమగునట్టి యావేదనయే. ఏదేని దుష్టసంకల్పము సాహసించి నరుని తాకగలుగునెడల అతడు పెదవులతో మాత్రమే ప్రార్థన చేయువాడని గ్రహింపవలయును. అదే రీతిని వాని పెదవులదాటి వచ్చిన దుష్టశబ్దము సందర్భమునను, వానిచే చేయబడిన దుష్కార్య సందర్భమునను గూడ గ్రహింప వలయును. సత్యమగు ప్రార్థన యీ త్రివిధదోషములనుండి నిస్సందేహముగా కాపాడగల 'డాలు' వంటిది సుడీ! అటువంటి యథార్థమును సచేతనము నగు ప్రార్థన విషయములోగూడ ప్రథమ ప్రయత్నమునందే సదా విజయము చేకూడ జాలము. మనము మనతోడనే పెనుగులాడవలసి వచ్చును; మన ఇచ్ఛకు వ్యతిరేకముగా విశ్వాసము కుదుర్చుకొనవలసిన వారముగుదుము. ప్రార్థనా మహిమను తెలియ గోరుదుమేని, పరిమితిలేని యోర్పు నలవఱచుకొనవలసి యుండును. అంధకారము చుట్టు క్రమ్మవచ్చును. ఆశాభంగము వెంటాడ వచ్చును. ఇంతకు మించిన కష్టములే పైబడవచ్చును. అయినను వీని నన్నిటితో యుద్ధము చేయుచు, పిఱికితనమునకు లోబడక నిలుచునంతటి స్థైర్యము మన కుండవలయును. ప్రార్థనా

కనుడగు నను వెనుదిరిగి పారిపోవుట యనునది లేదు. నే నిప్పుడు చెప్పునది అభూతకల్పనా కథనము కాదు. ఊహామాత్ర చిత్రపటమును నేను రచించుటలేదు. ఉద్యమములు చేయుచు పారిపోవుటలో కలిగిన అవరోధముల నన్నిటిని ప్రార్థన మూలమున జయించజాలిన మహాపురుషుల సాక్ష్యమును ప్రోవుచేసి చెప్పుచున్నారు. అభిన్నమై, యేకమై నాకుదోచు ప్రార్థనమును, విశ్వాసమునకును నే నెంత ఋణపడియుంటినో నా జీవితము గడచినకొలదిని నధికాధికముగా గ్రహించుచుంటి నను నా సాక్ష్యమునుగూడ నవినయముగా అందు చేర్చుచున్నాను. కొలది గంటలని గాని, దినములని గాని, వారములని గాని పరిమితియే లేక, మొదతెగక దాదాపు నలుబది సంవత్సరముల కాలమునకు మించిన వ్యాప్తిగల నా యనుభవమును తెలుపుచున్నాను. నాకంతటికు వచ్చిన ఆశాభంగములను, గాఢాంధకారములను, నిరాశా మహోత్కిరణలను, భీతిగొలుపు మందలింపులను, సూక్ష్మతమమగు నభిమానపు దాడులను అనుభవించియున్నాను. అయిననుగూడ నావిశ్వాసము చాలస్వల్పమే యనియు, నే నాకాంక్షించునంతటి గొప్పది కానే కాదనియు నే నెఱిగియున్నాను. ఈనాటి నావిశ్వాసమే యీనాటి వఱకు నాపైబడిన ప్రతి కష్టమును నెదిర్చి తుదకు జయమునుసాధింపగల్గెనని నేను చెప్పగలుగు చున్నాను. మనలో విశ్వాసమే యుండిన యెడల, ప్రార్థనాపూరిత మగు హృదయము మనకున్న యెడల, మనము భగవంతుని పరిశోధింప నక్కఱలేదు;

వానితో పరతుల నిర్ణయించుకొను నగత్యముండదు. మనము శూన్యమంతగా తగ్గిపోవలయును. ' బరోదా ' గారు చనిపోవుటకు కొంచెము ముందు నా కొక యమూల్యమగు సంస్కృత శ్లోకమును వ్రాసి పంపియున్నారు. ' భక్తిపరుడగు నరుడు తనను శూన్యముగా మార్చివేసికొనున 'ని దాని భావార్థము. మనము అణువుకంటెను అల్పులమై పోయిననేగాని, మనలోని యధర్మమును లేక దుష్టత్వమును మనము జయింపజాలము. సత్యముగ ఏకైకమును, యథార్థము నగు ముక్తికి తగిన విలువగా, తనకు సంపూర్ణముగా వశమై లొంగుటకంటె నితరమును దేనినిగాని భగవంతు డంగీకరింపడు. ఇటుల నరుడు రూపుదొరగినప్పుడు తక్షణమే తాను సర్వజీవుల సేవయందు మునిగినవానిగా గ్రహించును. అది వాని కానందమును, వినోదమును గొలుపును. భగవంతుని సృష్టికి తా నర్పించు సేవలో శ్రమచేయుటను గురించి యెన్నడును నలసట నెఱుగజాలని నూతన పురుషుడై యొప్పును.

## ప్రార్థన మన నెట్టిది ?

ఒక వైద్యపట్టభద్రు డిట్లు వ్రాయుచున్నాడు:— " ప్రార్థన యొక్క యుత్తమ స్వరూప మెద్ది? అందెంత సమయము గడపవలయును ? నా యభిప్రాయములో న్యాయవర్తనము ప్రార్థన యొక్క శ్రేష్టస్వరూపమని తేలుచున్నది. నిష్కపటముగా నెల్లరియెడల న్యాయముగా వర్తించు నతనికి వేఱుగ ప్రార్థన

ముతో నగత్య ముండదు. కొందఱు మానవులు సంధ్యాలు వార్చుటలో చాల సమయము వ్యయ పఱతురు. కాని వారిలో నూటికి తొంబదియయిదు వంతున తాము పఠించు మంత్రముల యర్థమును గ్రహించుట లేదు. నా యభిప్రాయములో ప్రార్థన స్వంత మాతృభాషలో చేయవలసియున్నది. అప్పుడు మాత్రమే యాత్మకది మిక్కిలి ప్రయోజనకరముగ నుండును. నిర్మలమగు ప్రార్థన నొక్క నిమిషము చేసినచాలు నని నే నందును. పాపము చేయనని భగవంతునికి వాగ్దానము చేసిన సరిపోవును. ”

స:-ప్రార్థన మనగా భక్తిభావముతో దేనికొఱకేని భగవంతుని వేడికొనుట యని యర్థము. అయినను భక్తిపూర్వకమగు ఏకార్యము నైనను తెల్పుటకు సైతము ప్రార్థన మను మాట ఉపయోగపడును. ఈ విలేఖరి మనస్సులోనున్న భావమును బాగుగా తెలుపుటకు ‘ అర్చనము ’ అను పదమును ప్రయోగించుట లెస్స. నిర్వచనముల నటుంచుదు. లక్షలాది హిందువులును, ముసల్మానులును, క్రైస్తవులును, యూదులును, నింక నితరులును సృష్టికర్తయొక్క యారాధన నిమిత్తము అనుదినము ప్రత్యేకింపబడిన సమయములం దేమిచేయుచున్నారు? సృష్టికర్తతోడి యైక్యానుభూతికొఱకు హృదయావేదన చెందుటో, లేక వాని యాశీర్వాదము కొఱకు వేడుకొనుటో యని నాకు తోచుచున్నది. ఈ సందర్భమున మన

మనోవైఖరియే ప్రధానము గాని, మన ముచ్చారణ చేయు నట్టియు లేక గొనుగునట్టియు శబ్దములు ప్రధానములు కావు. ప్రాచీన కాలమునుండి పరంపరగా వచ్చుశబ్దములతోడి పరిచయమునకుండు ప్రభావము, వానిని మన మాతృభాషలోనికి అనువాదము చేసినపుడు పూర్తిగ నష్టమగుచున్నది. ఉదాహరణకు గాయత్రీ మంత్రమును గుజరాతి భాషలోనికి అనువదించి పఠించినయెడల మూలమంత్రమందు గల ప్రభావము చూపట్టదు. "రామ" యను శబ్దోచ్చారణ లక్షలాది హిందువుల యందు తక్షణమే తన మహిమను చూపును. 'దేవుడ'ను మాట యొక్క అర్థము వారికి తెలిసినను వారియందు దాని ప్రభావ మంతగా గోచరించదు. ఇంతకు, శబ్దములు చిరకాల వినియోగము వలనను, వాని వినియోగమున కారోపింపబడు మహిమ వలనను, ఆ శబ్దములకు ప్రభావము చేకూరుచున్నది. కాబట్టి విశేషముగా వాడుకలోనున్న మంత్రములకును, శ్లోకములకును ప్రాచీన సంస్కృత భాషాస్వరూపమునే నిలుపుట వలని ప్రయోజనమును గురించి యెంతయో చెప్పవచ్చును. వాని అర్థమును మాత్రము సక్రమముగా తెలిసికొన వలయు ననుట నిర్వివాదము.

ఇక భక్తిచర్య లెంతెంత కాలము జరుగవలయు ననుటను గురించి యొక నిర్ణీత సూత్రముండజాలదు. అది వారి వారి చిత్తవృత్తి ననుసరించి యుండును. నరుని అనుదిన జీవితమున

నిట్టి క్షణములు వెలలేని మూలులు అనవలయును. ఈ సాధనములు మన యాటోపముల నణంచి, నమ్రశీలురజేసి, యీశ్వరేచ్ఛ లేని దేమియు జరుగ జాలదనియును, మనము కుమ్మరి చేతి యుండలి మృత్తికవంటివార మనియును గ్రహించునటుల చేయుటకై యుద్దేశింపబడి యున్నవి. నరుడు తన సన్నిహిత భూతకాల చర్యను విమర్శించుకొని తన లోటుపాట్ల నొప్పుకొని క్షమాపణకోరుచు, నికముందు యోగ్యతరుడై వర్తించుటకు దగిన బలమును ప్రసాదింపు మని దేవుని వేడుకొను క్షణములని కొందఱిపట్ల నొక్క క్షణము సరిపోవును. ఇతరుల యెడ నిరువదినాలుగు గంటలును చాలకనే పోవచ్చును. తమ యందధివసించి భగవంతు డున్నాడను జ్ఞప్తితో నిండిన వారికి, కర్మ చేయుటయే ప్రార్థించుట యగును. వారి జీవిత మే యొక నిరంతర ప్రార్థనము, లేక యారాధన కర్మ యగును. పాపాచరణమున నె మెలగుచు, భోగాసక్తులై తమకొఱకే బ్రతుకు నితరుల సందర్భములో నెంతకాలమైనను చాలదు. వారికి ఓర్పు కలిగి, పవిత్రులగుట కిచ్ఛయు, శ్రద్ధయు గలిగెనేని, తమయందు భగవంతు డధివసించుచు తమను పవిత్రవంతుల చేయుచున్నట్లు నిస్సందేహముగా తా మనుభూతి చేయువరకును వారు ప్రార్థనల సాగింతురు. పూర్తిగ భిన్నములగు ఈ రెండు మార్గములను మధ్యగా మావంటి సామాన్యమానవుల పంథాయుండును. మా చర్యలన్నియు భగవదర్పిత కార్యములే నని చెప్పుకొన గలంత యున్నతులము మేము

కాము; మఱియు కేవలము తుచ్ఛస్వార్థము కొఱకే జీవించు నంతటి దైవద్రోహులమును కాకపోవచ్చును. కాబట్టియే సమస్త మతములును సామాన్య భక్తిచర్యల కొఱకు కాల నియామకము చేసియున్నవి. దురదృష్టవశమున నేడవి కేవలము మిథ్యాచారములై పోక, నిలిచినపట్ల జడయంత్ర కర్మలుగను, పేరునకు మాత్రము చేయ బడునవిగను మారి పోయినవి. కాబట్టి యీ భక్తి చర్యలకు సక్రమమగు చిత్తవృత్తి ననుసంధానము చేయుటయే జరుగవలసిన పని.

దేనికొఱకైనను భగవంతుని వేడికొన నర్థమును వ్యక్తి పరమగు ప్రత్యేక ప్రార్థనలు మట్టుకు తప్పక స్వాంతభావలోనే యుండవలయును. సచేతనమగు దేనియెడలనైనను న్యాయముగ ప్రవర్తింపజేయునటుల భగవంతుని వేడుకొనుటకంటె ఘనతరమగు ప్రార్థన మేదియు నుండబోదు.

మన నిస్సహాయతను గుర్తించి సర్వమును విడిచి భగవంతుని మీదనే తుదిని నాధారపడవలసిన వారమని తెలిసికొనుటయొక్క ఫలితార్థమే ప్రార్థన.

బహిరంగముగా చేయబడునే చర్యకంటెను, మౌనముగా చేయబడు ప్రార్థన తఱచుగా మహిమాఢ్యమై యొప్పునని నా నమ్మకము. పవిత్రహృదయమునుండి వచ్చు ప్రార్థన మెన్నడును విఫలమైపోదను విశ్వాసముతో నా నిస్సహాయ స్థితి యందు నేను సదా ప్రార్థనల చేయుచుందును. నా కలవడు

యావచ్ఛక్తితో, నంగీకృతము కాగల ప్రార్థనకు నేను తగిన పవిత్ర సాధనమగుటకు ప్రయత్నించుచున్నాను.

ద్రౌపది తన యేవురు భర్తలును రక్షింపజాలరని కనుగొని నిస్సహాయులయెడ నేకైక రక్షకుడై వెలయు శ్రీకృష్ణుని గుఱించి యార్తితో మొఱబెట్టినది. శ్రీకృష్ణు డామె ప్రార్థన నాలకించినాడు. అదే రీతిని నే నీనాడు శ్రమ పడుచు భారత దేశమున వసించు నోరులేని కోట్లకొలది జనముపేరిట మొఱ లిడుచున్నాను. యేదో యొకనాడు నా ప్రార్థన లాలకింపబడు ననుట నాకు నిశ్చయమే,

## ప్రార్థనయే నా జీవనౌషధము

ప్రార్థనయొక్క యర్థమును, అవసరమును గూర్చి నన్ను మాట్లాడుమని మీరందరు కోరినందుకు సంతోషము. ప్రార్థన యనునది మతధర్మమునందు సారభూతమైనదానికెల్ల ముఖ్యా ధారముగ నున్నదని నా నమ్మకము. కాబట్టి ప్రార్థన మానవ జీవితమునకు మూలాధారమై పఱగును. ఏలయన : మతము లేకుండ నరుడు బ్రతుకజాలడు. తర్కవాదుల మను నహం కారముతో 'మాకు మతముతో జోక్య మేమియు లేద'ని పలుకువారు కొందరుందురు. కాని వా రటులనుట 'నే నూపిరి పీల్చుచున్నానుగాని నాకు ముక్కులే'దని చెప్పినట్లుండును. వివేకమువలననో, సహజబుద్ధి వలననో, మూఢవిశ్వాసము వలననో నరుడు దైవముతో తన కేదో విధమగు సంబంధము

కలగదని యొప్పుకొనుచునే యున్నాడు. అజ్ఞేయవాదుల లోను, నాస్తికులలోను తీవ్రావేశపరులు సయితమే దేని నీతిసూత్రముయొక్క అవసరము నంగీకరింపుచు, దాని యాచరణవలన గలుగు మేలును, దానిని భంగపఱచుట వలన గలుగు కీడును, ప్రతిపాదించుచునే యున్నారు. సుప్రసిద్ధ నాస్తికవాది యగు బ్రాడ్లాగారు తన హృద్గత నిశ్చితాభిప్రాయమును సదా పట్టుదలతో నిరాఘాటముగా ప్రకటించేవారు. అటుల సత్యము పలికినందులకై ఆయన చాలకష్టముల పాలు గావలసి వచ్చెడిది. అయినను అందుంగూర్చి మహానందము చెందుచు, 'సత్యమునకు సత్యమే బహుమానము'ని జెప్పెడివారు. సత్యానుసరణము వలని సంతోషము నాయన మెఱుగడని చెప్పనలను పడదు. ఆ యానందము ఐహిక సంబంధమగున దెంతమాత్రము కాదు. ఆ ఆనందము దైవముతోడి సంసర్గమువలన ప్రభవించునదై యున్నది. ఆ కారణము చేతనే మతమనిన తిరస్కారముచేయు నవుడు నైతము మత దూరుడై బ్రతుకుట లేదని నేను చెప్పుచున్నాను. ప్రార్థనము మతమునకు మిక్కిలి ప్రధానాంశమై పఱగునటులనే, మానవుని సామాన్య జీవితము నందును ప్రధానాంశమై యొప్పుచున్నది.

తరువాతి విషయమునకు వత్తము: ప్రార్థన విన్నపము రూపమున గాని, లేక వ్యాపకార్థమందు, ఆంతరంగిక సంసర్గ రూపమునగాని వెలయును. ఈ రెండు తీరులందును తుదిఫల మొక్కటియే. విన్నపము రూపమున గూడ ప్రార్థన హృద

యముయొక్క నిర్మలత్వముకొఱకును, పవిత్రతకొఱకును హృదయము నావరించియున్న అజ్ఞానాంధకారము యొక్క పొఱలను తొలగించు నిమిత్తమునై యుండవలయును. కాబట్టి తనలోని దివ్యాంశమును మేల్కొన చేయుటకై యాతుర పడువాడు ప్రార్థనపై నాధారపడవలసి యుండును. కాని ప్రార్థన యనగా ఊరక మాటలయాలాపనము గాని, చెవుల వ్యాయామము గాని కాదు: పదేపదే వల్లెవేయు నర్థహీన మగు పదజాలమునుకాదు. హృదయమునందు పరివర్తనము చేకూర్ప జాలదేని, యెంతెంతగ రామనామ జపము చేసినను లాభ ముండదు. ప్రార్థన సందర్భములో హృదయ పూర్వక ములుగాని మాటలకంటె, మాటల సంబంధములేని హృద యముయొక్క కలిమియే శ్రేయస్కరము. పరివర్తన కొఱకై ఆవేదనపడు హృదయమునకు అనుసరణముగా ప్రార్థనజరుగ వలయును. బాగుగ నాకలిగొన్న మనుజునకు భోజనము చక్కగ రుచించునటుల, ఆవేదనగల హృదయమునకు మన సారచేయు ప్రార్థనము రుచించును. ప్రార్థనయొక్క చమత్కా రము ననుభవించిన మనుజునకు దినములకొలది మనన నిది ధ్యాసముల కవకాశము చిక్కకున్నను బాధ యుండదు. కాని ప్రార్థన లేకుండ నొక్క క్షణకాలమేని గడపరాదని నేను చెప్పునపుడు నాయొక్కయు, నా సహచరుల యొక్కయు యనుభవమునే యొకింత మీకు తెలుపుచున్నాను. ఏమన: ప్రార్థన లేనిది ఆంతరంగిక శాంతి యుండదు.

'అటులగునేని, మన జీవితములందు ప్రతినిమిషము మనము ప్రార్థనలు చేయుచునే యుండవలసి వచ్చునే' యని యెవ రైన ననవచ్చును. అందుకు సందేహమే లేదు. ఒక్క క్షణ కాలముకూడా ఆంతరంగిక ధ్యానము కొఱకై మే మంత స్సుఖులమై నిలుచుట కష్టముగ నెంచుచు తడబడు మనుజ మాత్రులమగు మన భగవంతునితోడి యెడతెగని సంసర్గ మ్మూని విలిచియుండుట దుస్సాధ్యముగ కాన్పించును. కాబట్టి ప్రాపంచిక పరితాపములను నొక క్షణము తొలగించు కొను టకు తీవ్రప్రయత్నము సాగించుటకై కొన్ని సమయములను మే మేర్పాటు చేసికొని, మాంసమయ శరీరమును విడిచి యొకింత నిలుచుటకో యన మేము గట్టి ప్రయత్నము చేయు చున్నాము. మీరు సూరదాసు కీర్తనను వినియున్నారు. దాని యర్థమిది; 'నావంటి దుష్టుడును, అసహ్యకరుడును, నీచుడు నింకెక్కడగలడు? నేను నా విధాతకు దూరుడనై పోతిని. నే నెంతయో విశ్వాసఘాతకుడనై పోతిని.'

ఈ కీర్తన భగవంతునితోడి నిత్యైక్యానుభూతికై గాఢ పరితాపము చెందు హృదయమునుండి వచ్చు దీనాలాపము. మన పరిగణన ననుసరించి సూరదాసు డొక మహాత్ముడే. కాని తన స్వీయమగు పరిగణనయందు మహాపాతకియే. పార మార్థికముగా సూరదాసు మన తలదాటి యెన్నియో మైళ్ళ దూరమున నున్నాడు. అట్లయ్యును నిరాశతో నాత్మనిరసనము

చేసికొనుచు తీవ్రావేదన పూరితమగు మొఱలుపెట్టు నంతటి గాఢముగ భగవంతునినుండి తన యెడబాటు నోర్వలేకుండెను. నేను ప్రార్థనావశ్యకతను గుఱించి మాట్లాడియున్నాను. తద్వారా ప్రార్థనయందలి ప్రధానాంశమును గుఱించియు తెలిపియున్నాను. మనము మన తోడిమానవులను సేవించుకొఱకై పుట్టియున్నాము. మనము కడు జాగరూకులమై మెలగినగాని యీ సేవను సక్రమముగా చేయజాలము. మానవుని హృదయములో, తిమిరశక్తులకును, ప్రకాశశక్తులకును మధ్య సదా యెడ తెగని పోరాటము జరుగుచుండును. ప్రార్థనమనెడు కవచముయొక్క రక్షణ లేనివాడు తిమిరశక్తులచే హతుడయి పోవును. ప్రార్థనాపరుడగు నరుడు తనలో తాను శాంతి ననుభవించుచు ప్రపంచమంతటితోడను సమాధానము కలిగి యుండును. ప్రార్థనాపూరితమగు హృదయము లేకుండ లోక వ్యవహారములందు సంచరించెడు పురుషుడు తాను దుఃఖముల పాలగుచు లోకమునుగూడ దుఃఖములపాలు చేయును. మరణానంతరము మానవుని దశకు సంబంధించిన ప్రసక్తి యటులుండగా, నతడు జీవించు నీ లోకములోనే నరునికి ప్రార్థన మనేక విధముల ప్రయోజనకారిగ నుండును. మన యను దిన చర్యలందు క్రమపద్ధతి, శాంతి, సమాధానము చేకూర్చుకొనుటకు ప్రార్థనయే యేకైకసాధన మగుచున్నది. ఈ యాశ్రమవాసులమగు మేము సత్యాన్వేషకులమై యిచ్చటికి చేరి, సత్యదీక్ష యమరుకొఱకు ప్రార్థనయొక్క సార్థకత్వ

మును సమ్మకొనునట్లు ప్రకటించుచున్నాము. కాని ఇటీవలి వఱకును దానిని ప్రాణాధారవిషయముగ నేను పాటించి యుండనైతిని. ఇతర విషయములందు నేను చూపునంతటి శ్రద్ధ నీ విషయమున చూపియుండలేదు. ఒక దినమున నా కునుకుపాట్లనుండి మెలకువగాంచి ఈ విషయమున నా విధిని నే నుపేక్షించి యుండు టెంతయు విచారకరమని గ్రహించి తిని. అందువలన క్రమశిక్షణకై కఠిన నియమములను నిర్ణయించితిని. అందువలన మే మేమియు చెడిపోక లాభమునే పొందితి మని నా నమ్మకము. ఆ సంగతి విస్పష్టముగా నే గోచరించుచున్నది. ప్రాణతుల్యములగు ప్రధానాంశముల గుఱించి శ్రద్ధ తీసికొనుచో నితర విషయములు తమంతట తామే కుదుటపడును. చదరముయొక్క ఒకకోణము సరిచేసిన యెడల తక్కిన మూలలు తమంతట తామే సవరణమై పోవును.

అందువలన మీ దినచర్యను ప్రార్థనతో ప్రారంభము చేయుచు, సాయంతనము వఱకు నది మీ వెంట నంటి యుండు నంతటి మనఃపూర్వకముగ ప్రార్థనచేయుడు. రాత్రియందు కలలుగాని, కలవరింతలు గాని లేకుండ ప్రశాంతముగ నిద్రా కాలము గడుచునటుల మఱల ప్రార్థనతోడనే మీ దినచర్యను ముగింపుడు. ప్రార్థనా స్వరూపమును గుఱించి విచారము పెట్టుకొనకుడు. దానిస్వరూప మెట్టిదైన కానిండు. అది మనకు భగవంతుని తోడి సంసర్గము చేకూర్చునదిగా నుండిన

చాలును. ప్రార్థనాస్వరూప మెట్టిదైనను, ఆ ప్రార్థనలోని మాటలు నోటిలోనుండి వెలువడుచుండ, భావమునుమాత్ర మిటు నటు పోనీయక నిలుపుడు.

[విద్యార్థి వసతి గృహ వాసులలో, ప్రార్థననుగూర్చి భిన్నాభిప్రాయులై యున్నవారి నుద్దేశించి] నేనిప్పుడు చెప్పి నది మీ హృదయములయందు గాఢముగా నాటినయెడల, మీ విద్యార్థి వసతి గృహాధికారులు ప్రార్థన విషయములో శ్రద్ధతీసికొని, దాని నిర్బంధక్రియగా నిర్ణయించు బలాత్కార పఱచు వఱకు మీకు శాంతి యుండదు. స్వయముగ పెట్టు కొనిన నిగ్రహమును నిర్బంధ మన చెల్లదు. నిగ్రహము లేని స్వేచ్ఛావర్తనమును, అనగా చాపల్యమును కోరుకొను పురుషుడు వ్యసనములకు దాసుడై పోవును. మఱియు నియమ నిష్టలచేత తనను బంధించుకొను పురుషుడు ముక్తుడగును. ఈ జగత్తులో సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు సహా సర్వమును కొన్ని నియమములకు లోబడి వర్తించుచున్నవి. ఈ నియమముల నిగ్రహమే లేనియెడల ప్రపంచ మొక్క క్షణమైనను నిలువజాలదు. తోడి మానవుల సేవయే జీవితో ద్దేశ్యముగా పెట్టుకొనిన మీరేదో యొక విధమగు క్రమ శిక్షణమును పైన పెట్టుకొనరేని, మీరు భిన్నాభిన్నమై పోగలరు. ప్రార్థనము మీకవసరమగు పారమార్థిక శిక్షణ ముగా నుండును. మనను మృగములనుండి వేఱుచేయు

నవి క్రమ శిక్షణమును నిగ్రహమునై యున్నవి. మనము తల నెత్తికొని నిటారుగా నడచు మనుష్యులము కాగోరుదు మేని, నాలుగు కాళ్ళమీద నడచుట కోరుకొన మేని, ఇచ్ఛాపూర్వక మగు క్రమశిక్షణమును, నిగ్రహమును చక్కగ గ్రహించి, వానికి వశులమై వర్తింతుము గాక!

## ప్రార్థనను గురించిన స్వానుభవ సాక్ష్యము

ప్రార్థనము నా జీవరక్షగా నున్నది. అది లేనియెడల చిర కాలము క్రిందటనే నే నొక వెఱ్ఱివాడనై పోయి యుందును. నేనుకూడ నావంతుకు వచ్చిన బహిరంగమును వ్యక్తిపరము నగు దుఃఖానుభవములను పొందియుంటి నని నా యాత్మకథ మీకు తెలుపగలదు. నా విషాదానుభవములు నన్ను తాత్కాలికముగా నిరాశాహతుని చేసి వైచినవి. నేను వానిబారినుండి తప్పించుకొన సమర్థుడనైతి నేని అది ప్రార్థన మూలమున లభించినదే. సత్యము నా జీవితమునందొక యంతర్భాగమై యున్నది. దానిగూర్చి నేను చెప్పునట్టి భావములలో ప్రార్థ నయు నట్టి యంశ మేమై యున్నదని నేను చెప్పలేక పోవచ్చును. ప్రార్థన లేనిది నాకు సుఖముండజాలని స్థితిలో పడితి నని తెలిసికొనినప్పుడు, కేవల మదొక యవసర విషయముగా నేర్పడినది. భగవంతుని యందు నా విశ్వాసము హెచ్చిన కొలదిని, ప్రార్థనకొఱకగు నా వాంఛ యడంపరానిదై పెరి గెను. అదిలేనిది జీవితము నిరుత్సాహకరమును వ్యర్థమునై

తోచెను. దక్షిణాఫ్రికాలో క్రైస్తవార్చన క్రతువును చూడ బోతిని, కాని అది నన్నాకర్షింపలేక పోయెను. నేను వారితో గూడి ప్రార్థన చేయలేకపోతిని. వారు భగవంతుని వేడుకో సాగిరి. నే నటుల చేయలేక విఫలుడ నైతిని. భగవంతుని యందును, ప్రార్థనయందును అవిశ్వాసముతో నా జీవితము ప్రారంభమైనది. నా జీవితమునందు, కొంతకాలమున కొక దశను నేను చేరువఱకు నా జీవితములో నేదో ఒక కొఱత గలదని గ్రహింపలేదు. కాని ఆ దశను ప్రాపించినపుడు శరీర మున కాహార మెంత యావశ్యకమైనదో జీవునకు ప్రార్థన మంతటియావశ్యకమైనదిగా నాకు తెలియవచ్చినది. నిజము నకు జీవునికి ప్రార్థన మావశ్యక మైనంతగా శరీరమున కాహార మంత యావశ్యకమైనది కాదు. శరీరము నారోగ్యముగా నుంచుటకు తఱచుగా నుపవాస మావశ్యక మగును. కాని ప్రార్థనోపవాసమనునట్టిది లేదు. ప్రార్థనచేసి వెక్కసపడుటను నది సంభవము కాజాలదు. ప్రపంచమహాగురువులలో ముఖ్యు రగు బుద్ధుడు, యేసు, మహమ్మదు ననువారు ప్రార్థన ద్వారమున తాము ప్రబోధము గాంచినటులను, ప్రార్థన లేకుండ జీవితము సాధ్యము కాదనియు నిరాక్షేప మగు సాక్ష్యమును చూపియున్నారు. ఇంతయేల? మనకు సన్నిహితు లగు కోట్లకొలది హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులును జీవితములో దుఃఖోపశమనము గూర్చున దొక్క ప్రార్థన మేనని తెలిసికొని యున్నారు. మీరు వారిని కేవల మసత్యవాదు

లనవలయును, లేదా విభ్రాంతులని యైనను అనవలెను. ఏది లేకుండ నొక్క క్షణమైనను నేను జీవమును భరింపజాలనో అట్టి జీవగఱ్ఱను నాకు ప్రసాదించినది ఆ 'అసత్యవాదమే' యగునేని, సత్యాన్వేషకుడి నగు నా కా 'యసత్యవాదమే' జీవ రక్షయని చెప్ప నెంతును. రాజకీయ దృగ్మండలమున నేదేని నా కెదురై నిలిచి, నిరాశను, భీతినిగొలుపుచున్నను, నేనెన్నడును శాంతిని పోనాడుకొనుటలేదు. యథార్థమునకు నా శాంతినిచూచి మత్సరమును పొందు ప్రజలను నే నెఱుగుదును. ఆ శాంతిప్రార్థన మూలమున లభించుచున్నదని నేను మీకు చెప్పుచున్నాను. నేను పాండిత్యముగల పురుషుడను కాను. కాని ప్రార్థనా ప్రియుడ నని వినయముతో చెప్పుకొందును. ప్రార్థనయొక్క స్వరూపమును గుఱించి నా కంతగా పట్టుదల లేదు. ఆ సందర్భములో ప్రతివాడును తనకు తానే శాసకుడుగా నుండవగును. అయినను విస్పష్టమగు గురుతులు గల రాజమార్గములు కొన్ని గలవు. బాగుగ ప్రాతబడియున్న యీ బాటలగుండ నడచుట క్షేమకరము. ప్రాచీనాచార్యులు ఆ బాటలనుబట్టి నడచియున్నారు. సరే, ఇట్లు స్వీయమగు నా యనుభవ సాక్ష్య మిచ్చినాను. అనుదినము చేయు ప్రార్థనకు ఫలితముగా నేదేని క్రొత్తదానిని తన జీవితమునకు నండగ చేర్చుకొన నగు ననియు, దానితో నేదియు సరిపో జాలదనియు స్వయముగ పరిశోధన చేసిన ప్రతివాడును తెలిసికొనును గాక !

ప్ర:—కాని మీరు భగవంతుని యందలి విశ్వాసముతో ప్రారంభము చేయుచున్నారు. మేమో అవిశ్వాసముతో ప్రారంభించు చున్నాము. ఇక మేము ప్రార్థన చేయుటెట్లు?

స:—సరే, మీకు భగవంతునియందు విశ్వాసము పుట్టించుట నా శక్తికిమించిన పని. స్వయంవేద్యములగు విషయములు కొన్ని గలవు; యెన్నడును ఋజువుపడని విషయములు కొన్ని గలవు. భగవంతుని అస్తిత్వము క్షేత్రగణిత మందలి నిశ్శంకిత ప్రమాణాంశముల వంటిదే. అది మన బుద్ధియొక్క గ్రహణశక్తి కతీతము కావచ్చును. బుద్ధిచేత దానిని గ్రహించుటను గూర్చి నేను మాట్లాడను. హేతువాద వివరణము మీకు సాక్షాద్భగవంతుని యందలి విశ్వాసమును ప్రసాదింపజాలదు. కావున బుద్ధియొక్క ప్రయత్నములు దాదాపుగా వ్యర్థము లగుచున్నవి. ఏమన: అది వివేచనముయొక్కయు, తర్కము యొక్కయు పట్టునకు చిక్కని అతీతవిషయమై ఉన్నది. అది తర్కశక్తి నతిక్రమించియున్నది. మీరు దేవుని అస్తిత్వమును తర్కసాహాయ్యమున నిరూపణ చేయుటకు తోడ్పడగల యనేకములగు ప్రకృతిసంఘటనలు కలవు. వానిపై నాధారపడిన తార్కికవివరణమును మీకు తెలుపబూని, బుద్ధిమంతులగు మిమ్ము నవమానింపజాలను. తర్కబద్ధములగు వివరణముల నన్నిటిని నొక ప్రక్కకు నెట్టివేసి, భగవంతునందలి నిరాడంబర విశ్వాసముతో పసివానిలీల

ప్రారంభము చేయుడని మిమ్ము కోరుచున్నాను. నాకు అస్తిత్వము కలదా! భగవంతునికిని అస్తిత్వము కలదు. కోట్లాది జనముల కెట్లో యట్లే, బ్రతుకునకు అస్తిత్వ మత్యవసర మగుచున్నది. అది వారి జీవితమునం దొక యంశమేమై యొప్పు నని వారు వాదింపలేక పోవచ్చునుకాని, వారిజీవిత ముల తీరునుబట్టి మీరు గ్రహింప గలుగుదురు. విధ్వంసము గావింపబడిన మీ విశ్వాసమునకు పునర్జీవము పోయుడని మాత్రము మిమ్ము ప్రార్థించుచున్నాను. అటుల చేయఁబూనుదు రేని మీ బుద్ధికి మిఱుమిట్లు గొలిపి, మిమ్మును తలక్రిందులు చేసి వేసిన సాహిత్యము నెంతయో మీరు మఱచిపోవలసి యుండును. విశ్వములోని యణువుల కంటెను నల్పులమును, నేమియు తెలియనివారమునని యంగీకరించుటయు, నమ్రతకు చిహ్నమును అగు విశ్వాసముతో ప్రారంభము చేయుడు. మనము పరమాణువులకంటె నల్పులమై యున్నాము. ఏమందురా, పరమాణువు తన యునికియొక్క ధర్మము ననుసరించి వర్తించుచున్నది; మనమో, యజ్ఞానమున గర్వ పూరితులమై ప్రకృతిధర్మమును నిరాకరించు చున్నాము. విశ్వాసహీనులకు నచ్చ చెప్పుటకై సమర్థమగు వాదన మేదియు నాకడ లేదు.

భగవంతుని అస్తిత్వము నొక్కసారి యంగీకరించితిరా, ప్రార్థనావశ్యకత నుండియు తప్పించుకొనుటకు వీలులేదు.

'మా జీవితమంతయు నొక ప్రార్థనయే; కావున ప్రార్థనకని యొక ప్రత్యేక సమయమున, నొక ప్రత్యేకస్థలమున కూర్చుండుట మాకవసరము లేద'నెడు వింతవాదనకు దిగకుందురు గాక. ఎవరి జీవితకాలమంతయు భగవంతుని యనుసరణ వర్తనముగ గడచెనో, యా మహానీయులు సైతము నిటువంటి వాదన చేసియెఱుగరు. వారి జీవితములు సంతత ప్రార్థనాచర్యగా జరిగినవి. అయినను మనకొఱకుగాను, వారు ప్రత్యేకసమయములందు ప్రార్థనలు చేయుచు, తమ భగవద్భక్తి ప్రమాణమును ప్రతిదినము పునశ్చరణచేసెడి వారని గ్రహింతుము గాక. భగవంతుడెట్టి ప్రమాణమును గాని తీసికొనుడని పట్టుపట్టడనుట నిశ్చయము. అయినను ప్రతిదినము మన ప్రమాణమును పునశ్చరణ చేయవలసియున్నది. అటుల చేసితిమేని జీవితములో మన మూహింపజాలు ప్రతియాపద నుండియు విముక్తులము కాగలుగుదు మని నేను నిశ్చయముగా చెప్పుచున్నాను.

## క్వెట్టా భూకంపము

నరుడు పడిపోయినప్పుడు తనను లేవనెత్తుకొఱకు భగవంతుని వేడుకొనును. 'దిక్కులేనివారికి భగవంతుడే దిక్కు'ని యొక తమిళసామెత గలదు. క్వెట్టాలో సంభవించిన ఘోరాపద వినువారిని నిశ్చేష్టితులను చేసివేసినది. పునర్నిర్మాణ ప్రయత్నము లన్నియు భగ్నములగుచున్నవి. ఆ యాపద

యింతటిదని తెలుపు యథార్థవిషయముల నెన్నడును బహుళః తెలియ వీలుపడదు. కానిండు, చచ్చినవారిని తిరిగి బ్రతికించుట యసంభవము గదా.

సదా పురుషప్రయత్నము మాత్ర ముండితీరవలసిన దే. పోగా మిగిలినవారికి సాహాయ్యము చేసితీరవలయును. సాధ్యమగువాటి పునర్నిర్మాణము తప్పక పూనుకొన బడును. ఇట్లెంత జరిగినను, మఱియు నిట్టికార్యము లెన్నిటిని చేసినను, ప్రార్థన జేయుటకు బదులుగా నీ క్రియలు జరిగెనని యెంచ తగదు.

సరే, ప్రార్థనయే యెందుకు చేయవలయును? భగవంతుడను వాడే యొకడుండెనేని, యేమి సంభవించెనో యతడెఱుగడా? ఆతని ధర్మము నతడు నెఱవేర్పగలుగుటకు భగవంతునికి మన ప్రార్థన మవసర మగునా? యనిన,

కాదు. భగవంతుని కెవరును జ్ఞప్తి చేయ నవసరములేదు. అతడు ప్రతివానియందు నంతర్యామియై వెలయుచున్నాడు. వాని యనుమతి లేక యేమియు జరుగదు. మన ప్రార్థనమన మన హృదయపరిశోధన మాత్రమే. భగవంతుని యాధారము లేనిది మనము నిస్సహాయ్యులమని మనము జ్ఞప్తి చేసికొనుటే. ప్రార్థనము లేనియెడలను, మఱియు భగవంతుని దీవన లేనట్టి ప్రయత్నమేనియు పరిపూర్ణమైనది కాజాలదు. ప్రార్థనమనగా, నమ్రతపూను ప్రేరణయే. ఆత్మపారిశుద్ధ్యము

కొఱకును, ఆంతరంగిక పరిశోధనకొఱకును కల్పించుకొను హెచ్చరికయే ప్రార్థన.

బీహారు విపత్తుకాలమున నేను చెప్పినదానినే మఱల చెప్ప వలసియున్నది. భౌతికమగు ప్రతి ఆపదకు వెనుక నీశ్వరోద్దేశ్య మొకటి యుండియుండును. గ్రహణము లెప్పుడువచ్చునో యీనాడు మనకు తెలుపుకీతిని, భూకంపము లెప్పుడు సంభ వించునో సుపరిణత పొందిన శాస్త్రము ముందొకనాడు మనకు తెలుపగలుగుట సంభవము కావచ్చును. నరుని బుద్ధి సాధించు విజయములలో నయ్యది మఱొకటి కాగల్గును. అయినను, ఏదిలేకున్న సర్వమును వ్యర్థమైపోవునో అట్టి ఆత్మ విశుద్ధతను మనకు ప్రసాదించుటకు, లెక్కకుమీఱి యిట్టి విజయము లనంతముగా వచ్చిపడినను, అవి సమర్థములు కాజాలవు.

బీహారు విపత్తును మనము మఱచిపోయినటులే, ఈ కట్ట కడపటి యాపదనుగూడ మనము తప్పక విస్మరింతుము. ఇటు వంటి ఘోరాపదలకు వెనుకనుండు భగవత్సంకల్పమును మనము తెలిసికొనుకొఱకును, ఎప్పుడెప్పుడు మన సృష్టికర్త నుండి యాహ్వానము వచ్చునో యప్పుడెల్ల వానిని దర్శించు టకై మనలను వినమ్రుల గావించి సంసిద్ధులచేయు కొఱకును, మన తోడిజీవు లెట్టివారైనను వారి బాధలను పంచుకొను టకై మనము సదా సంసిద్ధులమై యుండుకొఱకును, అంత

రంగిక విశుద్ధత యగత్యమని గుర్తించువారినెల్ల మాతో గలసి ప్రార్థన చేయుడని నేను కోరుచున్నాను.

## ప్రార్థనయొక్క అంతరార్థము

క్వెట్టా విపత్తు సందర్భమున ప్రార్థన చేయుడనియు, పశ్చాత్తాపము పొందుడనియు ప్రజలను కోరుచు నేను వ్రాసిన కొలది వాక్యములు కొందరు వ్యక్తులు నాకు స్వయముగ లేఖలు వ్రాయుటకు హేతువైనవి. ఒక విలేఖరి ఇట్లు ప్రశ్నించుచున్నాడు:—

"బీహారు భూకంపము సమయమున, అస్పృశ్యతా దోషము కొఱకుగాను తగిన శాస్తిగా సవర్ణహిందువులు దానిని గ్రహింపవలయునని వక్కాణించుటలో మీరు వెను కాడియుండలేదు. అంతకన్నను ఘోరతరమగు క్వెట్టా భూకంపము ఏ పాపఫలమై యుండును ?"

స:— ఈ విలేఖరికి కిట్టి ప్రశ్న వేయుట కధికారము కలదు. బీహారునుగుఱించి యెంత బుద్ధిపూర్వకముగా నేను వ్రాసితినో, క్వెట్టానుగుఱించియు నా వాక్యముల నంత బుద్ధిపూర్వకముగనే వ్రాసితిని. ప్రార్థనచేయుడను నా యాహ్వానము విస్పష్టమగు ఆత్మావేదనయేయై యున్నది. ప్రార్థనము మన పశ్చాత్తాపమునకు చిహ్నము; ఉత్తములమును, పవిత్రుల మును నగుటకు అగు మన అకాంక్షయే అది. ప్రార్థనాపరు

డగు మనుజుడు భౌతికములగు నాపదలను భగవంతుడుపంపు శిక్షణగా నెంచుకొనును. వ్యక్తులకు నెట్లో, జాతులకు నట్లే యీ శిక్షణ యొప్పును. ఈ శిక్షణ లన్నియు నొకే రీతిని ప్రజలను చలింప చేయజాలవు. కొన్ని వ్యక్తులను బాధించును. మఱికొన్ని సమూహములను లేక జాతులను తేలికగా మాత్రమే కదల్చును; క్వెట్టావిపత్తు వంటివి మనలను ప్రమాన్పడ జేయును. దినదినము వచ్చు సామాన్యపు కష్టములతోడి మనకు గల పరిచయము కారణముగా వానిని తృణీకారముతో చూచుచుందుము. భూకంపములు గూడ ప్రతిదినము కలుగునవేయగుచో, మనము వానిని లెక్క చేయనే చేయము. ఈ క్వెట్టాభూకంపము సైతము బీహారు దానితో సమానముగా నైనను సంక్షోభ పెట్టలేదు.

ఎట్లైనను ప్రతి విపత్తును యోచనాపరుడగు నరుని వినమ్రుని చేయుననుట సర్వసామాన్యానుభవముగా నున్నది. ఆతడు దానిని తన పాపములకు భగవంతుడు విధించిన ప్రతిఫలమనియు, ఇక మీదట తాను యోగ్యతరుడై ప్రవర్తింప వలయుననియు తలంచును. వాని పాపములు వానిని పూర్తిగ నిస్సహాయ్యుని చేసివైచును. అట్టి నిస్సహాయ్యత వలన భగవంతుని గూర్చి మొఱలిడును. ఈ విధముగా కోట్లకొలది మానవులు తమ తమ వ్యక్తిపరములగు విపత్తులను ఆత్మపారిశుద్ధ్యము కొఱకు సాధనములుగా వినియోగించుకొందురు.

ఆపదలు పైబడునపుడు జాతులు సైతము సంరక్షణకొఱకు భగవంతుని వేడుకొని యుండుటను గూడ మన మెఱుగుదుము. అట్టియెడల వారు పశ్చాత్తప్తులై భగవంతుని యెదుట తమను హీనపఱచుకొనిరి; నమ్రతను ప్రకటించుకొఱకును, ప్రార్థనలు సలుపుకొఱకును, పునీతకర్మల జేయుకొఱకును ప్రత్యేకదినములను నిర్ణయించుకొనిరి.

కావున నిప్పుడు నే నేమియు క్రొత్తదానిని గాని, యపూర్వమగు దేనినిగాని సూచించియుండలేదు. అవిశ్వాసమే మర్యాదయైపోయిన ఈ దినములలో, స్త్రీ పురుషులను పశ్చాత్తాపపడుడని ప్రోత్సహించుటకు కొంత సాహసము కావలసియే యుండును. కాని నా కట్టి సాహసము కలదని చెప్పకొన జాలను. నా దుర్బలతలు, నా నైజములు నందఱికి తెలిసియే యున్నవి. బీహారు దేశమును, బీహారు ప్రజలను నే నెఱిగి యున్నంతగా క్వెట్టానుగూడ నే నెఱిగి యున్న యెడల, అస్పృశ్యత బీహారున కెంత దోషమై యొప్పనో అంతకంటె క్వెట్టాప్రజల పాపములు ప్రత్యేకముగా గొప్పవి కాక పోయినను, నేను వానిని తప్పక పేర్కొని యుండెడివాడనే. పాలితులు, పాలకులు నగు మన మందఱము బాధ్యత వహింప వలసిన వ్యక్తిపరములును, జాతీయములును నగు పాపము లనేకములు గలవని యెఱుగుదుము. వీ రందఱును పశ్చాత్తాపపడి ప్రార్థనలు సలిపి వినమ్రభావమును చూప

వలయునని యే నా విన్నపము. నిజమగు ప్రార్థన నిష్క్రియత కుపక్రమణము కా జాలదు. అది యెడ తెఱపిలేని స్వార్థరహిత మగు కర్మను గుఱించిన తీవ్రమగు ప్రోత్సాహమే. శుష్కకర్మ స్వార్థపరులగు సోమరులకై నియమింపబడినది కాదు. అది నిస్స్వార్థప్రవృత్తి పరులగు వారికే సాధ్యపడును.

## ప్రార్థనయందు చేయునదేమి ?

బౌద్ధమతావలంబి యగు డాక్టరు ఫెబ్రిగారు గాంధీజీ ఎట్టి ప్రార్థన చేయునో, ప్రార్థన చేయునపు డేమి చేయునో, వారి ప్రార్థన లీశ్వరేచ్ఛను మార్చగలుగునో యని ప్రశ్నింపగా గాంధీజీ యిట్లు సమాధానము చెప్ప నారంభించెను.

స:— నేను ప్రార్థన చేయునప్పు డేమి చేయుదునో పూర్తిగ వివరించుట చాల కష్టమగు విషయము. అయినను నేను మీ ప్రశ్నకు సమాధానము చెప్ప ప్రయత్నింపవలసి యున్నది. భగవంతుని మనస్సు మారునది కాదు. కాని యా భగవంతుడే చేతనా చేతనములగు ప్రతిదానియందును కలడు. నాలోగల యా దైవమును నేను సంబోధింప గోరుటే నా ప్రార్థనయొక్క భావము. సరే, నేను బుద్ధిద్వారమున విశ్వాసము పూన వచ్చును. అయినను ప్రాణప్రదమగు నీశ్వరస్పర్శ లేనివాడనె కావచ్చును. కాబట్టి భారతదేశముయొక్క స్వరాజ్యము కొఱకో, లేక స్వాతంత్ర్యము కొఱకో నేను ప్రార్థించునప్పుడట్టి

స్వారాజ్యమును సంపాదించుటకు, లేదా దాని సంపాదనయందు నాకు చేతనైనంత యత్యధిక సహకారము చేయుటకు, తగిన శక్తిని నాకు ప్రసాదింపుమని, నేను ప్రార్థింతును; లేదా కోరుకొందును, మఱియు నా ప్రార్థనకు ప్రత్యుత్తరముగా నా కట్టి శక్తి లభించునని నొక్కి వక్కాణింతును.

ప్ర:- అట్లగుచో మీరు దానిని ప్రార్థన మని పిలుచుటలో న్యాయములేదు. ప్రార్థించుటనగా వేడుకొనుట లేక గట్టిగా యడుగుట యని యర్థముగదా.

స:- అవును నిజమే. నే నింకను దేనితో పూర్ణముగ నైక్యానుభూతిని పొందలేకయుంటినో యట్టి నన్నుగూర్చియే, అనగా నా యుండలి సత్యాత్మను గుఱించి, లేక నా యనల్ప స్వరూపమును గుఱించియే, నేను విన్నపము చేయుచుంటి నని మీ రనవచ్చును. కావున సమస్త భూతములను తనయందు ధరించియుండు పరమేశ్వరునిలో లీనమగు కొఱకైన నిరంతరాకాంక్ష యని దానిని మీ రభివర్ణింపవచ్చును గూడను.

ప్ర:- కాని మీ రద్దానిని ప్రబోధించుటకు పురాతన మంత్రరూపముల నుపయోగింతురే?

స:- అవును, జీవితపు చిరతరాభ్యాసము వదలిపోజాలదు. నాకు బాహ్యమున నెక్కడనో యున్న శక్తినిగూర్చి నేను ప్రార్థింతునని చెప్పినను నే నొప్పుకొందును. నే నా యనం

కునియం దొక యంశమనీ, మఱియు పరమాణువును బోలు సత్యల్పతరాంశము నగుటచే, వానికి నేను వెలుపల నున్నటు లను భావన చేయుదును. బుద్ధి నుపయోగించి మీకీ వివరణను నేను తెలుపుచున్నను, భగవంతునితోడి యైక్యానుభూతి లేనిచో నేను శూన్యమైపోవునంతటి యల్పుడ ననియే భావించుకొందును. నేనిది చేయుదును అదిచేయుదును అని పలుక నారంభించిన తోడ్తోడనే, నా యయోగ్యతను, నా శూన్యతను నే ననుభూతిచేయ మొదలిడుదును. వే ఱొక శక్తిమంతుడు నాకు సాహాయ్య మొసగునను భావనను సాగింతును.

ప్ర:- టాల్‌స్టాయి కూడ నిదే విషయమును చెప్పినాడు. ప్రార్థన మన నిజముగా పూర్ణమగు ధ్యానము; చిన్నబిడ్డ తండ్రిని బ్రతిమాలుటం బోలు భావములోని కష్టదశ్పుడు జారిపోవుట సంభవించినను, పరమాత్మయందు లయమైపోవు టయే ప్రార్థన మన్నాడు.

స:- క్షమింపుడు దానిని జారిపోవుటయని నేనెన్నడు చెప్ప నంగీకరింపను. ఎక్కడనో ఆకాశమున, మేఘముల కావల నుండు భగవంతుని గుఱించి నేను ప్రార్థన చేయుదు నని చెప్పి నను ఈ సందర్భమున నెక్కువ సమంజసముగా నుండగలదు. భగవంతుడు నాకు దూరముగా నున్నాడను కొలదిని, నేను వానిని గుఱించి మిక్కుటముగా ఆవేదనను పొంది, భావ

ములో వాని సమక్షమునకు చేరుచున్నట్లు భావన చేయ గలను. భావనమునకు వెలుగునకంటె ఘనతర వేగము కలదని మీా తెలియంగుదురుకదా. కాబట్టి వానికిని, నాకును నడుమగల దూరము గణనకు రాజాలనంత గొప్పదిగా నున్నను, నా భావనచేత శూన్యమై పోవుచున్నది. ఇట్లు భగవంతుడు నా కత్యంతదూరమున నుండును; మఱియు సన్నిహితుడునై యొప్పును.

ప్ర:- అదప్పుడు కేవలము విశ్వాసముతో గూడిన విషయ మగుచున్నది. కాని గాఢ విమర్శాపరత యను శాపముచే గ్రస్తులైన నావంటిమానవులుకొందఱుందురుకదా. నామట్టుకు నాకు బుద్ధుడు బోధించిన దాని కంటె శ్రేష్ఠతరమైన బోధ ఏదియు కాన్పింపదు. వానిని మించిన సద్గురుడును లేడు. ఎందు కనగా ప్రపంచగురువులలో బుద్ధుడొక్కడు మాత్రమే, 'నేను చెప్పుదానిని సర్విచారముగా పూర్తిగ నమ్మబోకుడు. నా సిద్ధాంత నిర్ణయమునుగాని, మఱే పుస్తకమును గాని అమోఘముగా నంగీకరింపకుడు' అని బోధింపగల్గినాడు. వరులెంతటి ఆంతర ప్రబోధము పొందినవారైనను, వారల చేత వ్రాయబడినవే యగుటవలన ప్రపంచమునగల పుస్తక ములలో నేదియును అమోఘ మని నాకు తోచదు. ఆ కార ణముచేతనే యెక్కడనో మహోన్నతమగు శ్వేతసింహాస నముపై నాసీనుడై మహారాజు వలె మన ప్రార్థనలు విను

చుండు సాకారదైవము గలడని విశ్వసించుట నాకు గిట్టదు. మీ ప్రార్థన వేఱొక దశాంతరమున నుండుట నాకు సంతోషము.

స :- మీరు నా ప్రార్థన వేఱొక దశాంతరమున నుండె నని చెప్పినపుడు, మీరు పల్కినది పూర్ణసత్యము కాదని నేను మీకు జ్ఞప్తిచేయుచున్నాను. నేను మీకు తెలిపిన బుద్ధిబద్ధమగు నా విశ్వాసము సదా నాతోడ నంటిపట్టుకొని యుండుటలేదని మీకు చెప్పియేయున్నాను. నాతోడ నిలిచి యుండునది, దేని ద్వారమున నే నొక మహా అగమ్యమగు 'దైవీశక్తి' లో కలిసి పోవుచుందునో అట్టి గాఢతమ విశ్వాస మొక్కటె. ఆ కారణముచేత నే నేదేని కార్యమును చేసితి ననుటకంటె, భగవంతుడే నా కొఱకాకార్యమును చేసెనని చెప్పుట మిగుల సత్యమై యొప్పగలదు. నే నతి గాఢముగా వాంఛించునవైనను, నేను స్వతంత్రముగ నెన్నడును సాధించి యుండజాలని విషయము లెన్నియో, నాజీవితములో సఫలత గాంచియున్నవి. అట్లగుట నా ప్రార్థనలకు ప్రతిఫలమని నా తోడి కార్యనిర్వాహకులతో సదా చెప్పుచుండేవాడను. అట్లు జరుగుట అంతర్యామియై పఱగు భగవంతునియందు మిళితమై పోవుటకు నేను చేయు బుద్ధిసంబంధమగు యత్నము లకు ప్రతిఫల మని వారితో నే నెన్నడు నని యెఱుగను. భగవంతుడు నా కష్టములనుండి నన్ను కడతేర్చె నని చెప్పుట సులభతమమును, నిర్దుష్టమును నగును.

## కర్మ ప్రభావము

ప్ర:-అయినను, ఆ స్థితిని పొందుటకు మీ కర్మద్వారా మీ రక్షతను గడించుకొంటిరి. భగవంతుడు న్యాయమూర్తిగాని పక్షపాతస్వరూపి గాడు. మీ రుత్తమపురుషులు. కావున నుత్తమ ఫలములు మీకు లభించుచుండును.

స:- కావచ్చును. ఆ విధముగా నన్ని పరిస్థితులు సంభవించుటకు తగినంత యోగ్యుడను నేను కాను. అట్టి కర్మతత్త్వభావముతో నేను వర్తించుదునేని, నేను తఱచుగా కర్మఫలభోగిని మాత్రము కావలసివచ్చును. అయిన నాకర్మ నన్ను రక్షింపజాలదు. అమోఘమగు కర్మసూత్రమునందు నాకు నమ్మకమున్నను, అనేకములగు కార్యములు సాధించుటకు నేను పెనుగులాడుచునే యుంటిని. అధికాధికముగా కర్మను కూర్చుకొనుటకును, భూతకాలకర్మను పరిహారము చేసికొనుచు, వర్తమానకర్మకు చేర్చుటకును, నేను పడుపాటు నా జీవితమందలి ప్రతి క్షణమును జరుగు నా ప్రబలప్రయత్నమే. ఇట్లుండ నా ప్రాక్తన (పూర్వపు) కర్మ మంచిదిగా నుండుటచేతనే నా కిప్పుడు మేలు చేకూరుచున్నదని చెప్పుట పొఱపాటగును. ప్రాక్తన మగునది యచిరకాలములోనే వ్యయమై పోవును. మఱియు భవిష్యత్కాలము కొఱకు ప్రార్థన సాహాయ్యముతో నేను పునఃనిర్మాణము చేసికొనవలసియుండును. కేవలము

కర్మ అసమర్థమైనదినుడీ! 'ఈ నిప్పుపుడకను వెలిగింతును.' అని నేను పూనుకొనినను, బాహ్యమునుండి నాకుసహకారము దొఱకదేని నే నటుల చేయజాలను. ఈ పుడకను గీయులోపల నా చేతికి పక్షవాతము రావచ్చును. లేదా నా కీయొక్క పుడక మాత్రమే నిలిచియుండ, గాలి దాని నార్పివేయవచ్చును. అట్టి దాని నవాంతరమందుమా, లేక దైవికమందుమా, లేక దైవీ శక్తి ప్రభావమందుమా? ఇప్పుడైన నా పూర్వీకులు వాడి యున్న భాషనుగాని, లేక పసివారి భాషనుగాని ప్రయోగించుట నా కిష్టము. నే నొక పసివానికంటె మించిన ఘనుడను కాను. మనము పండితులమని ప్రగల్భములు పలుకవచ్చును. పెక్కు గ్రంథములను వల్లె వేయవచ్చును. కాని ఆపదలు వచ్చునపుడు, మహావిపత్తులు మన నెదిరించి నిలుచునప్పుడు, మనము పసివారివలెనే వర్తింతుము. విలాపముల సాగింతుము; ప్రార్థనలుచేయ మొదలిడుదుము. అప్పుడు మన బుద్ధిబలము వలన కూర్చుకొనిన సమాధానములు మనకు తృప్తినీయజాలవు.

## బుద్ధుడు ప్రార్థనలు చేయలేదా?

ప్ర:—భగవంతుని యందలి విశ్వాస మెవరి కత్యద్భుతమగు శాంతి నొసగినదో, యెవరి శీలనిర్మాణమున మిక్కిలి తోడ్పడినదో, అట్టి మనీషావంతులను నేనెఱుగుదును. అయినను నట్టి విశ్వాసము లేకుండ వర్ధిలజాలు ధీమంతులుగూడ గలరు. నేను బౌద్ధమతము వలన నేర్చుకొనిన దిదియే.

స:-కాని బౌద్ధమతమే యొక మహాదీర్ఘమగు ప్రార్థన క్రియగా నున్నది.

ప్ర:-ప్రతివాడును తననుండి తానే మోక్షము బడయవలయునని బుద్ధుడు బోధించియున్నాడు. బుద్ధుడెన్నడును ప్రార్థనలు చేసియుండలేదు. ఆయన ధ్యానము మాత్రమే సలిపియున్నాడు.

స:-దానిని మీ యిష్టమువచ్చిన పేరు పెట్టి పిలువుడు; విషయము మారదు. బుద్ధవిగ్రహములను పరికించి చూడుడు.

ప్ర:-కాని యవి వాని యథార్థస్వరూపములు కావు. అవి వాని నిర్యాణానంతరము నాలుగువందల సంవత్సరముల పిమ్మట వెలసినవి.

స:-మంచిది, మీరు కనిపెట్టిన స్వరూపమున బుద్ధచరిత్రను నాకు తెలుపుడు. ఆ మీ బుద్ధుడు ప్రార్థనాభిమానియగు బుద్ధుడే యని నేను ఋజువు చేయుదును. కేవలము బుద్ధిసాధ్యమగు భావన నన్ను తృప్తిపఱుపజాలదు. మీరు మీ భావన నభివర్ణింపజాలని టీఱున నే, నేనుగూడ నిర్దుష్టమును, పూర్ణమును నగు వివరణమును తెలుపజాలను. వర్ణన చేయుటకు పూను ప్రయత్నమే యొక అడ్డుగా నేర్పడును. పృథక్కరణము సాధ్యపడదు. తుదకు మీకు మిగులునది సంశయ మాత్రమే.

ఇట్టి యవస్థనున్న నరుని గుఱించియే కాబోలు 'పోపు' కవిశేఖరు డీ యర్థమిచ్చునట్లు వ్రాసియున్నాడు :—

గీ॥ "జ్ఞానమూ సంశయమునకు స్థానమీాదు ;
భావములో, శక్తిహీనముల్ రాగరహిత
సంపదం జెంద రెంటికిం జాలక చెడు ;
ఘన ప్రవృత్తి, నివృత్తిమార్గముల సంశ
యుండగు; దైవమానొక్కో లేక
మృగమొ తానెట్టు లెంచక తగకయుండు.
కాయమునుగాని, మనసునుగాని నమ్మ
కొనగజాలడు; పుట్టుటాకన మృతికగు.

తర్కమూ, కూలనే ప్రమాదముల యందు
తనకుతా న్యాయనిర్ణేత; మునుగ నంతు
దరియు లేనట్టి భ్రమ ప్రమాదముల యందు
పరమ గంభీర పరిహాస భాజనుండు ;
జగమున దురూహ్యుడౌ నింద్రజాలవశుడు."

## నమ్రతపూను టొప్పగును

ప్ర:— ప్రార్థన సలుపజాలని ప్రజల గతి యేమి ?

స:— నమ్రులై వర్తించుడని నేను వారికి తెలుపుదును. బుద్ధుని గూర్చిన మీా భావనచేత యథార్థపు బుద్ధునికి సైతము మీారు హద్దులబెట్ట చూడకుడు. బుద్ధుడు ప్రార్థనలు

సలుపునంతటి వినయశీలుడే కానియెడల, పూర్వము మఱి ఇప్పుడునుగూడ కోట్లకొలంది ప్రజల జీవితములయందు పరివర్తనము కల్పించి యుండజాలువాడే కాడు. మనలను, మఱియు సంశయాత్ములను కూడ వశపఱచుకొను బుద్ధికంటె, నంతముగా శ్రేష్ఠమైన పఱగున దొకటి కలదు. మన జీవితములలో సంభవించు సందిగ్ధావస్థలయందు మన "అజ్ఞేయవాదము" గాని మన తత్వశాస్త్రముగాని మనకు రక్షయొసంగజాలదు. వీనికి మించినదియు, వీనికిగూడ నండయై నిలుచునదియు, పరమోత్తమమైన వేఱొకటి మనకు కావలసియున్నది. కాబట్టి ఎవరేని నన్ను విషమప్రశ్నలడుగు నెడల నేనిట్లనుచుందును.

నీవు శూన్యమై పోవునంతగా కుంచించుకొనిపోయిననే తప్ప భగవంతుడన్నను, ప్రార్థనమన్నను నర్థమేమో నీవు తెలిసికొనజాలవు. నీవెంత ఘనుడవైనను, నీవెంత శేముషీధురంధరుడవైనను, ఈ విశాలప్రపంచములో నీ వొక్క నలుసుమాత్రమే యని గ్రహించునంతటి వినయశీలుడవు కావలయును. జీవిత విషయములను గుఱించి, కేవల బుద్ధి సాహాయ్యమున చేసికొనిన నిరూపణములు సరిపోవు. బుద్ధిని దాటిపోవునట్టి ఆధ్యాత్మికానుభూతి మాత్రమే, యెవనికేని పూర్ణమగు సంతుష్టిని నొసగజాలును. ధనసంపన్నులు సైతము తమ జీవితములలోని సంధిగ్ధావస్థలయందు తబ్బిబ్బ

పోవుచుందురు. డబ్బుపెట్టి కొనగలట్టియు సమస్తమును తమ చుట్టునున్ననుగూడ, కొన్నికొన్ని సమయములందు గతిగానక దిగ్భ్రాంతులపాలై యుందురు. ఇట్టి సమయములందే భగవంతుని గురించిన మెఱుపులవోలు క్షణకాలదర్శనములు మనకు లభించును. మన జీవితములో ప్రతిఅడుగును నియమించు యీ జగన్నియంతయొక్క లీలా మాత్రదర్శనము ప్రాప్తింప గలుగును. ప్రార్థన మనగా నట్టిది.

ప్ర.— బుద్ధి సాధ్యమగు భావనను మించి ప్రబలమైనదెవ్వ ఆధ్యాత్మికముగ యథార్థానుభవముగ మనము పేర్కొను నదే యని గదా మీ యభిప్రాయము ? నా జీవితములో రెండుసారులు నా కట్టి యనుభవము కలిగినది. అంతటితో నది యంతరించినది. కాని బుద్ధదేవునియొక్క యొకటి రెండు వాక్యములు నాకు పరమ శాంతిదాయకములుగ నున్నవి : 'స్వార్థపరతయే దుఃఖమునకు మూలకారణము. సన్యాసులారా! సర్వమును క్షణభంగురమని జ్ఞప్తి నిడుకొనుడు.' వీనినిగుఱించి మనముచేయుచే దాదాపుగ విశ్వాసముయొక్క స్థానము నాక్రమించుచున్నది.

స:— అదియేగా ప్రార్థన యనగా!

## చతుర్థ భాగము

## విగ్రహారాధనము

నాకు ప్రతిమార్చనమునందు విశ్వాసము లేదు. నే నొక ప్రతిమను చూచునపుడును నాలో భక్తిభావ ముప్పొంగుట లేదు. అయినను విగ్రహారాధనము మానవప్రకృతియం దొక యంశముగా నున్నదని నా యభిప్రాయము. సంకేతముల కొఱకై మన మాకాంక్షించుచుందుము. వెలుపలికంటె 'చర్చి' యందొకడు హెచ్చుశాంతి ననుభవింపగలుగు టేల? విగ్రహములు పూజలందు సహాకారములుగ నుండగలవు. ప్రతిమయే దేవుడని ఏ హిందువును భావించుటలేదు. విగ్రహారాధన పాప మని నే ననుకొనను.

ఒక పరమలక్ష్యమును సూచించుట కుపయోగపడిన నే, విగ్రహారాధనమును హిందూమత మంగీకరించు చున్నది. కేవల మా విగ్రహమే పరమప్రాప్యమను నెడల, అది పాప హేతువగు బొమ్మలపూజనమై పోవును.

పదముల నిజమగు నర్థమిదని నేను భావించురీతిని, నేను 'విగ్రహారాధకుడ'ను నగుదును; 'విగ్రహనాశకుడ'ను నగు దును. విగ్రహారాధనలకు వెనుక నాధారముగ నున్న భావ

మును నేను మన్నింతును. మానవజాతిని ఉన్నతికి తెచ్చుట కదెంతయు ప్రయోజనకారిగనున్నది. ఈ మన స్వదేశమును పవిత్రవంతము చేయు వేలకొలది పుణ్యదేవళములను, నా ప్రాణము నొడ్డి రక్షించుటకు తగిన సమర్థత నా కుండిన నెంతయో సంతసింతును. నేను ముసల్మానులతో సఖ్యము చేయుచున్నానని, నా విగ్రహముల నెడలను, దేవాలయముల నెడలను పరిపూర్ణమగు సహనము వారు చూపుదురనియే దాని యంతరార్థము. తాను భగవంతునర్చించు విధానమునందు తప్ప మఱే యితర విధానములందును, నేలాటి సద్భావమును నంగీకరింప నిరాకరించునట్టి దురాగ్రహరూపమగు విగ్రహారాధనను ధ్వంసము చేయవలయునను నర్థమున, నేనొక విగ్రహభంజకుండనే. ఒక చిన్న రాతి ముక్కనో లేక బంగారపు బొమ్మనో సాక్షాత్తుగ దేవుడే యని పూజించు, స్థూలమును, మూఢమును నైన విగ్రహారాధనముకంటె ఈ దురాగ్రహారాధన మహాభయంకరమును, దుర్గ్రాహ్యమును, మోస భూయిష్టమును నైయున్నది.

విగ్రహములనే పూజించుటకంటె, విగ్రహమునందు భగవంతుని పూజించుట సక్రమమగు అర్చనమే యగును.

## ఒక క్లిష్టమగు ప్రశ్న

ప్ర :- నేనొక హిందూవిద్యార్థిని. నా కొక ముసల్మాను స్నేహితు డుండెడువాడు. విగ్రహారాధనవలన నాకు శాంతి

కలుగును. కాని నా ముసల్మాను స్నేహితునికి సుసమ్మత మగు వచనములతో నేను సమాధానము చెప్పజాలకున్నాను. మీరు దయచేసి హరిజన పత్రికద్వారా విగ్రహారాధనను గురించి కొంచెము తెలిపెదరా?

స :- మీ యెడలను మీ ముసల్మాను స్నేహితు నెడలను నాకు సానుభూతికలుగుచున్నది. పై విషయమును గురించి 'యంగు ఇండియా' లోని నా వ్రాతలను మీరు చదువవచ్చును. మీ కది తృప్తికరముగా నున్నయెడల మీ ముసల్మాను స్నేహితునిచేత గూడ చదివింపించుడు. మీస్నేహితునకు మీమీద నిజమైన ప్రేమయున్న యెడల, విగ్రహారాధనపైగల తన ద్వేషము నడంచు కొనగలుగును. అభిప్రాయమందును, వర్తనయందును సర్వత్ర ఐక్యతయుండి తీరవలయునని పట్టుపట్టునటువంటి వాని స్నేహము ఏమంత విలువ గలదికాదు. స్నేహితు లొండొరుల జీవితమార్గములును, భావవైఖరులును భిన్నముగా నున్నప్పటికిని, (అవి ప్రధానాంశములలో విరుద్ధములుగా నున్నతప్ప) పరస్పర సమానభావము చూపుకొనుచుండవలయును. ఒకవేళ మీరు విగ్రహారాధకులు గాన, మీతో సహచర్యము చేయుటయే పాప మని మీ స్నేహితుడు భావించియుండ వచ్చును. ప్రతిమలపూజ దోషమేగాని, ప్రతిమద్వారా పూజల నర్పించుట దోషము కాదు. ప్రతిమార్చకుడు తన ప్రతిమనే దేవునిగా భావించును.

విగ్రహారాధకుడో రాతిలో సైతము భగవంతుని చూచును. కావున, భగవంతునితోడి తనయైక్యతను స్థిరపఱచుకొనుటకు గాను, అతడు విగ్రహముయొక్క సాహాయ్యము నంగీకరించు చున్నాడు. ప్రతి హిందూ బాలుడును నల కాశీలోని సుప్రసిద్ధాలయము నందలి శిలయే కాశీవిశ్వనాథుడు కాడని యెఱుంగును. అయినను విశ్వేశ్వరు డాశిలలో ప్రత్యేకముగా నధివసించునని ఆతడు విశ్వసించును. ఇటువంటి భావనాసాధన సుగ్రాహ్యమును, క్షేమకరమును నగును. పుస్తకవిక్రయ శాలలోనుండు భగవద్గీత ప్రతులలో ప్రతిదానియందును, నా స్వంతప్రతియందు నేనారోపణ చేసికొనునంతటి పవిత్రత నాకు దోపజాలదు. నా ప్రతిలో ఇతర ప్రతులలోకంటె హెచ్చు పవిత్రత లేదని తర్కము నాకు చెప్పగాక; అయినను నేనారోపించు పవిత్రత నా భావన ననుసరించి యుండును. అట్టి భావన అద్భుతములగు ప్రత్యక్షఫలితముల నొసగగలదు. అది మానవ జీవితములనే మార్చివేయగలదు. విగ్రహపూజకులకును, విగ్రహములద్వారా పూజించువారికిని మధ్య నేను చూపునట్టి ఈ భేదమును పాటింపనియెడల, మన మొప్పుకొనినను నొప్పుకొనక పోయినను, మనమందఱము విగ్రహారాధకులముగాని లేక విగ్రహములద్వార నారాధనలచేయువారముగాని యగుచున్నామని నా యభిప్రాయము. ఒక గ్రంథము, భవనము, పటము, శిల్పము నన్నియు ఈశావాస్యములగు విగ్రహములే యగునుసుడీ! అట్లయ్యును అవి

మాత్రము భగవంతుడు కాజాలవు. వానినే భగవంతునిగా తలంచువాడు పొఱపడుచున్నట్లే.

## దేవాలయము

మతముపేరు పెట్టుకొని కలహములకు దిగుచు భగవంతుని నామమును దుర్వినియోగము చేయుటకు మారుగా, మనలో ప్రతివానిని నిజమగు పూజచేయుకొఱకై ఆహ్వానించుచు, సువిశాలాకాశము క్రింద నిరంతరము నవ్యసృష్టులతో తేజరిల్లు నక్షత్రాలయమును, మనము చూచుదుమేని, తమయం దెంతయో కపటమును, మోసమును దాచిపెట్టి, దీనమానవులను దరికిరాకుండ త్రోసివేయు చర్చీలు, మసీదులు, దేవళములును దేవ్వుఇపేరిటను, వాని పూజలపేరిటను పఱగు పరిహాసములేయని తోచుచున్నది. భక్తిభావమునకు నిదర్శనములగు వినయమును నిరాడంబరతను ప్రకటించుకొఱకేర్పడినవేగాని, మన దేవాలయములాడంబర ప్రదర్శన స్థానములుగా నుండుట కేర్పడినవి కావు.

దేవాలయము లుండుట పాపమని గాని, మూఢవిశ్వాసమనిగాని నే నెంచుట లేదు. ఏదో యొకరీతి సమిష్టి పూజావిధానమును, సమిష్టి పూజా క్షేత్రములును మానవునికి స్వభావ సిద్ధమగు ఆవశ్యకములేయని తోచుచున్నది. దేవాలయములలో విగ్రహము లుండవలయునా? కూడదా? యను ప్రశ్న వారివారి యభిమతమును, చిత్తవృత్తిని అనుస

రించియుండును, విగ్రహము లుండుటచేత హిందువుల యొక్కయు, రోమను క్యాతలిక్కుల యొక్కయు సర్వనాలయములు చెడ్డవనియు, మూఢ విశ్వాసమూలకము లనియు, మఱియు విగ్రహములు లేని కారణముచేత మసీదులును, ప్రొటెస్టెంటుల చర్చీలును మంచివనిగాని, మూఢ విశ్వాసరహితములని గాని నేను భావింపను. శిలువవంటి చిహ్నముగాని లేక పుస్తకముగాని సులభముగా విగ్రహతుల్యమై, తత్కారణమున మూఢవిశ్వాస జనకమై పఱగ దగును. మఱియు బాలకృష్ణుని విగ్రహమునుగాని, మేరీకన్య విగ్రహమును గాని పూజించుట మనను ఉద్ధరించునదిగను, మూఢవిశ్వాస రహితమైనదిగను నుండవచ్చును. అదంతయు పూజకుని యొక్క హృదయవైఖరి ననుసరించి జరుగును.

దేవళములన్నియు దేవతానిలయములు కావని కొంత విషాదకరానుభవమువలన తెలిసికొంటిని. అవి దయ్యాల కొంపలు కానోపును. వాని అధిపతి సద్భక్తుడుకాడేని, పూజాక్షేత్రములకు విలువ యేమాత్రము నుండదు. దేవళములు, మసీదులు, చర్చీలు నరుడు వానిని ఎట్టివానిగ చేయునో అట్టివై యుండగలవు.

'జాఫ్నా' దేవళముల కొన్నిటిలో, కొన్ని సమయము లందు వ్యభిచారిణులు వచ్చి నృత్యమును చేయుదురని నా కొక హిందువు లేఖను వ్రాసియున్నాడు. ఆ వార్తయే సత్య

మగుచో వా రా దేవాలయమును వెలయాలికొంపగా మార్చివేయు చున్నారని నేననవలసి యుండును.

ఒక దేవాలయము పూజాగృహముగను, దేవుని నిలయముగను నుండవలయుననిన, స్పష్టముగ నిర్ణీతమైన కొన్ని నియమములకు కట్టుబడియుండ వలయును. ఒక పూజాగృహమున కేగుటకు ఋషికెంతటి అధికారముకలదో వ్యభిచారిణికిని అంతటి అర్హత గలదు. అయినను ఆ వ్యభిచారిణి తనను పునీతగా చేసికొనుటకు దేవళమును ప్రవేశించినయెడల తన అర్హతను సద్వినియోగము చేసికొనిన దగును. కాని దేవాలయ ధర్మకర్తలు మతముయొక్క నెపముతోనో, లేక దేవతాపూజలకు శోభనొడగూర్చు మిషతోడనో, భోగకాంతనను రక్షించు నెడల వారా దేవతాగృహమును భోగముకొంపగ మార్చివేసిన వారగుదురు. ఎంతటి ఘనుడైనను నొక పురుషుడు మీ యొద్దకువచ్చి నాట్యముకొఱకుగాని, మఱి యట్టి యేపనికొఱకుగాని నీచవృత్తముగల స్త్రీలను దేవాలయములలోనికి రప్పించుటను సమర్థింపజూచు నెడల, వాని మాటను తిరస్కరించివేసి, నేను మీకు చెప్పిన సలహా ననుసరింపుడు. మీరు యోగ్యులగు హిందువులుగా నుండగోరుదురేని, మీరు భగవంతుని యుచితరీతిని పూజింప గోరుదురేని, మఱియు మీరు బుద్ధిశాలురగుదురేని, అస్పృశ్యులనెడు వారికి మీ దేవాలయముల కవాటములను బాహా

టముగ తెలిచివేయుడు. భగవంతుడు తన పూజకులలో తారతమ్యముల నెన్నువాడు కాడు. హృదయాంతరాళము నుండి వచ్చునదగునేని అట్టి పూజను 'స్పృశ్యులనబడు' వారి నుండి యెంత ప్రీతితో స్వీకరించునో, "అస్పృశ్యులనువారి" వలననుగూడ నంతటి ప్రీతితో స్వీకరించును.

ప్రాచీనులు రాతిద్వారమునను, లోహము ద్వారమునను భగవదాదేశమును ప్రచారము చేయుటకు మొదలు పెట్టిన, చరిత్ర కందరాని పురాతన శతాబ్దముల నాటికి, నా మనో భావము పరుగిడుచున్నది. ఆ కాలపు పురోహితుడు తాను స్వీకరించిన ప్రతివిగ్రహముయొక్క యంతరార్థమును చక్కగ వివరించుట గమనించుచున్నాను. ఆ విగ్రహములలో ప్రతి దియు దేవుడే నని ఆయన నాకుపదేశింపజూచుటలేదు. అయి నను సాంకేతిక భావములను నాకు తెలుపకుండను గూడ, అగమ్యుడును, అదృశ్యుడును, అనిర్వచనీయుడును అగు భగ వంతునకును, అపారసముద్రములో పరమాణువులంతటి చిన్న నీటిబిందువుల బోలు మనకును, మధ్య అనేకములగు వారధు లుగ ఈ దేవాలయములు ఒప్పుచున్న వని నేను గ్రహించు నటుల చేసినాడు. మానవ కుటుంబములోని మన మెల్లఱ మును తత్త్వవేత్తల మనుటకు వీలులేదు. మనము భూలోక వాసులమును, మిగుల స్థూలములగు భావములతో నొప్పు వారమునునై యున్నాము. మనము కండ్లార జూడజాలని పర

మాత్మను ధ్యానింపుమన్నచో సంతృప్తులము కాజాలము. ఏదోవిధముగా మనము తాకిచూడగలదియు, కండ్లతో లక్షింప గలదియు, సాగిలబడి మ్రొక్కగలదియు నేదో యొకటి కావ లయునని కాంక్షించుచున్నాము. అదొక పుస్తకమైనను, రిక్తమగా రాతికట్టడమైనను, వేర్వేఱు విగ్రహములతో నిండిన గుడియైనను మనకు సమ్మతమే. పుస్తకము కొందరిని తృప్తి పఱచగలదు. రిక్తగృహము కొందఱి కనురక్తి కూర్పగలదు. కాని యిట్టిరిక్తమందిరములలో అనేక విగ్రహములను నింపి చూచినగాని సంతుష్టి పొందజాలని వారును నున్నారు. కాబట్టి మీరీ దేవస్థానములను సమీపించునపుడు అవి మూర్తీభ వించిన మూఢవిశ్వాసరాసు లనెడు భావముతో అచటికి పోవలదని కోరుచున్నాను. అంతరంగమున భక్తినివ్వాని దేవ స్థలములకు పోవుచు రేని మీరు వానిని దర్శించినపుడెల్ల, వాని వలన పవిత్రవంతులై భగవంతుని యెడల నధికాధికముగా విశ్వాసము పెంపొందించు కొనినవారై, మీరు మఱలి వత్తు రనుట తథ్యము.

దేవాలయములకు పోవుటవలన మన మేదేని లాభము పొందుదుమో, లేక వ్యర్థముగా తిరిగివత్తుమో అనునది మన చిత్తవృత్తిపై నాధారపడియుండును. మన మీ దేవతానిల యములను వినమ్రభావముతో, పశ్చాత్తాప బుద్ధితో దర్శింప వలయును. అవన్నియు భగవంతుని నిలయములే. భగవంతుడు

ప్రతి పురుషాకృతియందును, మఱియు తన సృష్టియందలి ప్రతి యణువునందును, పుడమిలోని సర్వమునందును, అధివసించి యుండుననుట సత్యము. భగవంతు డట్లు సర్వవ్యాపియై వెలయుటను గ్రహింప జాలని మూఢమానవులము గావున, దేవాలయములకు ప్రత్యేకముగా పవిత్రత నారోపించి, భగవంతు డందుగలడని భావన చేయుచున్నాము. ఆ కారణము చేత మనము దేవాలయములను దర్శించునపుడు మన శరీరములను, మనస్సులను, మన హృదయములను శుద్ధిచేసికొనవలయును. ప్రార్థనాపూరిత హృదయులమై వానిలో ప్రవేశింపవలయును. అందు ప్రవేశించుటవలన పావనతర స్త్రీ పురుషలనుగ మనను చేయుడని భగవంతుని వేడుకొనవలయును. వృద్ధుడనగు నాయీ సలహాను మీరు స్వీకరించునెడల, మీ శారీరక స్వాతంత్ర్యముతో పాటు, ఆత్మశక్తిని సైతము సంపాదించుకొన గల్గుదురు.

## పంచమ భాగము

## దివ్య భావ మంజరి

నరు డల్పజీవి. నెపోలియన్ వీరు డేమేమో వ్యూహముల పన్ని సెంటుహెలీనాలో ఖైదీ యైపోయినాడు. యూరపు నంతటికి సామ్రాట్టు కాగోరిన కేజరు మహాశూరుడు సామాన్య మానవుడై చనినాడు. అట్లగుట ఈశ్వరేచ్ఛ. ఇట్టి తార్కాణములను మనస్సులో నిడుకొని వినయము ప్రధానముగాక.

ఖడ్గముపైన విశ్వాసమునకును, భగవంతునిపైని విశ్వాసమునకును నెంతమాత్రము పొత్తుకుదురదు.

నరుని కేదియు సాధ్యముకాదు; మఱియు నారాయణుని కేదియు అసాధ్యముకాదు.

మనము భగవంతునిచేతిలో గడ్డిపోచలీల నున్నాము. ఆయన తన కిష్టమువచ్చిన చోటికి మనలను 'ఉఫ్'ని ఊది వేయ గలడు. మనము వాని యిచ్ఛ నెదిరింపలేము. ఆయన మనలనందఱ నిట గూర్చియున్నాడు. సదా విడిపోవ నంగీకరింపడు.

భగవంతుడు తనభక్తుల నెంతెంతగనో పరిశోధించును; అయినను వారి సహనశక్తిని మించి పరీక్షింపడు. ఆయన వారిపై పడవేయు విపత్తులను దాటుటకు తగినబలమును వారి కొసగుచునే యుండును.

భగవంతుడే గతియని నమ్మి, వాని యొడిలో దూకుదుమేని దొరతనమువారు కల్పింపగల కఠినపరీక్షల నన్నిటినుండి నిరపాయముగా మనము వెలువడి రాగలుగుదుము. శివునాజ్ఞ లేనిది చీమయైనను కుట్టజాలదుగదా. అట్టియెడ ఈ దొరతనముద్వారా మనను భగవంతుడే పరీక్షించు చున్నాడని నమ్ముటలో కష్ట మేమున్నది? మన మొఱలనన్నిటిని భగవంతునికి తెలుపుకొనుచు, నింత క్రూరముగ మనలను పరీక్షించుటను గుఱించి వానిపైననే కోపింతుముగాక. మనము భగవంతునే పూర్తిగ నమ్ముకొందుమేని ఆయన మనను క్షమించి యోదార్పగలడు. క్రూరపాలకుల యెదుట సాహసముతో నిలబడు నుపాయము, మనను ద్వేషించినవారిని హతముచేయ జూచుట కాదు. మన యాపత్కాలమున భగవంతునెదుట నమ్రులమై నిలిచి వానిని గుఱించి మొఱలిడుటయెన్న. భగవంతుడెవనిని ధన్యునిచేయ నెంచునో వాని సత్యంతము కఠినముగా పరీక్షించును.

నేను నేర్చిన తమిళ పాఠములలో నొక సామెత నాకు సదా ముఖస్థముగ నున్నది. దాని శబ్దార్థమిది. 'నిస్సహా

య్యులకు భగవంతుడే సాహాయ్యము.' ఆ సత్యమునందలి విశ్వాసముమీద నాధారపడియే సత్యాగ్రహ మను మహా సిద్ధాంతము నిర్మాణమైనది. ఈ సత్యమును రుజువు పఱచు నట్టి నిదర్శనములు హిందువుల మతగ్రంథములందు నిండుగా గలవు. ఇతరు లందఱు విడనాడినను భగవంతు డెన్నడును కపన్నజనుల విడనాడ డని నేను గట్టిగ చెప్పగలను.

మనలో ప్రతివాడును తనపై తా నాధారపడి నిలబడు టను నేర్చుకొనవలయును. భగవంతు డొక్కడే మన కమోఘమును, శాశ్వతమును నగు మార్గమును జూపువాడు.

భగవంతుడు నిస్సాహాయ్యులకు సాయపడునే గాని, తామే మేలు చేయగల మని విశ్వసించు వారికి సాయపడడు.

భగవంతుని సేవయను భావముతో పాటుబడు పాకీవాడు సైతము భగవంతుని పేరిట తాను కేవలమొక ధర్మకర్తగ భావించుకొని యా భగవంతుడు తనకిచ్చు సంపదను సద్వినియోగము చేయునట్టి రాజుతో సమానమగు మన్ననను పొంద నర్హుడే. ఆ సంస్కృత జీవులమగు మన మధ్యమునందు జరుగు పనుల గాక, భగవంతుని దర్బారులో, ఉద్దేశ్యమే గుణనిర్ణయమునందు ఉపకరించును; కేవలము చేత లుపకరింపవు. చేసిన చేతలనుండి సంకల్ప మిట్టిదని మన మూహ చేయుదుము. భగవంతుడో సంకల్పమును, కార్యమును రెంటిని నెఱిగినవాడు గావున సంకల్పానుగుణ్యముగా కార్యముయొక్క

గుణమును నిర్ణయింప గలడు. భగవంతుని లెక్కల పుస్తకములో మనము చేయు కార్యములు మాత్రమే గణనలోనికి తీసికొనబడును గాని, మనము పఠించినవి గాని, మనము వచించినవిగాని గణనచేయబడవు. మంచివియు, చెడ్డవియు నగు నన్ని విషయములను గురించియు సరియైన లెక్క భగవంతుని దగ్గఱ నుండును. వానిని మించిన గణికుడు పుడమిని లేడు.

## భగవంతుడు కోరునది వినిర్మల త్యాగము

'బ్రహ్మచారి' యనగా భగవంతుని గురించి అన్వేషణము చేయువాడని భావము. సాధ్యమగునంత అత్యల్ప కాలములో భగవంతుని చేరగలుగునట్లు ప్రవర్తించు వాడే బ్రహ్మచారి. కలుష హృదయముగల స్త్రీ గాని, పురుషుడుగాని భగవంతునియొక్క వినిర్మలమగు ఘనసింహాసనము నెదుటికి పోజాలరనెడు ప్రధాన విషయమున ప్రపంచములో గల గొప్ప మతము లన్నియు పూర్తిగ నేకీభవించుచున్నవి. ఇతర విషయములలో నవి పరస్పరము భిన్నములుగ నుండిన నుండవచ్చును.

భగవంతుడు మహాకఠినపరిశోధకుడు. బాణసంచా ప్రదర్శనములవంటి యాడంబరముల గాంచి యెన్నడును తృప్తి గాంచడు. భగవంతుని యంత్రములు నిశ్చయముగను, నిరంతరముగను పనిచేయునవియైనను, చాల నెమ్మదిగను, సున్ని

తముగను తిరుగును. తత్తఱపడుచు మనము సలుపు జీవితపరి హారములతో భగవంతు డెన్నడును తృప్తిపడడు. పరమపావనుల హృదయార్పణమునే ఆయన వాంఛించును. కాబట్టి మీరును నేనును ప్రార్థనాపూర్వకముగా శ్రమపడుచు, మన కెంత జీవితకాలము నిర్ణయింపబడినదో యంతకాలమును జీవితముల గడుపుదుముగాక.

సాధ్యమగు నన్నివిధముల భగవంతుని పరిశోధించి యా పరిశోధన తమను రక్షించుకొనువారికి 'రామనామము' ఉపకరింపదు. భగవంతునెడ భయభక్తులు గలిగి, ఆత్మనిగ్రహము చేసికొనగోరియు, తాముగ పూనిక వహింప సమర్థులు గాని వారలకది మహోపకారి కాగలదు.

ఏదెట్లున్నను, సంశయముచేతను, నిరాశలచేతను హాతులైనవా రుందురు. అటువంటివారికి భగవన్నామము ఉపకరించును. ఎవడు తనవద్దకుదీనుడై నిస్సహాయుడై వచ్చునో వానిని బలసంపన్నుని చేయుదునని భగవంతుడు ప్రతిజ్ఞచేయుచున్నాడు. " నేను దుర్బలుడ కాగలుగునప్పుడే, నేను బలసంపన్నుడ నగుదు " నని సూరదాసకవి గానముచేసియున్నాడు. దుర్బలులకు రాముడే బలము. ఆయుధములు పూనుటచేతను లేక అటువంటి పన్నుగడలచేతను, ఈబలము లభ్యమగునది కాదు. ఇది భగవన్నామముపై పూర్తిగ ఆధారపడుటచేత మాత్రమే ప్రాప్తించును. ' రామా ' యన

భగవంతుని కొక పర్యాయనామమే. భగవంతుడనిగాని అల్లాయనిగాని లేక నీయిష్టమువచ్చిన మరేనామముతోగాని నీవు జపింపవచ్చును. నీ వనన్యగతికుడవై వానిని శరణుజొచ్చిన క్షణముననే నీవు బలవంతుడవు కాగలవు; నిరాశలన్నియు అస్తమించి పోవును.

భగవంతుని యందు అనన్యమగు విశ్వాస ముంచువారు తమ పరమ లక్ష్యమును చేరజాలకపోరు.

నేను భగవంతునియందు విశ్వాసము గలవాడను గాన, నే నొక్క క్షణమైనను వానియందలి శ్రద్ధను పోవిడువజాలను. భగవంతుడు నాకు ప్రసాదింప నిశ్చయించిన సుఖమో, దుఃఖమో నాకు సంతుష్టి నొసగును. కావున నాకు నిస్సహాయత తోచినను నే నెన్నడును ఆశను జారవిడువను.

ప్ర :- తమ అవిద్యాఽహంకారములతో యుద్ధముల సాగించి జయింపజాలక సలహాకొఱకు మీావద్దకు వచ్చు యువకులకు మీారేమి యుపాయము చెప్పెదురు ?

స:-ఏమున్నది? ప్రార్థనయే! ఒకడు పూర్ణముగ వినమ్రుడై పోయి ఆధారముకొఱకు, తనకు అతీతమై పఱుగు దైవీశక్తి దెసకు ముఖము త్రిప్పవలసి యుండును.

ప్ర :-ఈ యువకులు తమ మొఱ లాలింపబడుట లేదనియు, తాము జడమయాకాశముంగూర్చి మొఱలిడుచున్నట్లు తోచుననియు పలుకునెడల మీా రేమందురు ?

స:- తమ ప్రార్థనకు ప్రతిఫలము రావలయునని కోరుట భగవంతుని శోధనచేయుటే యగును. ప్రార్థనవలన సంతుష్టి చేకూరనియెడల, ఆ ప్రార్థన పెదవులనుండి మాత్రము వెలువడునదై యుండును. ప్రార్థనయే సాహాయ్యపడని యెడల, ఇతర మేదియును ఉపకరింపజాలదు. దానిని ఎడతెగక సాగింపవలసి యుండును. నేను యువకుల కొసగు నా సందేశమిది: 'తమ కిష్టము లేకున్నను, సర్వమును జయింపజాలు సత్యముయొక్కయు, ప్రేమయొక్కయు ప్రభావమునందు యువకులు విశ్వాసముపూని తీరవలయును.'

ప్ర:- మన యువకులకు గల కష్ట మిది. వారు చదువునట్టి భౌతికశాస్త్రమును, ఆధునికతత్వశాస్త్రమును వారి భక్తిని నాశనము చేసినవి. అందువలన 'అవిశ్వాసాగ్ని' వారిని దగ్ధము చేయుచున్నది.

స:- అట్లగుటకు హేతువేమనగా, వారి భక్తి బుద్ధి ద్వారమున సాధింపబడినదే గాని యాత్మానుభవముచే కలిగినది కాదు. జీవన సంగ్రామములో కొంతవఱకు మాత్రమే బుద్ధి తీసికొనిపోయి, దుర్ఘట సంఘటనాకాలమున నది మనల భంగపఱచును. భక్తియో తర్కమున కతీతమైనది. దిఙ్మండలమంతయు చీకటులుగ్రమ్మి, మానవుని తర్కము నేల కూల్పబడినప్పుడు, భక్తి దేదీప్యమానమై ప్రకాశింపుచు, మన కండయై నిలచును. అటువంటి భక్తి మన యువకుల

కీ నాడు కావలసియున్నది. మన బుద్ధి పాటవమును గుఱించిన గర్వము నడంచుకొని, యాశ్వరేచ్ఛకు సంపూర్ణముగ తల యొగ్గి నప్పుడది లభ్యము కాగలదు. ఉపవాసవ్రతము, ప్రార్థనలవంటి మహిమవంతములైన వేవియు లేవు. అవి నాకవసరమగు క్రమశిక్షణమును, స్వార్థ త్యాగ బుద్ధిని, నమ్రభావమును, చిత్తస్థైర్యమును ప్రసాదింపుచున్నవి. అవి లేనిది యథార్థమగు పురోవృద్ధి సాగదు. నేను నా మిత్రులకు నొక్కి చెప్పున దిది:- ధర్మమును గూర్చి నా మార్గము గొఱకై తడవుకొనుటలో నే నెంతమాత్రమును శ్రమకు వెనుదీయను. అన్వేషకులెల్లఱును త్రొక్కి తీరవలసినట్టియు, శ్రమకరమైయును రమ్యమగునట్టియు, ఆ మార్గమున పోవు నప్పుడు, నిరాడంబరమును నిరంతరము నగు సాధనయు, మౌనముతో చేయు ప్రార్థనయు, సదా విశ్వాసపాత్రమగు సహచరులుగా నా కుపకరించుచుండును.

> పట్టి ప్రార్థన మ్రోతమోగు కంచుతాళముల వంటిదే ?
> ప్రార్థన గలచోట సోమరితనమునకు తావుండజాలదు.
> విలువ తెలిసికొనకుండ మంత్రముల గొణుగుట
> పౌరుషహీన కార్యము.

వేఱుపడి చెల్లాచెదరై పోయిన సమాజమును ఏకముగా కూర్చుటకు, ప్రార్థనద్వారమున లభించు హృదయసంయోగ మును మించిన సంఘీకరణోపాయ ముండజాలదు.

దక్షిణాఫ్రికాలో నుండగా, సంవత్సరములకొలది నేను సాగించిన సాధన, నిరీక్షణమును, ప్రార్థనముల నభ్యసించుటే యనవలయును. అప్పటి నా పనిలో నత్యంతము ఫలప్రదమై యొప్పినది, మౌనముగా ప్రార్థనలో నేను గడపిన యా సమయమేనని నా దృఢవిశ్వాసము. నే నే స్వల్పమేని సాధింపజాలిన యెడల, అదంతయు ఆ సుస్థిరమగు పునాదిపై నాధారపడినదియే.

నిరీక్షణకును, ప్రార్థనకును అనుకూలములగు నవకాశములు నాకు సంతతము లభించుచుండెడివి. భక్తి పూరితమును, వినిర్మలమునునగు హృదయముతో జపించు నెడల రామనామ మత్యంత ప్రభావవంతమగును.

హృదయపూర్వకమగు ప్రార్థన నరములకు శాంతి నొసగి, వినయమును చేకూర్చి, ముందుమెట్టును విస్పష్టముగ చూపి నడుపుచుండును.

అప్పుడప్పుడు భగవంతుడు చూపు సూచనలను గ్రహించుటలో మానవజాతి చూపుచుండు మాంద్యము సుప్రసిద్ధమే. అజ్ఞానపు మూర్ఛనుండి మేల్కొని హెచ్చరికల నాలకించుచు, సర్వభూతము లందును లీనమైపోవుటే స్వస్వరూపమును గనుగొను మార్గము. దీనిని గ్రహించునటుల మేల్కొల్పుటకు ఈ నాడు మన చెవులలో తప్పెటలు మ్రోగింపవలసి వచ్చుచున్నది.

పూర్ణత్వము భగవంతుని విశిష్టలక్షణము; అది అనిర్వచనీయము. భాషాంతరముచేసి చెప్పుటకు వీలుపడదు. భగవంతుడు పరిపూర్ణుడై పలుగు విధమున నరుడును పరిపూర్ణుడగుట సాధ్యమని నా విశ్వాసము. మన మెల్లరము ఆ పరిపూర్ణత్వమును సాధించుట యవసరము. అప్పుడే దివ్యానుభూతిని బడసినప్పుడు మనలో అది నిరాఘాటమై, వర్ణనాతీతమై వెలుంగగలదు.

సక్రమముగను, సంపూర్ణముగను అర్థము చేసికొనినచో, బ్రహ్మచర్యము అనగా బ్రహ్మమును గూర్చిన అన్వేషణమే. ఆ బ్రహ్మము ఆ భగవంతుడు మనలోని ప్రతివాని యందును నుండును గాన, ధ్యానము యొక్కయు ప్రత్యక్షానుభూతి యొక్కయు సాహాయ్యముతో వానికొఱకై మన అంతర్యమున వెదుకవలసియున్నది. పరమాత్మ సాక్షాత్కారము సమస్తేంద్రియములను సంపూర్ణముగ స్వావశము చేసికొననిది సాధ్యపడజాలదు. కాబట్టి 'బ్రహ్మచర్య' మనగా తలపునందును, మాటయందును, చేతలందును, సర్వత్ర సర్వ కాలములయందును అన్ని యింద్రియములను స్వాధీన మందుంచుకొను నడత యనియే భావము.

భార్యాభర్తలు వివాహముయొక్క ప్రధానలక్ష్యమును గుర్తెఱిగినయెడల, సంతానముకొఱకై యే ఆ బ్రహ్మచర్యమును విడువదగదు. భార్యాభర్త లిద్దరును సంతానా

పేక్షచే ప్రేరేపితులయిన సమయమున తప్ప ఒండొరులను కామేచ్ఛతో తాకనైన తగదనుట బ్రహ్మచర్యముయొక్క స్వభావసిద్ధమగు శాసనముగ నున్నది. ఈ శాసనమును గుర్తెఱిగి ఏ నాలుగైదేండ్లకో యొకసారి బ్రహ్మచర్యదీక్షను విడుచువారు, కామమునకు దాసులుకాజాలరు. మఱియు తమ వీర్యశక్తి నంతగా కోల్పోవరు. ఓహో! కేవలము సంతానార్థమై సంభోగవాంఛకు లోబడువారు మిగుల నరుదుగదా!

మన కొక శిశువు కలిగినప్పుడెల్ల, భగవంతునియెడ కృతజ్ఞత జూపుచు ప్రార్థనాదికముల నర్పింపసాగుదుము. ఆ తీరున మన పాపచేష్టను మరుగుపఱుప యత్నించు చున్నాము. కాని దుర్బలురును, ఇంద్రియలాలసులును, వికలాంగులును, పిఱికిపందలు నగు సంతానము కలుగుటన, భగవంతుని యాగ్రహమేనని తలపోయవలయును గదా! కేవలము బాలురను, బాలికల పిల్లలం గనుట సంతోషింపదగు విషయమగునా? అది మహా ఘోర శాపముగా నెంచవలసి యుండును.

భగవంతుడు మన కొసగిన నిగూఢశక్తిని కఠినమగు ఆత్మసంయమమువలన నిరోధించి, కేవల శరీరముయొక్క మాత్రమేగాక, మనస్సు యొక్కయు, ఆత్మయొక్కయు శక్తి రూపమునను ప్రభావము రూపమునను ప్రకాశింపగా చేయవలయును సుడీ!

మన వయసు ముదిరినకొలదిని, మనబుద్ధి నిశితము గావలయును. మనము హెచ్చుకాలము జీవించినకొలది, మనము కూర్చిపెట్టుకొనిన అనుభవవిజ్ఞానమును తోడి మానవులకు అనుగతముచేయగల సమర్థత పెంపొందవలయును. యథార్థ బ్రహ్మచారుల స్థితి అటులుండును.

వారికి మరణమన్న భీతియుండదు; ప్రాణావసాన సమయమందు సయితము వారు భగవంతుని స్మరించుట మఱువరు; వ్యర్థప్రయాశలచే బాధపడరు. పెదవులపై చిరునగవు తాండవించుచుండ పుడమిని విడిచిచనుదురు. అట్టి వారెంతయు ధన్యులు!

## నిర్మమత లేక దారిద్ర్యవ్రతము

'నిర్మమత' యనునది అస్తేయముతో సంబంధము గలదిగా నున్నది. ఎవరేని తన కవసరము లేని యే వస్తువునైన తన కడ నుంచుకొనిన యెడల, అది మొదట దొంగిలించినది కాకపోయినను కూడ, దొంగిలిన సొత్తుగా పరిగణింపవలసిన దే యగును. సత్యాన్వేషకుడు ప్రేమధర్మము నవలంబించువాడు గాన, రేపటికని దేనిని దాచిపెట్టుకొన దగదు. భగవంతుడు దేనినిగాని రేపటికై దాచియుంచుట లేదు; ఆతడు ఏ క్షణమున కే దెంత కావలసి యుండునో, అంతకు మించి సృష్టించుట లేదు. వాని ఆధారమునందు మనకు నమ్మకమేయున్నచో ఆయన ప్రతిదినపు టాహారమును, అనగా మన కవసరమగు

దానినెల్ల, ఆ దినమే మన కొసంగునను నిశ్చయము మనకుండ వలయును. అటువంటి విశ్వాసము కలిగి జీవించు సాధువులు, భక్తులు తమ యనుభవము వలననే ఆ విశ్వాసము సరియైన దని గ్రహింపగలుగు చున్నారు. ఏ దినమునకు దగిన యాహార మాదినమున సరున కొసగబడుననియు, అంతకుమించి యొసగ బడదనియు తెలుపు దైవశాసనమును ఉపేక్షించుట వలన గాని, దాని నెఱుంగకుండుట వలన గాని, హెచ్చు తగ్గు సంపద లుండుటకును, వాని వలన మూడుచున్న యనర్థము లకును హేతువగుచున్నది. ధనికులు తమ కవసరము లేనట్టియు అధిక సంపదలను కలిగి యుంటున్నారు; ఆ కార ణముచేత వారు వానిని ఉపేక్షించుచు వ్యర్థమును చేయు చున్నారు. ఇట్లుండ లక్షలాది జనులు తినతిండిలేక మల మల మాడిచచ్చుచున్నారు. ప్రతి మనుజుడును తనకు కావలసి నంతమాత్రమునే గైకొను నెడల ఎవనికిని దారిద్ర్యముండదు; అందఱును సంతుష్టితో జీవింపగల్గుదురు. ఇప్పుడో పేదలతో పాటు ధనికులు సయితము తృప్తిలేనివారుగనే యుంటున్నారు. దరిద్రుడు లక్షాధికారి కాగోరుచున్నాడు; లక్షాధికారియో కోటీశ్వరుడు కాగోరుచున్నాడు. తుష్టిభావమును విశ్వవ్యాప్త ము జేయు నుద్దేశముతో ధనికులు మున్ముందుగా పూనిక వహింపవలయును. వారు తమ సంపదలను మితమగు హద్దు లలో నుంచుకొను నెడల, ఆకలిగొన్నవారికి అన్నము దొఱక గలదు; వీరును ధనికులతోపాటు తృప్తి పాఠములను నేర్వ

గల్గుదురు. నిర్మమతాదర్శము పూర్ణముగా సఫలతగాంచ వలయుననిన, మానవునకు సయితము పక్షులకువలె, తల దాచుకొనుటకు నీడయుండదగదు; వస్త్రముండరాదు; రేపటి కని ఆహారరాశి యుండ వలనుపడదు. వానికి అనుదినము ఆహారము కావలసియుండుట నిజమే. కాని దానిని సమ కూర్చి పెట్టుట భగవంతుని పనిగాని తనపని గాదు. ఈ ఆద ర్శమును చేరుట యెన్నడేని సాధ్యమగుచో, బహు కొలది మంది మాత్రమే చేరగల్గుదురు. అదటుల నసంభవముగా జూపట్టు కారణముచేత, సామాన్య అన్వేషకుల మగు మనము బెదరిపో నక్కఱలేదు. ఈ ఆదర్శమును సదా దృష్టిలో నుంచుకొనవలయును. దాని యాధారముతో మన సొత్తులను తీవ్రపరీక్ష చేసికోవలెను. మఱియు వానిని తగ్గిం చుకో ప్రయత్నింప వలయును. నాగరిక మనగా, యథార్థమగు నర్థముచేసినచో, మన యవసరవస్తువులను పెంపు చేసికొనుట కాదు, వానిని సప్రయత్నముగను బుద్ధిపూర్వకముగను తగ్గించు కొనుటయే సుడీ! దీనివలన సత్యమగుసౌఖ్యము, సంతృప్తి కలుగును; మఱియు సేవాసమర్థత వృద్ధికాగలదు. ఈ తీరుగా పరీక్షించి చూచినయెడల, మన యాశ్రమములోని వస్తువు లధికముగా నున్నవి; వాని యవసరమును మనము ఋజువు చేయజాలము. ఇరుగు పొరుగు వారికి దొంగతనము చేయవలెనను దుష్ప్రేరణను గూడ అందువలన కల్పించు చున్నాము.

వినిర్మలమగు సత్యదృష్టిలో శరీరము సయితము సంపద లోనె చేరును. ఆత్మకు భోగవాంఛవలననే దేహములు కల్పన చేయబడుచున్నవనెడు మాట ఎంతయు సత్యము. ఈ వాంఛ యంతరించుచో శరీరముతోడి యిక యవసరమే యుండదు. జననమరణ చక్రమునుండి నరునకు విముక్తి లభింపగలదు. ఆత్మ సర్వవ్యాపకము అట్టిది. పంజరమును బోలు శరీరములో బంధింపబడుట కేల సమ్మతింపవలెను? పాపమేల చేయును? ఆ పంజరము నిమిత్తమై ప్రాణిహింస చేయు టెందులకు? ఈ విధముగా విచారించి, సంపూర్ణ వైరాగ్యాదర్శమును మనము చేరగల్గుదుము. మఱియు శరీర మున్నంత కాలము దానిని సేవకొఱకు వినియోగము చేయ నేర్చుకొనగలుగుదుము. ఆ కారణముచేత తిండిగాక, సేవయే మనకు జీవితాధారమగును. అట్టి సేవ నిమిత్తమే మనము తినుటయు, త్రాగుటయు, నిద్రించుటయు, మేల్కొనుటయు జరుగును. అట్టి మనోవైఖరి మనకు సత్యమగు నానందము నొసగును; యుక్తకాలమున ముక్తిని సాక్షాత్కరింప జేయును. ఈ దృక్పథమునుండి మన మాత్మపరీక్ష చేసికొందుముగాక.

నిర్మమత యనునది సంకల్పముల కెట్లో, వస్తువులకును, అనువర్తించు ధర్మసూత్రమని మనము జ్ఞప్తినుంచుకొనవల యును. తన మెదడును వ్యర్థమగు జ్ఞానముతో నింపెడు మను

జుడు ఈ యమూల్య సూత్రమును భగ్నము చేసినవాడగును. భగవంతునినుండి మనను దూరము చేయునట్టిగాని లేక వాని వైపునకు మనను త్రిప్పజాలనట్టి గాని సంకల్పములును మన త్రోవలో నాటంకములే యగును. ఈ సందర్భమున శ్రీ భగవద్గీత పదమూడవ అధ్యాయమున గల జ్ఞాన నిర్వచనమును చూడదగును :

" అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతిరార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః
ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ
జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్
అసక్తిరనభిష్వంగః పుత్రదార గృహాదిషు
మయిచానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ
వివిక్త దేశసేవిత్వ మరతిర్జన సంసది
అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్
ఏతత్ జ్ఞానమితిప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా "

XIII ౮-౧౨

ఇందు వినయము అనగా అమానిత్వము, మొదలగున వన్నియు చేరి జ్ఞానమనియు తదితరము అజ్ఞానమనియు చెప్పబడినది. ఇది సత్యమనుటకు సందేహము లేదు. సత్యమని యంగీకరించునప్పుడు, మన మీనాడు జ్ఞానమని సంపాదించి ముఱియునది చాలవఱకు అచ్చమగు అజ్ఞానమే యగును; కాబట్టి దానివలన మనకు లాభము గలుగుటకు మారుగా అనర్థమే మూడుచున్నది. అది మనస్సును చంచలము చేయు

చున్నది; మఱియు రిక్తముగను చేయుచున్నది. అతృప్తి అనంతములగు ననర్థముల రూపమున రేగుచున్నది. ఈమాట సోమఱి తనమునకు సాకు కాదగదని చెప్ప నగత్య ముండదు. మన జీవితమున ప్రతి క్షణమును, మానసికమును శారీరకము నగు ప్రవృత్తితో నిండియుండవలయును సుడీ! అయినను ఆ ప్రవృత్తి సత్యమును (బ్రహ్మమును) దర్శింప తోడ్పడుచు సాత్త్వికమైనదిగా నుండవలయును. తన జీవితమును సేవా వ్రతమున కర్పించు మనుజుడు ఒక నిమిషమైనను సోమఱిగా నుండజనదు. కాని, యేది సత్కార్మయో, యేది దుష్కార్మయో తెలిసియుండవలయును కూడను. ఈ విచక్షణ సహజముగా అనన్యమగు సేవావ్రతము ననుసరించియుండును.

## అహింసయందున విశుద్ధప్రేమ

'అహింస' అనగా కొందఱు వర్ణించునటుల మూఢ విషయము కాదు. ఏ జీవిని బాధించకుండుట 'అహింస' యందొక యంశమనుటకు సందేహము లేదు. అయినను దాని ద్వారమున అహింస చాల స్వల్పముగ మాత్రమే ప్రకటితమగును. ప్రతి దుష్టసంకల్పము వలనను, వేగిరపాటు చేతను, అబద్ధమాడుటచేతను, ద్వేషము మూలముననను, ఎవరికేని కీడు కోరుటవలనను కూడ అహింసాధర్మము భగ్నమగుచున్నది. మఱియు లోకమున కవసరమగు దేని నేని యొకడాక్రమించుకొని యుండినను సయితము అహింస భంగపడి

పోవుచు. మరియు దినదినము మనము తిను తిండి సయితము ప్రపంచమున కవసరమే యగును. మనము నిలుచు తావున క్రోట్లాది సూక్ష్మజీవులు గలవు. ఈ స్థలము వానిదై యున్నది. మఱియు మన మిక్కడ నుండుటవలన వాని కపకారము జరుగుచున్నది. సరే, మన మేమి చేయవలసియుండును? ఆత్మహత్య చేసికొనవలయునా? ఆత్మ మాంసమయ శరీరము నాశించి యున్నంత కాలము, ఆ శరీరము నాశనమైనప్పటికిని, మఱొకదాని నది కూర్చుకొనుచుండునని మన విశ్వాసము గదా; కావున ఆత్మహత్య వలనను ఆ చిక్కు తీరజాలదు. మనము శరీరవాంఛను పూర్ణముగా వదలుకొనినప్పుడే దాని పుట్టుక అంతరించును. ఇట్టి వాంఛా రాహిత్యమే భగవంతుని సత్యరూపునిగ గ్రహించుస్థితి. అట్టి యనుభవము వేగిరపడిన లభించునది కాదు. ఈ శరీర మున్నంతకాలము అది మన స్వాధీనములో నుంచబడిన సొత్తుగా భావింపవలసి యున్నది. ఈ మాంస సంబంధి వస్తురాశిని అనగా భౌతిక సంపదలను పై విధముగా చూచి వర్తించుచు, ఏదో యొకనాడు ఈ శరీర సంబంధమునుండి విముక్తిబడయ నాశింపవచ్చును. శరీరము వలని ప్రయోజనములను, వాని పరిమితులను గ్రహించిన వారమై మన శక్తికొలది ఆదర్శమును చేరుకొనుటకై అనుదినము ప్రయత్నములు సాగింపవలయును.

పై వ్రాసినదానిని బట్టి, సత్యము నన్వేషించుటగాని, సాక్షాత్కరింప జేసికొనుటగాని, అహింస లేక సాధ్యపడదని

బహుశః స్పష్టపడి యుండును. అహింసయు, సత్యమును పెనవేసికొని యుండును; వానిని విడదీసి వేఱుచేయుట సాధ్య పడ జాలదు. అవిరెండును ఒకే నాణెముయొక్క రెండు ప్రక్క లనవచ్చును. అంతకంటె, నున్నని ముద్రలేని లోహపు రేకుయొక్క రెండు వైపులనుట లెస్స. అందు ఉల్టా యేదియో, సీదా యేదియో ఎవరు చెప్పగలరు? అట్లయ్యును, 'అహింస' సాధనమును, "సత్యము" సాధ్య మును ననవచ్చును. సాధనము సాధనముగా నుపకరించుటకు సదా మన కది అందుబాటులో నుండవలయును. కాబట్టి 'అహింస' మన పరమధర్మముగా నుండవలయును. సాధన మును గూర్చి మనము శ్రద్ధపూనిన యెడల, త్వరగనో, ఆలస్యముగనో సాధ్యమును ప్రాపించితీరుదుము. ఒక్కసారి ఈ యంశమును గ్రహించితిమా, తుది విజయముంగూర్చిన సందేహమే యుండజాలదు. మన కెటువంటి కష్టములు వాటిలినను, మన కెటువంటి యోటములు కలిగినను, మనము సత్యాన్వేషణమును వీడ దగదు. సత్యమే పరమాత్మ స్వరూపము.

## యజ్ఞము లేక బలిదానము

మనము 'యజ్ఞము' అను మాటను తఱచుగ వాడు చుందుము. నూలువడుకు పనికి నిత్యమహాయజ్ఞముయొక్క గౌరవపదవి నొసగుచున్నాము. కాబట్టి 'యజ్ఞ'మను శబ్దము

యొక్క వేఱువేఱు భావములను గూర్చి విచారణ సలుప వలసి యుండును.

'యజ్ఞ'మనగా, భౌతికముగ గాని, ఆధ్యాత్మికముగ గాని యేలాంటి ప్రతిఫలమును కోరక, యితరుల క్షేమము కొఱకై చేయు 'కర్మ'మని అర్థము. ఇచ్చట 'కర్మ'యను పదమునకును వ్యాపకార్థము చెప్పుకొనవలసి యున్నది. సంకల్పము, వాక్కు సయితము కాయికచేష్టతో పాటు కర్మలో నిమిడియున్నవి. 'ఇతరులు' అనగా మానవజాతియే గాక సమస్తజీవులు నని యెంచవలయును. కాబట్టి అహింసాదృక్పథము నుండి చూచు నెడల, మానవజాతి క్షేమముకొఱకని క్షుద్రజంతువుల సయితము బలియిచ్చుటను 'యజ్ఞ' మన లేము. జంతుబలి యర్పణము వేదములందు అంగీకరింపబడి యున్నదని చెప్పుటయు చెల్లదు. అటువంటి బలిదానము సత్యాఽహింసల పరీక్షకు తాళజాల దనుట మనకు చాలును. వేదపాండిత్యమున నాకు ప్రావీణ్యత లేదను మాట నొప్పుకొనుటకు నేను సంసిద్ధమే. ఆ నా యనర్హత, ఈ విషయ విచారణమునందు మాత్రము నన్ను బాధింపదు. ఏమన వేదకాలమునాటి సంఘమున జంతు బలిదాన మొక యాచారముగ నుండెనని రుజువు చేసి నను కూడ, అహింసాప్రతున కది నే డొక ప్రమాణము కాజాలదు.

ఇంకను 'మహాయజ్ఞమ'నగా అధిక విశాలప్రదేశమున, అత్యధిక సంఖ్యాకులకు మిక్కిలి క్షేమకరమగునట్టియు, స్వల్ప

తరకష్టముతో హెచ్చుమంది స్త్రీపురుషులు చేయగలట్టియు, కర్మమై యుండవలయును. ఏదియో పరమ ప్రయోజనమునకు అనువగునని చెప్పదగినను కూడ ఎవరికేని కీడు కోరుటగాని, కీడుచేయుటగాని 'యజ్ఞ'మన నే చెల్లదు. ఇంక 'మహాయజ్ఞ' మన చెల్లుటెట్లు! 'యజ్ఞము'ని పేర్కొనబడజాలని "కర్మ" లన్నియు బంధహేతువు లగునని గీత బోధించుచున్నది. అనుభవముగూడ ఋజువు చేయుచున్నది.

ఈ అర్థమున యజ్ఞములేకుండ నొక్క క్షణమేని లోకము బ్రతుకజాలదు. అందువలననే, గీత రెండవ యధ్యాయములో యథార్థ జ్ఞానముంగూర్చి బోధించిన యనంతరము, మూడవ యధ్యాయములో దానిని సంపాదించుకొను మార్గముం గుఱించి వివరింపబూని, 'యజ్ఞము' సృష్టితోసహా పుట్టివచ్చిన దని స్పష్టముగ చెప్పబడి యున్నది. కావున సకల సృష్టికిని సేవచేయు నిమిత్తమే మనకీ శరీర మొసగబడినదని గీత ప్రవచించుచున్నది. మఱియు యజ్ఞముచేయకుండ తిండితిను నతడు దొంగిలించిన యాహారమును తినునటులే యగుననియు గీత తెలుపుచున్నది. వినిర్మల జీవితమును గడుపువాని ప్రతి కర్మయు యజ్ఞస్వభావము గలదిగా నుండవలయును. యజ్ఞ మనునది మన జన్మతోడనే వచ్చినదగుటచేత యావజ్జీవము మనము ఋణస్థులముగనే యుండుచున్నాము. అందువలన లోకమునకు మనము సేవచేసితీరవలయును. దాసుడు తన

యజమానుని వలన అన్నము, బట్ట వస్త్రాలను పొందు తీరున, మనము జగదీశ్వరుడు ప్రసాదించువానిని కృతజ్ఞతా పూర్వకముగా స్వీకరింపవలసియుండును. మఱియు మనము తీసికొనుదానిని ప్రసాదముగా (లేక బహుమానముగా) భావింపవలయును. ఏలయన: మన విధాయక కర్మము మనము నెఱవేర్చినందుకై, ప్రతిఫలము కోరుటకు ఋణస్థులమగు మన కేలాంటి అర్హతయు నుండదు. కాబట్టి అలాంటి బహుమానము మనకొసగనియెడల యజమానుని మనము నిందింపరాదు. అతని యిచ్ఛానుసారము మన శరీరమును నాయన పోషించు కొననిండు. లేక పారవేసికొననిండు. ఈ దాస్యస్వభావము ఆక్షేపించుటకుగాని, మఱియు జాలిపడుటకు సయితము తగి నదికాదు; ఇంతేల ? భగవంతుని సృష్టిప్రణాళికలో మన యథార్థస్థానమును మనము గుర్తింపవలెనేగాని, అది సహజ మును, మఱియు ఆనందప్రదమును, వాంఛనీయమును నగు దశయనక తప్పదు. ఈ మహానందము ననుభవింపగోరుదు మేని, మనకు దృఢవిశ్వాస మగత్యమైయుండును. " మిమ్ము గూర్చి మీ రేమాత్రమును ఆందోళనపడకుడు. ఆందోళన మంతయు నీశ్వరుడికి వదలివేయుడు " అనుట సర్వమతము లందును గల శాసనముగా కాన్పించుచున్నది.

దీనికై ఎవరును భీతిల నవసరము లేదు. వినిర్మలాంతఃకర ణతో 'దాస్యధర్మమును పూనిన మనుజుడు, దాని యవసర

మును అధికాధికముగా దినదినము గ్రహింప గల్గును. మఱియు వాని విశ్వాసము నిరంతరముగా వృద్ధిగాంచును. స్వలాభపరతను త్యాగముచేయుటకు సిద్ధపడక, తన జన్మ నియమములను గుర్తింపజాలని నరుడు 'దాస్య' భావమును అనుసరింపనేజాలడు. తాను గుర్తించినను, గుర్తించకపోయినను గూడ మనలోని ప్రతివాడును, ఏదోయొకరీతి సేవను చేయుచునే యున్నాడు. ఈ సేవాసాధనను బుద్ధిపూర్వకముగ నల వఱచుకొనునెడల, మన సేవాభిలాష చక్కగ బలపడి, మన యానందమును పెంపొందించుటకేగాక, విశాల ప్రపంచము యొక్క యానందమును సయితము పెంపొందించుట కుపక రింపగలదు.'

ఏ భారతీయుడైనను ప్రస్తుతసమయమున చేయగల ఘన తమ ధర్మము ఖాదీపనిని వృద్ధిపరచుటే నని నా యభి ప్రాయము. మన ధనికమిత్రులు పేదలనబడు ప్రజల కుచిత ముగా భోజనము పెట్టుటన కుతూహల పడుదురు. కాని ఈ భోజనములు ధర్మమా యని నేను తఱచుగా శంకించు చుందును. పాత్రుడగు పురుషున కిచ్చిన దానము మాత్రమే యుత్తమమైన దని భగవద్గీత తెలుపుచున్నది. గ్రుడ్డివారికి, అంగహీనులకు ఏదోవిధముగా జీవనము సంపాదింప పాటు పడలేని వారికి అన్నమిడుట మంచిదే. కాని, భారతదేశ ములో యేబదివేల గ్రామములందలి వారికి భోజనము పెట్టు

టకు తగిన ఈ నిధిని మీ రందఱు కలిసి సమకూర్పజాలు నెడల, చాల ఘనకార్యమగు నని నేను వచింప సాహసించు చున్నాను.

రాటపరిశ్రమకు వ్యతిరేకముగా చాల వాదనలను విని యున్నాను. కాని యీనాడు తీవ్ర విమర్శపాలగుచున్న రాటమే సుదర్శనచక్రముగా పూజింపబడుకాలము సమీపమున నే కలదని నే నెఱుగుదును. ఐచ్ఛికముగా మనము దానిని చేతబట్టనియెడల, మనచే బలాత్కారముగ ఆ పనిని చేయించు నని నాకు గట్టినమ్మకము గలదు. భారతదేశపు ఆర్థికదశను విచారించుటన, రాటపరిశ్రమ విచారణయే యగును. శిథిలములై పోవుచున్న గ్రామపరిశ్రమల పునరుద్ధరించుట కిది మూలాధారమై వెలయును. నూలువడకుటన నొకవృత్తిగా నేను భావించుటలేదు; అయినను సకల మతములవారును సమస్త సంప్రదాయముల వారును పూనదగిన ప్రధాన విధాయక కర్మగా దీనిని నే నెంచుచున్నాను.

చేతిపనులపై విశ్వాసము గల జాతులవారే భవిష్యత్కాలమున ఐశ్వర్యవంతులు కాగలరని అమెరికా గ్రంథకర్త యొకరు పలికిరి. లెక్కకు మీరిపోవుచున్న యంత్రముల వృద్ధిని గాంచి పెక్కుజాతుల వారు విసిగి పోవుచున్నారు. అసమానములును, సజీవములు నగు నరశరీర యంత్రములను త్రుప్పుపట్ట విడిచివేసి, వానికి మారుగా

నిర్జీవ యంత్రముల తెచ్చిపెట్టి, వానిని నాశనముచేయు పాల్పడుచున్నాము. శరీరమునకు పూర్ణముగ పనిపెట్టి మన లోని దివ్యశక్తిని వినియోగము చేయుటే పరమగమ్య మగును.



ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి.